ఓంకారగ్రంథమాల,

ఓమ్.

# ప్రహ్లాదగాంధి.

## ప్రథమభాగము - లీలలు.

## ద్వితీయభాగము - తత్త్వబోధ.



ఓంకారనిలయవాసులచే

ప్రచురింపబడినది.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడెను

193

# పీఠిక.

ఈ గ్రంథమునకు పీఠికను వ్రాయ సాహసించిన నా కెట్టి యోగ్యత యుండవలెనో నాకే గోచర మగుటలేదు. కాని ప్రహ్లాదగాంధియొక్క జీవితచరిత్రాంశములలో కొన్ని నాకు స్వయముగ తెలిసియుండుటయు, ఆతని యవతారము సమాప్తి నొంది భౌతికకాయము కృష్ణానదీగర్భమునందు భూశయన మగు నప్పటిదృశ్యమును నేను కనులార జూచి యుండుటయు, యీ రెండు యోగ్యతలు తప్ప యీ పీఠికా రచనమునకు అన్యథా నా కెట్టి సామర్థ్యాధికారములును లేవని నేను ముందుగ విన్నవించవలసియున్నాను. మరియు, సన్నిహిత బాంధవ్యమును, చిరపరిచయమును కూడ పైన దెల్పిన నా యోగ్యతాధికారముల కొకింత బల మొసంగు చున్నవను సంగతిని నేను మరుగుపరచజాలను.

ప్రహ్లాదునియొక్కగాని, గాంధియొక్కగాని నామ మును ప్రత్యేక ప్రత్యేకముగ స్మరించినవారలకే జన్మము పావనమగుచుండగ, యీ రెండు పవిత్రనామము లను సంధించుకొని వ్యవహరించిన ఒకానొక వ్యక్తినిగూర్చి వ్రాయుట పుణ్యవిశేషము కాదని ఎవరు నుడువగలరు? పూర్వయుగమునందు రాక్షసులలో ప్రహ్లాదు డొక్కడు పుట్టి, తన జాతివారైన రాక్షసులనే గాక దేవతలు, మానవులు మున్నగు అన్యజాతులను సహితము తన జ్ఞానబోధచే పావన మొనర్చి వారిని తరింప జేసియుండెను. ఈ యుగమున మాన

వులలో గాంధియొక డుద్భవించి, తన దేశమైన భారతభూమి నేకాక, ప్రాచి, ప్రతీచి ఖండాంతరభూమినంతను తన యహింసాసందేశముచే పవిత్రి మొనర్చి శాంతింపజేయు చున్నాడు. ఇట్టి యుగసంధియందు ఆనాటి ప్రహ్లాదుని యొక్కయు, యీనాటి గాంధియొక్కయు నామములను జోడించుకొని ప్రహ్లాదగాంధియను నామద్వయమును ధరించిన యీ మూర్తి యెవరో కృష్ణాతీరమున ఓంకారనిలయమున నుద్భవించి, తన అంచిత్యాసందేశమును గ్రామ గ్రామ ముల దాటి తిరిగి కృష్ణానదీతీరముననే అవతారము చాలించి తన మాతామహునిద్వారా తన సమాధిసందేశమును చాటుచున్నాడు. ఈతడు భగవదంశసంభూతు డని యీ గ్రంథము తెలుపుచున్నది. ఈతని జన్మమునకు మాతా మహుని ప్రార్థనయే మూలకారణమని తెలియుచున్నది. నిరాకారచైతన్యమును ధ్యానసమాధియందు ఫలలబ్ధినొంద గల జ్ఞాని ఎట్టి యానందము ననుభవించునో, దృశ్యప్రపం చమునందు సాకారమూర్తికి కరచరణాదులచే ఔప చారిక పూజలొనర్చు భక్తుడును, అట్టి యానందమునే గ్రోలును. కాన అట్టి సాకారమూర్తికొఱకు ఓంకారనిలయ వాసులు తపంబొనర్చి సంపాదించిన వరప్రసాదమే యీ ప్రహ్లాదగాంధి యని యీ గ్రంథము స్పష్టపరచుచున్నది. మరియు, మాతృగర్భము నందుండగనే భగవద్గీతయొక్క పదు నెనిమిది అధ్యాయములును శ్రవణ మొనర్చిన అదృష్టమూర్తి యీతడు. ఈతని జననకాలరోదనధ్వని విశేషమునుబట్టి

ప్రక్కనున్న బ్రహ్మశ్రీ కోట చంద్రమౌళి సిద్ధాంతిగారు యీతనికి ప్రహ్లాదగాంధియను నామము యుక్తమని తలంచుట దైవికమై యున్నది

ఈ బాలుడు గాంధివలెనే భూతదయగలవాడు. ఎట్లన అనుదినము పిట్టలకు వానబోసిన గోధుమలను ఆహారము నిచ్చుటయు, మేకలకు ఫలములమీది చర్మములను వొలిచి పెట్టుటయు, బీదపిల్లవాండ్రకు పండ్లను పంచియిచ్చుటయు, చీమలు, ఈగలు మున్నగు అల్పజీవములను ఆదరముతో జూచుటయు, యీతని భూతదయకు నిదర్శనములగుచున్నవి. మరియు, ఆనాటి ప్రహ్లాదుని వలెనే ఈతడును భగవద్భక్త పరాయణుడేయని నిర్ణయించుటకు యీతని స్వల్పకాల జీవిత చరిత్రము సాక్ష్యమిచ్చుచున్నది. ప్రతిదినము నీ బాలుడు ఉదయముననే నిదురలేచి, స్నానమొనర్చి, విభూతిధారణానంతరము ఉద్యానవనమున ప్రవేశించి, తక్కిన బాలురతో గూడి,

"ఓం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

అని ప్రార్థనలు జరుపుటయు, యితరసమయములలో నెవరైన ఆ ప్రార్థన శ్లోకమును పఠించినచో యీ బాలుడు అప్రయత్నముగ చేతులను జోడించి మామూలుగ శ్రీరాముని పటము తగిలింపబడియుండు గోడవైపునకు తన దృష్టిని వెంటనే మరల్చి పెదవులను కదల్చుచు నేవియో కొన్ని పదముల నుచ్చరించుచుండుటయు, ఉద్యానవనమునందలి వివిధ జాతిపుష్పములను గోసి దేవతార్చనకై పుష్పముల నిమిత్తము

నిత్యము ఆశ్రమమునకు వచ్చు బాలబాలికల కందించుటయు, తేనెటీగలు తండోపతండములుగవచ్చి పూలతోటలోని మల్లె చెట్లగుబురునందు తేనెతుట్టెను పెట్టి ఝుం, ఝుం అని నిరంతర ప్రణవనాదము చేయుచుండ యీ బాలుడు యీ ఝుంకార నాదమును శ్రోత్రానందకరముగ వినుచు తోట లోని ఇసుకతిన్నెపై కూర్చుండి అందలి యిసుకను కుళ్ళ గించుచు, యీ ఝుంకార నాదముతో

"ఓం అచింత్యా"

అను తన మామూలు కీర్తనను మేళవింపజేసి తదేక ధ్యానముతో ఆయానందామృతగానములో లీనమగుచుం డుటయు, మధ్యాహ్నకాలమున తాతగారు ఫలాహారము చేయు సమయమున నీతడు పిల్లనగ్రోవిని నోటనుంచుకొని ఊదుచు, చిందులు ద్రొక్కుచు, అలనాడు వేణుగోపాలుడు యమునాతీరమున నిండుజాబిల్లి రాత్రియందు గోపికలమధ్య రాసక్రీడలు సల్పిన విధమున నీతడును, యింటిలోను, తోటలోను కలియతిరుగుచు నృత్యగానమును సేయుచు పర వశుడై యుండుటయు, యిత్యాది లీలలన్నియు ఆనాటి ప్రహ్లా దుని చేష్టలను తిరిగి స్మృతికి తెచ్చుచున్న వనుటలో అతి శయోక్తి యేమియు లేదు.

ఈ బాలుడు సంచారము చేసి వచ్చిన గ్రామములలోని బంధువులకును, మిత్రులకును ప్రేమభాజనుండై వారి యను రాగమునకు పాత్రుడగుచుండెను. తా నెవ రెవరిని సంతోష

పెట్టుటకై యవతరించెనో, అట్టి పుణ్యకార్యమును శ్వీరలోనే ముగించివేసినాడు

"తాతా! నేను వచ్చిన పని పూర్తియైనది. కాన నే నిప్పుడు తిరిగి నా స్వస్థానమున ప్రవేశించితిని." అని ఆకాశ వాణి పలికిన చందంబున నీ బాలుడు తనసమాధిసందేశ మును దెలిపియున్నాడు. ఇతని యవతారము సమాప్తికా నున్న దినమునకు క్రిందటిరోజున నీతనికి చిన్నబిడ్డ గుణము సంభవించుటయు, తనకు నిర్యాణము సంభవించినదని ఎల్ల రకును తెలుపుటకు గాబోలు తన చిన్నమేనమామలు రామ చక్రములో వ్రేలుపెట్టుమని కోరగనే యాతడు తక్కిన స్థాన ములను వదలివేసి 5 వ స్థానములోనే వ్రేలుపెట్టి తనకు కుంభకర్ణునిచే మరణము రానున్నదని సూచించుటయు, ఇయ్యవి దైవసంఘటనము లనుటకు సందియములేదు. ఈ తని సమాధి సందేశములోని కడపటివాక్యములు మాన వుని జీవితపరమావధిని, జన్మసాఫల్యమార్గమును, కరతలా మలకముగ బోధించుచున్నవి. ఈ సంసారమునందు మాన వులు బొందుచున్న సర్వదుఃఖములనుండియు, వారిని విముక్తు లను చేసి వారికి శాశ్వతానందము కలిగించుటయే ప్రహ్లాదుని సందేశముయొక్క సారాంశమైయున్నది. ప్రహ్లాదుని యొక్క యీ సందేశమే లేనిచో, "తత్త్వబోధ"యను నీ గ్రంథము నందలి ద్వితీయభాగము వెలువడి యుండజాలదు. ఈ తత్త్వ బోధను ప్రపంచమునందు ప్రచార మొనర్చి, జీవులకు దుఃఖోప శాంతిని గలిగించవలెనని ప్రహ్లాదుడు తన మాతామహు

నకు కర్తవ్యమును బోధించుటయేగాక యిందునిమిత్తము ప్రిష్టాదుడు పదేపదే, తాతగారికి కాన్పించుటయు, ఒక్కొక్కప్పుడు ఒత్తిడిని కూడ కలుగచేయుటయు, తటస్థించినట్లును నీ గ్రంథము తెలుపుచున్నది.

అయితే యీ లోకమును వదలినవారు తిరిగి కాన్పించుటయు, పైగా ఉన్నవారికి సందేశముల నంపుటయు - ఇత్యాదివిషయములు నాస్తికులైనవారికి విపరీతముగ తోచవచ్చును. కాని యేమాత్రము పారమార్థికచింతనము గలవారికైనను, నిహలోకముతో పాటు పరలోకము కలదనియు, ఈ దేహముగాక మరియొక దేహము గలదనియు, ఆ లోకవాసు లీ లోకవాసులతో నప్పుడప్పుడు సంభాషించుటకవకాశము కలదనియు, దృఢనమ్మకము కలుగకమానదు. ఇట్టి కార్యములు సుసాధ్యము లని ప్రకృతిశాస్త్ర మిప్పుడిప్పుడే కొంతవరకు ఋజువుచేయుచున్నది. ఈ కాలమున, నిస్తంత్రీ వార్తలు (Wireless messages) వాయుమార్గమున ఖండాంతరమునుండి వచ్చుచున్న విధముననే, లోకాంతరమునుండి సూక్ష్మశరీరముద్వారా పరలోకవార్తలు రాగల వనుట సత్యమని మానసికశాస్త్రవేత్తలు ధృవపరచుచున్నారు. ఇందులకు నిదర్శనముగ నిటీవలనే, స్వర్గమునుండి డాక్టరు బిసెంటమ్మగారు తన సహచరుడైన యోగి లెడ్బీటరుగారికి సందేశము నంపినట్లు 30-9-1933 తేది ఆంధ్రపత్రిక 14వ పుటలో ఒక వార్త ప్రకటింపబడియున్నసంగతి సర్వులకు విదితమేగదా! ఆ వార్తయం దిట్లు తెలుపబడినది.

"బ్రతికి యున్నవారి లోక మెట్లు తనకండ్ల కగపడు చున్నదో, చచ్చిపోయినవారి లోకము కూడ కండ్ల కగబడు చుండుటచే ఈ రెండు ప్రపంచములకు గల విభాగము బిషపు లెడ్బీటరుగారికి 1884 సం॥ నుండి లేకుండబోయినది. చనిపోవ కముందు లెడ్బీటరుగారు బిసెంటుగారితో నెట్లు మాట్లాడు చుండిరో యిప్పుడుకూడ నట్లే మాట్లాడుచున్నారు."

ఈ సమాచారమును నమ్మగలవారు మన ప్రస్తావ గాంధియొక్క సమాధిసందేశమును కూడ నమ్మగలరనుటకు సందియములేదు. ఇకను రెండవభాగమైన "తత్త్వబోధ" యందు చర్చింపబడినవిషయములలో "మరణభయము" అనునది ప్రతిగృహస్థునకును మేలొనగూర్చ దగినదియై యున్నది. ప్రతియింటను జననములతో పాటు మరణములు తటస్థించుచుండుట సహజము. కాని జననమువలన మనకు సంతోషము కలుగుటయు, మరణమువలన భయదుఃఖములు కలుగుటయు సంభవించుచున్నది. ఇట్టి స్థితిలో "భయమువలననే మరణముగాని మరణమువలన భయము లేదు" అని "తత్త్వబోధ" చర్చించి పరిష్కరించిన విధానము సర్వులకును ధైర్యస్థైర్యములను కలిగించు ననుట తథ్యము.

ఈ గ్రంథమునందలి ప్రథమభాగములోని బాలచేష్టలు, మరణవిలాపములు మున్నగు విషయములు సర్వసామాన్యములేగదా, వీనిని గ్రంథస్థము చేయుటవలన ప్రయోజనమేమి? అని కొందరు శంకింపవచ్చును. కల్పనాకథలు, పూర్వపుగాథలు గల పురాణేతిహాసముల మూలముననే మనకు

భక్తిజ్ఞాననీతివైరాగ్యములు కలుగుచుండగ, మన కండ్ల యెదుట జరిగిన యథార్థసంభవములమూలమున మనస్సునకు భావము సూటిగ నెక్కి తత్త్వము సులభముగ బోధపడక యుండునా? ఇందుకు నిదర్శనము నొక్కదానిని నీ గ్రంథముయొక్క ప్రథమభాగమునుండి యెత్తిచూపుచున్నాను. 51 వ పుటయందు "సమాధియొద్ద బిడ్డకు అన్నముపెట్టుట" అను శీర్షికక్రింద వ్రాయబడిన యంశములను చదివినప్పుడు ఎట్టి నాస్తికునకైనను దేహము కంపించి హృదయము జలదరింపక యుండునా? శాశ్వతవైరాగ్య మెట్లున్నను, శ్మశానవైరాగ్యమైనను కలిగింపకయుండునా? బిడ్డడు బ్రతికి యున్నప్పుడు అతని కిష్టముగల భోజ్యపదార్థములను అతడు చనిపోయిన పిమ్మట తీసికొనివెళ్ళి సమాధియొద్ద పరచి చేతులార నివేదించినపుడు తల్లిదండ్రులకు గలిగిన దుర్భరదుఃఖము బిడ్డలు కలవారికేగాక, బిడ్డలులేనివారికికూడ పొడకట్టకయుండునా? "ఇది గర్భనిర్భేదకమైనదృశ్యము" అని యీ గ్రంథము తెలుపుచున్న విషయము సత్యవిరుద్ధము కాజాలదు. నాకు తెలిసినంతవర కిట్టి హృదయవిదారకములైన సంభవములు రెండు విషయములలో కలుగుచున్నవి. మొదటిది భార్య చనిపోయినపుడు ఆమెపేరను ముత్తైదువులకు చేటలను పంచిపెట్టునట్టి దృశ్యము - రెండవది భర్తచనిపోయిన పదియవదినమున భార్యకు చేతిగాజులను పగులగొట్టి, మెడలోని మంగళసూత్రమును త్రెంచునట్టి దృశ్యము. ఈ రెంటిని కనులార గాంచువారికి దుఃఖము సహజముగ పొంగి పొరలి వచ్చుననుట

నిర్వివాదము. మరియు నాటకములలోని కల్పిత దుఃఖముల నుండియే, మనకు వైరాగ్యచింతన కలుగుచుండగ, మనగృహములలో రోజువారిగ జరుగుచుండు యథార్థదుఃఖసమాచారములను క్రోడీకరించియు, అట్టి దుఃఖములకు నివారణోపాయములను సాధించియు, బోధించిన యీ గ్రంథము యొక్క ఉపయోగమునుగూర్చి శంకించువారుందురని నేను విశ్వసింపజాలను. రెండవభాగములోని తత్త్వబోధ, సాధనచతుష్టయ సంపత్తిగల యేకొలదిమంది ముముక్షువులకో, రుచించునుగాని, సర్వసామాన్యుల కయ్యది విసువుపుట్టించవచ్చును. అట్టి విసువు నుపశమింప జేయుటకుగాను ప్రథమభాగములోని లీలావినోదము లెంతయో యుపకరించును. మరియు నీ లీలావర్ణనలను పఠించుటవలన చిరాకు చెందువారు వెంటనే రెండవభాగములోనితత్త్వవిచారమువైపునకుతమదృష్టిని మరలించి కొంత విశ్రాంతి నొందుటకు గూడ యవకాశముగలదు.

అష్టాదశపురాణములను, పంచమవేద మనబడు మహాభారతమును రచించియు, వేదవ్యాసునివంటిమహామునీంద్రుడు చిత్తశాంతి లేక మనోవేదనను నొందుచున్నతఱి దేవఋషియగు నారదుఁ డేతెంచి యిట్లనియె.

నార—ఋషిపుంగవా! ఏల యీ దినమున మీరు మనోవ్యాకులముఁలో మునిగియున్నారు?

వ్యాసు—స్వామీ! సమస్తధర్మశాస్త్రములను, పురాణములను రచించినవాడ నయ్యు నేలొకో నా మనంబునకు శాంతిసమాధానములు కలుగలేదు.

నార—ఆనందరసమును పురికొల్పు భగవంతుని లీలావిశే షమును వర్ణనము చేయక కేవలధర్మములను గూర్చి రచన మొనర్చితివి. భగవానుని చారిత్రవిషయము లతో సమ్మేళనము నొందని కేవలశుష్కధర్మము రస మెండిపోయిన వరుగు వంటిది. ఆ ధర్మములు ఉప్పు లేని చప్పిడిమెతుకులవలె నుండును. కాన భక్తిరసమును గలిగించు భగవంతుని లీలావిలాసము లను గూర్చి గ్రంథమును వ్రాయుము. అప్పుడు నీ చిత్తమునకు ఉత్తేజము కలుగును.

అని చెప్పి నారదుడు వెడలిపోయెను. ఇట్లు నారదుని సాదరవాక్యముల ననుసరించి వ్యాసుడు లీలామానుషవిగ్ర హుడగు భగవానునికథలను, లీలలను విశేషముగ వర్ణిం చుచు, శ్రీమద్భాగవతమను ఉత్తమగ్రంథమును రచించినవా డాయెను. అందు ముఖ్యముగ శ్రీకృష్ణుని బాలక్రీడలను వినోదములును ప్రేమను పురికొల్పుచున్నవి. యశోద తన కుమారుని పలుపుతో రోటికి కట్టివేయుట, నోటిలోని మట్టి పెళ్ళలను చూపుమని తల్లి కుమారుని దండించుట, కృష్ణుడు గొల్లవాండ్ర ఉట్టిమీది వెన్నను దొంగిలించుట, గోపికల వస్త్రముల నెత్తుకొనిపోయి పొన్నచెట్టుపై నుంచి వారితో పరి హాసములాడుట - ఇత్యాది పిల్లచేష్టలను మన భాగవతగ్రంథ ముచుండి తొలగించినచో శేషించిన ధర్మములు సారవిహీన ములై యుండగలవని భక్తశిఖామణులెందరో తెలిపిన సంగ తులను మన మిప్పుడు జ్ఞప్తికి తెచ్చుకొనవలసి యున్నాము.

కాన నీ గ్రంథముయొక్క ప్రథమభాగములోని బాలక్రీడలును, ద్వితీయభాగములోని అతీంద్రియవిషయములను పరస్పర సహకారములై పాఠకులకు గ్రంథపఠనమునందుత్సాహమును, ఉల్లాసమును కలిగించు ననుట సత్యము. ఉల్లాసము మాట యెట్లున్నను పాఠకులకు వైరాగ్యమును, ఆత్మజ్ఞానమును కలిగించి తద్ద్వారా సంసారతరణోపాయంబును గలిగించు ననుటకు సందియము లేదు. ఇట్టియదృష్టమును మన కందరకును కలిగించుటకై కనకదుర్గాక్షేత్రమునందలి ఓంకారనిలయమందు మన ప్రహ్లాదగాంధి యుద్భవించి అచ్చటనే అవతారసమాప్తినొంది ఆ ఓంకారనిలయవాసులచే లోకసంగ్రహార్థ మీ యుత్తమగ్రంథమును ప్రకాశమొనర్పజేసి నందులకు ఆ ప్రహ్లాదగాంధికి మన మందరము కృతజ్ఞులమై యుండవలసియున్నాము. ఈ గ్రంథపఠనమువలన లోకములో నొక్క పురుషుడుగాని, లేక ఒక్క స్త్రీగాని శుభమును బడయగల్గినచో మన ప్రహ్లాదునిసంకల్ప మీడేరిన దని సంతసింపవచ్చును.

ఆర్యులారా! ప్రహ్లాదుని గన్న తల్లిదండ్రుల గర్భము పవిత్రమైనది వీరివంశము పావనమైనది. ఓంకారనిలయము పుణ్యవంతిమైనది. ఓంకారనిలయవాసులు ధన్యులైరి. ఈ గ్రంథమును పఠించుట కవకాశము గలిగిన సోదరీసోదరులు చరితార్థులైరి. ఎట్లన,

ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః,
ధన్యా చ వసుధా దేవి యత్ర స్యాద్గురుభక్తతా.

అనగ, 'ఏ కులమునందు భగవద్భక్తు డుదయించునో, అట్టివాని తలిదండ్రులు ధన్యులు. ఆ వంశము పావన మగును. ఆతడు వసించిన గృహమును, భూమియు పుణ్యవంతము లగు' నని తాత్పర్యము. మఱియు,

కృతార్థా పితరౌ తేన ధన్యో దేశకులంచ తత్,
జాయతే యోగవా న్యత్ర దత్త మక్షయ్యతాం వ్రజేత్.
దృష్టసంభాషితస్పృష్ట పుంప్రకృత్యో ర్వివేకవాన్,
భవకోటిశతాపాతం పునాతి వృజినం నృణాం.

అనగ, "ఒక్క జ్ఞానయోగివలన వాని తలిదండ్రులు కృతార్థు లయ్యెదరు. వాని దేశము ధన్య మగుచున్నది. ఆతడు జన్మించిన కులము అక్షయ్యము కాగలదు. వానిని దర్శించినవారును, వానిచే సంభాషింపబడిన వారును, వానిని తాకినవారును, పుణ్యాత్ము లయ్యెదరు. ప్రకృతిపురుషవివేకముగల అమ్మహాత్ముడు శతకోటిజన్మముల పాపములనుకూడ హరింపగలడు' అని అర్థము.

ప్రహ్లాదా! నీ నామ మీ లోకమున చిరస్థాయిగా నుండుగాక! నీ వంటి లోకపావనులును, వంశపావనులును, ఈ పృథ్వీతలంబున అసంఖ్యాకులుగ అవతరించెదరుగాక! నీ దివ్యసందేశమును మేము మరువకుందుముగాక!

పాఠకమహాశయులారా! లోకమునం దేదో విధముగ దుఃఖముచే బాధపడనివారు కల రని చెప్పగలమా! ప్రతివారును ఏదో విధముగ నెప్పుడో యొకప్పుడు పూర్వకర్మానుసారము దుఃఖములను పొందక తప్పదు. కాన దుఃఖమును

నివారించుకొనుటకై ప్రియత్నము సలుపక తప్పదు. అట్టి దుఃఖనివారణోపాయంబును బోధించిన యీ గ్రంధము ముఖ్యముగ ప్రిహ్లాదుని ఆత్మబంధువుల యుపయోగార్థము రచింపబడినదైనను, నిందలి లాభమును బడయుటకు సర్వులకును అవకాశము గలదని విన్నవించుచున్నాను.

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు,
సర్వేజనా స్సుఖినో భవన్తు,
ఓంశాంతి శాంతి శ్శాంతిః.

బెజవాడ,
28—10—33.

ఇట్లు విన్నవించు బుధజన విధేయుడు,
అద్దేపల్లి పమిడయ్య.



# విషయసూచిక.

## ప్రథమభాగము — లీలలు.

# ద్వితీయభాగము — తత్త్వబోధ.

# ప్రహ్లాదగాంధి.

## ప్రథమ భాగము - లీలలు.

### ఓంకారనిలయము.

పూర్వము దండకుడు ఏలిన స్థానము, ఇప్పుడు దక్కను పీఠభూమి. ఒకవైపున 'తూర్పుకనుమలు' అను పర్వతపంక్తి సర్వాకారముగ నావరించి యున్నది. వజ్రతుల్యమై అభేద్యమైన యీ కొండలశ్రేణిని మృదువైన యొక జలరాశి చీల్చివైచినచోటిది. పాశుపతాస్త్రముకొఱకు విజయుడు ఈశ్వరుని గూర్చి తపం బొనర్చిన దిచ్చటనే. ఇటు సేతువునుండియు, అటు శీతనగమునుండియు నేతెంచు తీర్థయాత్రపరులు జలకమాడుటకై మధ్యమార్గమున, దిగునట్టి విశ్రాంతిస్థల మిది. అటు భద్రాద్రినుండియు, ఇటు కొండవీటినుండియు వచ్చి దుర్గమ్మతల్లికి మొక్కులు చెల్లించు మల్లికార్జునక్షేత్ర మిది. ఆ కొండ, యీ కొండ మధ్యను ఏటిలో రాతిగోడను కట్టినది యిక్కడనే. ఆ యొడ్డున ఈ యొడ్డున వేంచేసియున్న శివకేశవుల మధ్య ఎడ ముండరాదని యినుప వంతెనను కట్టినది యిక్కడనే. నలుదిక్కులనుండి వచ్చు రైలు మార్గములు కలిసిన కూడలి యిదియే. ఇట్టి శ్రీవిజయవాడ పురమునందు కృష్ణవేణీ పుణ్యవాహినీతీరమున నున్న, ఇంద్రకీలాద్రిపర్వతపాదతలంబున, 'ఓంకారనిలయము' అను నొక

గృహస్థునిభవనము కలదు. ఈ గృహస్థుడు మద్రాసు విశ్వ విద్యాలయమునందు బి. ఏ., బి. యల్. పట్టముల నొంది 1910 సం॥ నవంబరు 1-వ తేదీ మొదలు 10 సంవత్సరములు గుంటూరు జిల్లా తెనాలి డిస్ట్రిక్టుమునసబుకోర్టులోను, పిమ్మట రెండు సంవత్సరములు, 1922 సం॥ నవంబరు 1-వ తేదీ వరకు, బాపట్ల సబార్డినేట్ జడ్జి కోర్టులోను-మొత్తము 12 సంవత్సరములు న్యాయవాదివృత్తి నవలంబించి తుదకు నైహికవిషయములయందు వైరాగ్యము కలిగి, ముముక్షువై జిజ్ఞాసువై తన వృత్తిని, యొక్క తుత్రిటికాలములో విసర్జించియుండెను. నాటినుండియు వీరు విజయవాడపురమున నివాస మేర్పరచుకొని కృష్ణాపవిత్రతోయముల స్నానాదికృత్యము జరుపుకొనుచు, భగవత్సేవాపరాయణులై ఆత్మవిచారమునందు కాలము గడుపుచున్నారు.

## జ్ఞాన ప్రసూనాంబ.

ఈ గృహస్థునకు 5 గురు పుత్రసంతానమును, 3 గ్గురు పుత్రికాసంతానమును కలరు. వీరిలో జ్యేష్ఠపుత్రిక జ్ఞానప్రసూనాంబకు అక్షయ సం॥ వైశాఖ శు ౯ శుక్రవారమున (21-5-1926) తేదీన యథావిధిగ వివాహము జరుపబడెను. వరుడు, గుంటూరుజిల్లాలో సముద్రతీరముననున్న కనుపర్తి గ్రామవాసి, శ్రీయుత కాకరపర్తి సుబ్బయ్య శ్రేష్ఠిగారి జ్యేష్ఠ పుత్రుడు జ్వాలానరసింహమని పేరుగలవారు. ఈయన బి.ఏ పట్టపరీక్షయందు కృతార్థుడై యున్నాడు. ఈ దంపతు లిరువు

రును అన్యోన్యప్రేమబద్ధులై భగవద్భక్తియుతులై యున్నారు. జ్ఞానప్రసూనాంబ బాల్యమునుండియు భగవత్కథలను చదువుటయందును, పురాణశ్రవణము చేయుటయందును అత్యంతాసక్తితో నుండుచుండెను. ఈమె తన జనకుని సమక్షములో ధర్మశాస్త్రమునందలి యుత్తమధర్మములను గ్రహించియు, భారత, భాగవత, రామాయణ, అష్టాదశ పురాణసారమును సంగ్రహముగ గ్రోలియు, గురుభక్తి గలిగి మెలగుచుండెను. అచ్చటచ్చట సభలలో వివాహధర్మములను గూర్చియు, ఖద్దరు పరిశ్రమావసరమునుగూర్చియు, స్త్రీ విద్య, గృహనిర్వహణము, భక్తిజ్ఞానవైరాగ్యములు- ఇత్యాది సద్విషయములనుగూర్చియు నుపన్యాసముల నిచ్చుచుండెను. ఈమె భర్తగారికి బావగారైన శ్రీయుత ఊటుకూరి వేంకట సుబ్బారావు శ్రేష్ఠిగారు తన స్వగ్రామమైన వేటపాలెములో సారస్వతనికేతన మను పేరుతో నొక గొప్పగ్రంథాలయ మును, పఠనమందిరమును స్థాపించి తాను దానికి శాశ్వత ధర్మకర్తలై యున్నారు. వీరు ప్రతిసంవత్సరము దేవీనవ రాత్రములలో గ్రంథాలయ వార్షికోత్సవసభలను అతివైభవ ముగ జరుపుచుందురు. ఈ సభలకు ఆంధ్రదేశములోని యుత్తమనాయకులను అధ్యక్షులుగ నేర్పాటుచేసియు, సుప్రసిద్ధపండితులను, విద్యానిపుణులను ఆహ్వానించి వార లచే మహోపన్యాసముల నిప్పించియు, శ్రోతలమనంబుల రంజింపజేయుచుందురు. ఈ గ్రంథాలయముయొక్క ప్రభవ సంవత్సర (1927) వార్షికోత్సవమహాసభకు సుప్రసిద్ధ

గీర్వాణపండితులును, అవధానిశిరోమణియు నగు శ్రీమార్గ కాశీ కృష్ణాచార్యులవారు అధ్యక్షత వహించిరి. ఈ సభలో త్రయోదశవర్ష ప్రాయయు విద్యావతియు నగు చి॥ సౌ॥ జ్ఞాన ప్రసూనాంబ భక్తిప్రపత్తిని గూర్చి శాస్త్రప్రమాణ యుతముగ మృదుమధురవచనములతో నొక గంటకాలము ధారాళముగ నుపన్యసించియుండెను. సభాధ్యక్షులును, సభికు లును ఆనందపరవశు లైరి. ఉపన్యాసమునకు మెచ్చి రాజ మహేంద్రవర గౌతమీగ్రంథాలయ కార్యదర్శిగారైన శ్రీయుత నారాయణ దేవుగారు కొన్ని ప్రశంసావాక్యముల బలి కిరి. సభాధ్యక్షులగు కృష్ణాచార్యులవారు ఈ బాలికను దగ్గరకు బిలిచి బుజ్జగించి, యామెయొక్క భక్తిని కీర్తించి, యామెకు "ప్రహ్లాదిని" అను గౌరవనామ మిచ్చితి మని బహిరంగసభలో వెల్లడించిరి. అప్పు డందరును కరతాళ ధ్వనులతో తమ సంతసమును వెలిబుచ్చిరి.

## గర్భధారణము.

ఇట్లు ఉత్తమపండితులవలన ప్రహ్లాదిని అను భక్త బిరుదమును బడసిన యీ జ్ఞానప్రసూనాంబగర్భమున భగ వానుని ప్రేమకళారేఖ ఆవిర్భవించి ప్రహ్లాదునివంటి భక్తాగ్ర గణ్యుడు జన్మించుగాక యనియు, అట్లు జన్మించబోవు బిడ్డడు ఈశ్వరచిత్కళామూర్తియై తమచే ఉపచారములు చే యించుకొనవలె ననియు, ఈమె జననీజనకులు ప్రార్థ నలు సలిపిరి. ఈ ప్రార్థనల కనుగుణముగ 1930 సం॥ శ్రావణ మాసమునందు జ్ఞానప్రసూనాంబ గర్భమును దాల్చెను.

అప్పుడామె కనుపర్తిలో తనయత్తవారియింట నుండెను. కొన్ని మాసము లచ్చటనే యుండి, పిమ్మట తన ఆడుబిడ్డ గ్రామమైన వేటపాలెమునకు వెళ్లి కొలదిదినము లచట కాలము గడపెను. ఇంతలో నీమెకు 5 వ మాసము వచ్చెను. పిమ్మట ఈమెను తల్లిదండ్రులు వెళ్లి, బెజవాడలో పుట్టినింటికి తోడ్కొని వచ్చిరి. గర్భము దాల్చుటకుపూర్వము కొన్నిదినము లీమె అపక్వాహారమును సేవించుచుండెను. పూర్వాభ్యాసవాసనచే గర్భవతి ఫలములనే కోరుచుండెను. ఈమె కోరినఫలములను తలిదండ్రులు తెచ్చియిచ్చుచు, ఈమెయొక్క మనోరథముల దీర్చి తృప్తినొందించుచు వచ్చిరి. గర్భమున ప్రవేశించినవాడు సాక్షాత్ పరమేశ్వరుడే యనియు, 10 వ మాసమునకు నిండుచూలు వచ్చి శిశువు భూపతనమగువరకు గర్భస్థదేవునకు ఏవిధముగ నుపచారములు చేసి కృతకృత్యులము కాగలమనియు గర్భవతియొక్క తలిదండ్రులు దీర్ఘముగ యోచించిరి. సాక్షాత్ నిరాకారచైతన్య మిప్పుడు సాకారము నొంది గర్భగోళమునం దున్నాడు. ఈ సాకార, నిరాకారమూర్తిని, ఈ సగుణ నిర్గుణ బ్రహ్మమును ఓంకారనిలయ వాసు లిప్పుడు సంతుష్టాత్మునిగ చేయదలచినారు భగవానునకు నామసంకీర్తన చేయుటయా? లేక షోడశోపచారపూజ సల్పుటయా, లేక జపతపోధ్యానాదులచే సేవచేయుటయా? అను కర్తవ్యమునుగూర్చి వారు బహుభంగుల విమర్శించి అక్షరపరబ్రహ్మతత్త్వమును శ్రవణాదులు చేయుటయే

భగవానునకు మిక్కిలి ప్రీతికరమగు నని వారు పర్యవసాన మును తేల్చుకొనిరి.

గర్భస్థ శిశువునకు గీతోపదేశము.

శ్లో॥ వేదేషుయజ్ఞేషుతపస్సుచైవదానేషుయత్పుణ్యఫలంప్రదిష్టం
అత్యేతి తత్సర్వమిదంవిదిత్వాయోగీపరంస్థానముపైతిచాద్యం.

అనగ, 'జ్ఞానయోగనిష్ఠుడైనవాడు ఈబ్రహ్మజ్ఞా నము నెరిగి, వేదములయందును, యాగములయందును, తప ములయందును, దానములయందును, ఏ పుణ్యఫలము చెప్ప బడియున్నదో, ఆ సమస్తఫలములను అతిక్రమించుచున్నా డు. మరియు, మూలకారణమైనదియు, ఉత్కృష్టమైనదియు బ్రహ్మమును పొందుచున్నాడు.' అని అర్థము. ఇట్టి బ్రహ్మ జ్ఞాన మెచ్చట గలదు? శ్రుతిశిరములగు ఉపనిషత్తులయందు గలదు. ఉపనిషత్సారభూతమైనది భగవద్గీతయేకదా! కాన జన్మరాహిత్యమును కలుగజేయునది భగవద్గీత తప్ప మరి యొకటి కానరాదు. ఏలయన, పంచమవేద మనబడు మహా భారతముయొక్క సారమే భగవద్గీతయైయున్నది. మరియు, తక్కిన శాస్త్రములు మనుష్యమాత్రులచే వ్రాయబడి యున్నవి. కాని భగవద్గీత సాక్షాత్తు శ్రీమన్నారాయణుని ముఖమునుండియే వెలువడియున్నది. ఎట్లన,

భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతం
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే.

అనగ, 'భారతామృతసర్వస్వమైన భగవద్గీత యనెడి గంగోదకమును పానముచేసినచో తిరిగి జన్మము లేనట్టి మో

క్షము ప్రాప్తించును' అనియర్థము. ఇట్టి మోక్షప్రదమైన భగవద్గీతను గర్భవతికి బోధించువ్యాజమున గర్భస్థశిశురూప మున నున్న భగవానునకు నిత్యమును నియమితకాలమున వీరు నివేదించుచుండిరి. గర్భస్థపిండము వృద్ధినొందుకాల మున కావింపబడు ధర్మబోధవలన మాతృశిశువులకు భక్తి జ్ఞానములు అలవడు ననుటకు ప్రత్యక్షప్రమాణములు కలవు. పూర్వకాలమున ప్రహ్లాదునితల్లి లీలావతి గర్భవతిగా నుండిన సమయములో, త్రిలోకసంచారియు దేవఋషియు నగు నార దుడు వచ్చి యామెకు భగవానునిభక్తితత్త్వమును గానము చేసియుండెను. ఈ భక్తిరసామృతమును గర్భస్థశిశువు గ్రహిం చినవాడగుటవలన లీలావతిగర్భమున భగవదంశసంభూతుడైన ప్రహ్లాదుడుదయించె నని భాగవతాదిగ్రంథములు ప్రకటించు చున్నవి. మఱియు మహారాష్ట్రచక్రవర్తియగు శివాజీయొక్క తల్లి గర్భవతిగా నున్నకాలమున ఆమె గురువులవారు ఆమెకు మహావీరులచారిత్రకథల వినిపించియుండినందున ఆమె గర్భము నుండి అఖిలభారతసామ్రాజ్య చక్రవర్తియైన శివాజీ యుదయించెను. మన జ్ఞానప్రసూనాంబయు, తాను పుట్టి నిల్లు చేరిన అయిదవమాసముమొదలు తొమ్మిదిమాస ములు పూర్తియగువఱకు తన తండ్రిగారివలన గీతామృత మును గ్రోలియుండెను. ఇట్లు భగవద్గీత 18 అధ్యాయముల పారాయణము పూర్తియగుసరికి ఈమెకును నవమాసములు నిండ వచ్చెను.

## ప్రహ్లాదుని జననము - నామకరణము.

'ప్రజలను ఉత్పత్తిచేయు నట్టిది' అను అర్థము నిచ్చు ప్రజోత్పత్తి నామ సంవత్సరము అప్పుడే ప్రారంభమైనది. ప్రథమమాసమైన చైత్రము నిండిపోవచ్చినది. ఇక్కడ జ్ఞాన ప్రసూనాంబయొక్క గర్భముకూడ శిశువుయొక్క పూర్ణకళే బరముచే నిండిపోవచ్చినది. దినములు లెక్కపెట్టుచున్నారు. నొప్పు లారంభించినవి. మంత్రసాని కొరకు పరుగెత్తినారు. గుఱ్ఱపుబండి గుమ్మమునొద్ద నిల్చినది. ఇంటిలోపల గర్భవతి ప్రసవవేదనచే రోదనములను చేయుచున్నది. రాత్రి పదిగంటలు దాటినది. ప్రజోత్పత్తికై, అందరును ఎదురుచూచుచుండిరి. అయ్యది ప్రజోత్పత్తిసంవత్సర మగుట సార్థకమైనదని అనుకొన్నారు. ప్రథమమాసాంతము చైత్రబహుళ ౧౪ అర్ధరాత్రము కావచ్చుచున్నది. నక్షత్రరాశిలో తుది నక్షత్రమైన రేవతి ప్రవేశించినది. నొప్పు లధికమైనవి, కాని మంత్రసాని మహాలక్ష్మమ్మయొక్క ప్రేమపురస్సరమైన యుపచారములు గర్భవతికి బాధల నుపశమింపజేసెను. తల్లియొక్క ఏడ్పు నాపించి, తల్లికిబదులు తానే యేడువ దలంచికాబోలు గర్భస్థశిశువు తత్క్షణము భూపతనమై, యిదివరకు తల్లిచేయుచుండిన రోదనధ్వనిని తాను చేయ నారంభించినాడు. జ్ఞాన ప్రసూనాంబ ప్రసూతియైనది. పుత్రసంతానము కలిగినది. వైకుంఠనాథుడైన శ్రీమన్నారాయణుడు భక్తులకు తనదివ్య దర్శనభాగ్యము నిచ్చుటకై తనచిత్కళారేఖను భూలోకమున నిట్లు ప్రసరింపచేసెనా యన్నట్లు ఓంకారనిలయవాసు లంద

రును ఆదివ్యమూర్తిని సందర్శించి ఆనందోత్సాహపరవశులైరి. ఓంకారనిలయమందు ఓంకారస్వరూపుడైన పరబ్రహ్మము శరీరధారుడై 16-4-31 తేదీన వెలసినాడు. రాత్రి 10-34 అయినది. ఈ నిలయమునకు ఉత్తర సరిహద్దునందుగల తన స్వగృహములో బ్రహ్మశ్రీ కోట చంద్రమౌళి సిద్ధాంతి గారు అప్పుడు గాఢనిద్ర పోవుచుండిరి. భూపతితుడైన యీ శిశువుయొక్క రోదనశబ్దము సిద్ధాంతిగారిని సుషుప్తినుండి లేపినది. శబ్దముయొక్క వైఖరినిబట్టి యీ పిల్లవాడు భగవ దంశసంభూతుడును, అహింసాతత్త్వమూర్తియు, భక్తిపరా యణుండును, కాగల డనియు, అందరిప్రేమను ఆకర్షించగల వాడనియు, మహాత్మాగాంధిగారి ప్రేమతత్త్వము వీనియం దున్నదనియు, ఆ యర్ధరాత్రిమున సిద్ధాంతిగారు తనలో తాను సిద్ధాంత మొనర్చుకొని తిరిగి నిద్రావశులైరి. తెల్ల వారినది. ఈ శుభవార్త చుట్టుపట్ల ప్రాకినది. ఓంకారనిల యము బీదజాతులవారి కుటీరములమధ్య నున్నది. ఈ బీద జనులు తెల్లవారుఝామున 4 గంటలకు లేచి కూలిపనులకు వెళ్ళుచుందురు. ఉషఃకాలముననే యీ జననవార్త వారి చెవుల బడినందున వారు సంతుష్టాంతరంగులై హృదయాహ్లా దముతో వారు తమ నిత్యకృత్యముల నెరవేర్చుటకు వెడలి పోయిరి. కనుపర్తి గ్రామములో ఈ శిశువుయొక్క పితా మహునకును, వేటపాలెములోనున్న మేనత్తకున్ను, ఇతర గ్రామములోని బంధుమిత్రాదులకును, ఈ పుత్రోదయ సమాచారము లేఖలమూలమున తెలుపబడెను. పిల్లవాని

మాతామహుడైన తూనుగుంట్ల రామస్వామి గుప్తగారు ఈ బిడ్డకు జాతకర్మనామకరణాదులు జరుపు విషయమై ప్రక్కనున్న శ్రీచంద్రమౌళిసిద్ధాంతిగారితో సంప్రదించుటకు వెళ్ళిరి. సిద్ధాంతిగారు శ్రీ గుప్తగారిని చూడగనే "ఓహో! మీరు వచ్చినపని నాకు తెలిసినది. మీకు దౌహిత్రుడు కలిగినసంగతి గతరాత్రి 10-34 ని॥లకే పుట్టిన పిల్లవాడు నాకు నిస్తంత్రీవార్త నంపి నన్ను నిద్ర లేవగొట్టినాడు. ఈ బిడ్డ ప్రహ్లాదునివలె సర్వుల హృదయప్రేమను ఆకర్షించగలవాడు. వీనియందు భగవానుని చిత్కళ ప్రవేశించినది. వీని రోదనధ్వనిని బట్టి వీనియందు గాంధిగారి అహింసాతత్త్వమును, జనాకర్షణశక్తియు, మూర్తీభవించినవని, నాకు ద్యోతకమైనది. వీనికి ప్రహ్లాదగాంధియను నామము సార్థకమగును." అని సిద్ధాంతిగారు సహాజమందహాసముతో అయాచితముగ శ్రీ గుప్తగారి కెరింగించిరి. ఈ సమాచారము తెల్లవారకపూర్వమే మీ కెట్లు తెలియవచ్చిన దని గుప్త గారు సిద్ధాంతిగారిని ప్రశ్నించగా, గతరాత్రి ఆ శిశువు జననకాలమందు చేసిన రోదనధ్వనినిబట్టి సర్వము తనకు గ్రాహ్యమైన దనియు, ఈ విషయమై శయ్యమీాద నున్నప్పుడే సిద్ధాంతము చేసితి మనియు నుడివిరి. అంతట సిద్ధాంతిగారికి వందనము లొనర్చి గుప్తగారు వెడలిపోయిరి. వైశాఖ శు ౯ ఆదివారము నాటికి జాతాశౌచము వెడలిపోయినందున అందరు శుద్ధిస్నాన మొనర్చిరి. పిల్లవానితండ్రి, పితామహుడు, పినతండ్రి, మేనత్త, మేనత్తభర్త, మఱికొందరు

ముఖ్యబంధువులును వచ్చి నామకరణమహోత్సవమును జరిపించిరి.

## కనుపర్తిలో అన్నప్రాశనము.

శుక్లపక్షచంద్రునివలెను బిడ్డ దినదినాభివృద్ధి నొందుచుండెను. ఏడుమాసములు వచ్చువరకు బిడ్డడు మాతామహస్థానముననే పెరుగుచుండెను. బిడ్డకు చమురు పూయుట, నలుగుపెట్టుట, జలక మాడించుట, ఎత్తుకొని యాడించుట మున్నగు శిశుపోషణక్రియలయందు గృహములోని పెద్దలు, పిన్నలు అందరును ఉత్సాహపూరితు లగుచు వచ్చిరి. ఇంతలో బిడ్డకు ఏడుమాసములు నిండినవి. 8 వ మాసమున పితామహుడు పిల్లవానిని తన స్వగ్రామమైన కనుపర్తికి తీసికొని వెళ్ళెను. అచ్చట అన్నప్రాశనసంస్కారము యథావిధిగ జరిగినది పితామహుడైన కాకరపర్తి సుబ్బయ్యశ్రేష్ఠి గారును, పితామహియైన భ్రమరాంబగారును తమ మనుమని ముద్దాడుచు ఇంటిలోను, దొడ్డి యావరణలో నున్న చెట్ల క్రిందను పిల్లవానిని ఆడించుకొనుచు అంతక్రితము 20 సంవత్సరములనుండి తమ నట్టింటను బిడ్డడు పారాడి యుండలేదని యిదివరలో తాము పెట్టుకొనియుండిన బెంగను ఈ పిల్లవాని మూలమున నిప్పటికి పోగొట్టుకొన గలిగితిమిగదా యను సంతోషము వారికి సగము బలమును కలిగించెను. గ్రామములోని యిరుగు పొరుగువారు వచ్చి పిల్లవాని చేష్టలను చూచి వానితో ముచ్చటలాడిపోవుచుండిరి.

## రేపల్లె నివాసము.

పిల్లవానితండ్రి గుంటూరు కలెక్టరు ఆఫీసులో ఉద్యోగమునం దుండిరి. ఇంతలో వారికి రేపల్లెతాలూకాఆఫీసుకు బదిలీ అయినందున వారచ్చటకేగిరి. కాన 9 వ మాసమున బిడ్డను తీసికొని తల్లి రేపల్లెగ్రామమునకు వెళ్ళవలసి వచ్చెను. పొరుగూరిలో కాపురముచేయుట కిదియే నూతనము గనుక పిల్లవాని నాయనమ్మయు, మేనత్తయు పిల్లవానివెంట రేపల్లెకు వెళ్ళిరి. ఇక్కడ వీరు పెద్దబజారుమధ్య నున్న నొక విశాలభవనమునందు కాపురము నేర్పాటు చేసికొనిరి. ఇది శ్రీ పువ్వాడ రామస్వామిగారిపుత్రిక, మాజేటి అన్నపూర్ణమ్మ గారి మందిరమై యున్నది. ఇయ్యది గ్రామమధ్యముననుండి సర్వసౌకర్యములకు ఆస్పదమై యొప్పుచున్నది. ఈ విశాల భవనమునందు ముద్దుబిడ్డడు ప్రహ్లాదుడు చక్కగ జోగాడు చుండ నిరుగుపొరుగు అమ్మలక్కలు బిడ్డను చూచుటకై వచ్చి వానినెత్తుకొని హాసలీలావినోదము లొనర్చుచుండిరి. మఱియు తమ స్వంతబిడ్డలను కూడ యీ పిల్లవానియొద్దకు తీసికొని వచ్చి విడిచి బిడ్డల నందరిని, సమూహాముగా, నాటలాడించుచు వచ్చిరి. అప్పుడు డిశంబరు, జనవరిమాసము లైనందున చలి మిక్కుటముగ నుండెను. దోమకాటు అధికముగ నుండెను. ఈ రేపల్లెగ్రామము పిల్లవానియొక్క మాతామహుని జన్మస్థానము. అందుచే శ్రీగుప్తగారు తమదౌహిత్రుని తమ జన్మస్థానములో నుండగ చూడగలందుల కేగిరి. వారచ్చట నాలుగుదినము లుండిరి. మార్గశిర బ ౧౧ సోమవారం 4-1-32

తేదీన ఆ విశాలభవనమున ఓంకారపూజను జరిపిరి. ఆ సాయంత్రము గ్రామములోని, స్త్రీల నందరిని అచ్చట సమావేశ పరచి ఏకాదశీమాహాత్మ్యమునుగూర్చియు, భాగవతములోని ప్రహ్లాదచరిత్రమునుగూర్చియు సత్కాలక్షేపము జరిగించిరి.

ఈ సందర్భమున తమ దౌహిత్రుడైన యీ ప్రహ్లాద గాంధినిగూర్చి ముచ్చటించుచు, ఈతడు భగవంతుని వర ప్రసాద మనియు. ముమ్ముందు ఈతడు సకలకళలతో వికాస మొందినప్పుడు ఈతడు తన భక్తిప్రపత్తిని వెల్లడించి ఆ భాగవత ప్రహ్లాదునివలెను ఈ గాంధిమహాత్మునివలెను, మనకందరకును, ప్రేమ భాజనుడు కాగలడని అక్కడ సమావేశమైన భక్తురాం డ్రందరకును ఎఱింగించిరి. అప్పట్లో యీ పిల్లవాని నాయనమ్మ పిల్లవానిమీాది మక్కువచేత వాని రొమ్ముంటినిండ యాభరణములును, కాళ్ళకు గొలుసులును తగిలించి మురిపెము నొందుచుండెను. ఇందుకు శ్రీగుప్తగారు ఆక్షేపించి పిల్లవాని శరీరముమీాది ఆభరణముల నన్నింటిని తీసివేయించిరి.

"భూషలు కావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్" అను భర్తృహరి శ్లోకము లోని భావమును అచ్చటి స్త్రీలకు బోధపరచుచు, బిడ్డలకు ఆభరణములను తగిలించువారు బిడ్డలను చెరచినవా రగుదు రని తెలిపిరి. చోరు లపహరించుటయేగాక ఒక్కొక్కప్పుడు ఆ చోరులవలన పిల్లవానికి ప్రాణాపాయముగూడ తటస్థించునని పల్కిరి. మఱియు పిల్లవానికి అలంకారప్రీతిని గలిగించి దేహాభిమానమును పెం

పొందించుననియు, అట్టి ఆభరణములు విద్యాబుద్ధు లలవడుటకు ప్రతిబంధకము లగుననియు నుడివిరి. ఈ బిడ్డకు అతీతవైరాగ్య మూర్తులైన ప్రహ్లాదునియొక్కయు, గాంధియొక్కయు నామ మును బెట్టి అట్టివానికి తద్విరుద్ధముగ దేహాభిమానమును భోగ ప్రియత్వమును పెంపొందించు ఆభరణములను తగిలించుట హాస్యాస్పద మగుచున్నదని శ్రీ గుప్తగారు ధర్మమును బోధించుసరికి, పాపము పిల్లవాని నాయనమ్మ వాని ఆభరణ ములను తీసివేసినందులకు అందరును ఆమెను వేనోళ్ళ ప్రశం సించిరి. ధర్మబీజ మెప్పుడును వ్యర్థము కాదన్న సామెత చొప్పున ఆ మరునాడు కొందరు స్త్రీలు తమ బిడ్డలయొక్క ఆభరణములుకూడ తీసివేసి వారిని స్వేచ్ఛగా వదలి నిర్భ యులై యుండిరి. ఈ ప్రకారము శ్రీగుప్తగారు రేపల్లెగ్రామ ములో నిట్టి కాలక్షేపములను మూడింటిని జరిపి, తల్లులకు హితోపదేశము గావించియుండిరి. ఇందులకు మన ముద్దు బిడ్డడు ప్రహ్లాదుడే|నిమిత్తకారణుడుగదా! ప్రహ్లాదుడు పిమ్మట రేపల్లెగ్రామమును త్వరలో విడిచిపెట్టవలసినకారణము సంభ వించినది. తండ్రిగారికి ఉద్యోగరీత్యా రేపల్లెలో పని ముగిసినది. ఈసమాచారము గ్రామములో వ్యాపించగనే ప్రహ్లాదుడు తమ్మును ఇంతత్వరలో విడిచి వెళ్లవలసి వచ్చినందుకు అంద రును కంట తడిబెట్టిరి. ఇట్లు రేపల్లెగ్రామములో నుండిన, దినములలో మన ప్రహ్లాదుడు అనేక స్త్రీపురుషులకును తోడి బాలురకును అత్యంతప్రీతిని పురికొల్పుచుండెను.

## బెజవాడలో ప్రహ్లాదున కుపచారములు.

మాఘమాసము వచ్చినది. ప్రహ్లాదునకు 11 వ మాసము జరుగుచున్నది. రేపల్లెనుండి సరాసరి బెజవాడలో మాతామహుని గృహమునకు ప్రహ్లాదుడును, తల్లియు వచ్చి చేరిరి. ఈ తూరి వీరు బెజవాడలో 4 మాసము లుండిరి. ఈ కాలములో ప్రహ్లాదునకు కొన్నిమాటలుగూడ వచ్చుచుండెను. ఇంతలో ఫాల్గునమాసము గడచినది. నూతనసంవత్సరారంభమున, పండుగనాడు ప్రహ్లాదుడు అందరితో పాటు వేపపువ్వును, మామిడికాయపులుసును చవిచూచినాడు. వేపపువ్వు చేదుగను, లేతమామిడికాయ వగరుగను, చింతపండు పులుపుగను, బెల్లము తీపిగను, ఈ నాల్గు రుచులును కలిసినట్టి రసమును సంవత్సరాదిపండుగనాడు ఎల్లరును భక్షించవలసిన విధి, యందలిభావ మేమో తెలియదగియున్నది. రాబోవుసంవత్సరములో ప్రతివానికిని వేపచేదును బోలు కష్టములు, బెల్లపుతీపిని బోలుసుఖములు, మామిడిపిందెవంటి వగరు, చింతపండు వంటి పులుపును బోలు కష్టసుఖమిశ్రములు, కలుగుచుండుననియు వాటిని ప్రతివారును ఇష్టము మీద అనుభవించితీరవలెననియు బోధించుటకే మన పెద్దలు వేపపువ్వు పండుగనాడు ఇట్టి వేపరసమును అందరిచేతను రుచి చూపించుట విధిగా జరుగుచున్నది. కాన ప్రహ్లాదుడు గూడ యీ నూతన ఆంగీరససంవత్సరాంతములోగా కొన్ని కష్టసుఖములను అనుభవించవలసియుండు నని సూచించుటకే

కాబోలు నీతడుగూడ పండుగనాడు వేపపులుసును భక్షించి యున్నాడు.

చైత్ర వైశాఖమాసములు కృత్తికా రోహిణి కార్తులలో, మీదుమిక్కిలి బెజవాడకొండమీద నివాసము చేయవలసివచ్చిన మన ప్రహ్లాదుడు, ఈపసిబిడ్డ, ఎండగాడ్పులకు ఎంత యోర్చుకొనవలసివచ్చెనో యూహాకతీతమైన విషయము. ప్రహ్లాదునిది, వస్తుతః మృదువైన బొద్దుశరీరమేగాని పేడుగట్టిన దేహముగాదు. ఈ కారణముచే, నీత డీ బెజవాడలో వీచిన రోహిణీగాడ్పులలో మితిమీరిన చల్లదనమును కోరుచుండెడివాడు. మాతామహుడు వీనిని ఉదయాస్తమయములందు కృష్ణానదికి దీసికొనివెళ్లి నీటిలో బొడ్డువరకు కూర్చుండబెట్టి స్నానము చేయించుచువచ్చిరి.

అక్కడ కనుపర్తిలోని తాతముత్తవలనుండి మనమని పంపవలసినదని అప్పటికే జాబులు వచ్చియున్నవి. ఇకను ప్రహ్లాదుడు బెజవాడను విడిచిపెట్టవలసినతరుణము వచ్చినది.

## కనుపర్తిలో లీలలు.

ఈ ప్రకారము ప్రహ్లాదుడు ఆ సంవత్సరము రోహిణీకార్తిని బెజవాడలో గడపియున్నాడు. ఇప్పటికి ప్రహ్లాదునకు వయస్సు 1 సంవత్సరము దాటి 2 వ మాసము వచ్చినది. కనుపర్తికి ప్రయాణసుముహూర్తము జ్యేష్ఠ బ ౨ సోమవారము ఉదయమున నేర్పాటుచేసిరి. తల్లియు, బిడ్డయు బయలుదేరి కనుపర్తికి వెళ్ళిరి.

ఈ కనపర్తిగ్రామము మిక్కిలి చిన్నది. పూర్వ మిది ప్రసిద్ధి జెందిన యొకమహాపట్టణముగ నుండినట్లు స్థల పురాణమునుబట్టియు, ఇతరనిదర్శనములబట్టియు సాధింపగలదు. ఈ గ్రామము సముద్రతీరమం దున్నది. ఇచ్చట సర్కారు వారి ఉప్పుకొఠారులు కలవు.

ఈసరికి ప్రహ్లాదునకు సంవత్సరముపైన మూడుమాసములు గడిచినవి. మాటలు కొలదిగా వచ్చుచున్నవి. ఆతడు నేర్చిన అన్నిమాటలలో నొక్కవాక్యము మాత్రము ఆతడు స్ఫుటముగా పలుకగలిగి యుండెను. పినతండ్రియొద్ద వీనికి చనవు జాస్తి. ఇందువలన పినతండ్రినిగూర్చియే పిల్లవాడు పలుమారు పలుకుచుండెడివాడు. ఆప్రాంతములో పినతండ్రికి "బాబాయి" అని అనెదరు కాన యీ పిల్లవాడు "ఓ బాబాయోయ్' అను వాక్యము బిగ్గరగా కేకవేసి చెప్పునప్పుడు ఆ ధ్వనికి ఇల్లు, ఒడలు అదరిపోవునంతటిశబ్దము కలుగుచుండెడిది. మాట లన్నింటిలోను ఈ మాట నొక్కదానినే ఆతడు తప్పులేకుండను, భయములేకుండను అనగలిగియుండెను. ఈ కారణముచేత, తన పినతండ్రివయస్సులో నున్నవారి నెవరిని చూచినను, వారినిగూర్చి "బాబాయి" అని చెప్పుచుండును. తల్లి వయస్సులో నున్నవారిని 'అమ్మ' అనియు, తాత వయస్సులో నున్నవారిని 'తాత' అనియు, ఇట్లు అందరినిగూర్చి ఆతడు పలుకుచుండెను. ఈ బిడ్డకు మాటలు నేర్పుటకు ఒక సదుపాయము కనిపెట్టబడెను. పిల్లవానిచేత నొక క్రొత్తమాటను పలికింపవలసినప్పుడు, ఆ మాటకు

ముందు 'ఏ' అనుప్రశ్నార్థకచిహ్నము తగిలించి, పెద్ద లెవరైన పలికినయెడల పిల్లవాడు ఆ క్రొత్తమాటకు ముందు 'ఆ' అను అక్షరమును తగిలించి జబాబు లిచ్చుచుండెడివాఁడు. ఎట్లన పిల్లవానిచేత "కాకి" అను మాటను పలికించ దలచినయెడల "కాకి, కాకి" యని మన మెంత మొత్తుకొనినను, ఆత డా మాటను పలుకకయుండును. కాని "అబ్బాయీ, ఏకాకీ" యని మనము అడిగినచో, "ఆకాకి" యని జవాబును వెంటనే యిచ్చుచుండును. ఈ ప్రకారము ఈ క్రింది క్రొత్త మాటల నన్నింటిని అతనిచేత పలికించుటకు సులభోపాయము కలిగినది.

| పెద్దల ప్రశ్న. | పిల్లవాని జవాబు. |
| --- | --- |
| ఏ రాముడు | ఆ రాముడు |
| ఏ కోంగ | ఆ కోంగ |
| ఏ దొడ్లో | ఆ దొడ్డో |
| ఏ బల్ల | ఆ బల్ల |
| ఏ పెట్టె | ఆ పెత్తె |

ఈ విధముగా అన్ని మాటలను పిల్లవానికి నేర్పగలిగిరి.

## బాపట్ల నివాసము.

ఇట్లుండ పిల్లవాని తండ్రికి బాపట్ల తాలూకా ఆఫీసుకు ఉద్యోగరీత్యా ట్రాన్సుఫరుఆర్డరు వచ్చినందున ఆయన బాపట్లకు వెళ్ళి ఆఫీసుపనిని చేయుచున్నాడు. భార్యను, బిడ్డను కూడ బాపట్లకు తీసికొని వెళ్లి యొప్పజెప్పదలచినారు. ఇక్కడ బెజవాడలో మాతామహస్థానమున ప్రహ్లాదునిపై ఎల్లర

కును ప్రేమభావములు అతిశయించియున్నవి. పిల్లవాని క్షేమసమాచారములు తెలుపు డని కోరుచు ఇదివరకు ప్రహ్లాదు డిక్కడ చేసిచూపినవినోదములగూర్చి పిల్ల వాని మాతామహుడు పితామహునకు కొన్నిజాబులను వ్రాసి యుండిరి. ఈ జాబులలో 4-8-32 తేదీన వ్రాయబడిన లేఖ ప్రహ్లాదుని బాల్యక్రీడలను అత్యంతరమణీయముగా వర్ణించి యున్నది. ఆ లేఖలో ప్రహ్లాదుడు మున్ముందు భక్తపరాయ ణుడై లోకము నుద్ధరించుటకు తన జీవితమును ధారబోయగల డని వ్రాయబడిన తాతగారిఆశీర్వాదవాక్యమును విన్నప్పుడు ఎవరిహృదయము జలదరించకయుండును? ఆ లేఖను ఆమూ లాగ్రముగ నీదిగువ నుల్లేఖించడమైనది.

ఓమ్.

లీ లా వ ర్ణ న లే ఖ .

బెజవాడ,

**4—8—32.**

మహారాజశ్రీ కాకరపర్తి సుబ్బయ్యశ్రేష్ఠి బావగారికి—

విన్నపములు. తమ వియ్యంకులు తూనుగుంట్ల రామ స్వామి గుప్త అనేకనమస్కారములు

ఆర్యా,

తమ పేరను లోగడ నే నొకజాబును వ్రాసియుంటిని. క్షేమసమాచారమును తిరిగి తెలుపకపోతిని. ఇదివరకు నేను తమకు వ్రాసిన జాబులో ప్రహ్లాదునిలీలలను గూర్చి వ్రాసి యుంటిని. అందలి మొదటిలీల - ఉంకాయను పగుల గొట్టు నప్పుడు వాడు చూపుచుండిన ముఖవికాసమును గూర్చియై

యుండెను. ఎల్లన ప్రహ్లాదుడు ఒక టెంకాయను తన రెండు చేతులతో బట్టుకొని చాచిన తన రెండు కాళ్ళమధ్యను దానిని నిలుపుకొనియున్నాడు. ఆ టెంకాయను మేము తీసికొని కత్తితో పగులగొట్టులకు కత్తిని ఎత్తగనే వాడు రెండు చేతులను పైకెత్తి,

"ఆ! ఆ! ఆ! ఢామ్!"

అని సంతోషముతో నొక భీకరాకారమైన కేకను వేయును. అప్పుడు వానిచుట్టును మూగియున్న మేమందఱమును, కడుపుబ్బునట్లు నవ్వుచుంటిమి ఇది యొకలీల. ఇకను రెండవలీలను వర్ణించెదను.

ప్రహ్లాదు డిక్కడనుండిన కాలము నిండు వేసంగియై యుండెను. ఉష్ణము తగ్గుటకై వానిని ఒకతూరి బొడ్డు క్రిందను చల్లనినీటిని పోసి గుడ్డతో రుద్ది తొట్టిస్నానము చేయించియుంటిమి. వాడాగుర్తును గ్రహించి తన శరీరమునకు, తాప మెత్తినపుడెల్ల బొడ్డుక్రింద తన రెండుచేతులను పెట్టుకొని.

"తాతోయ్, ఊ, ఊ, ఊ."

అని బొడ్డుక్రింది ప్రదేశమున, రుద్దుకొనుచు మా దృష్టి నాకర్షించునట్లు అరచుచుండును. అప్పుడు మేము చూచి అతడు తొట్టిస్నానము నపేక్షించుచున్నాడని గ్రహించి వెంటనే వాని కోరికను సఫలపరచుచుంటిమి. ఇట్టి శీతలోపచారములవలన వానికి హాయి కలుగుచుండెను. ఇది రెండవ లీల. ఇకను మూడవ లీలను వివరించెదను.

ప్రహ్లాదున కొకనాడు కంటిమీద నొక ఎఱ్ఱచీమ కుట్టినది. అప్పుడు వాడాచోటును తనవ్రేలితో జూపుచు నేడ్వ

సాగెను. దానిని మేము గ్రహించి ఆచీమను బలాత్కారముగ లాగివేసితిమి. 'అబ్బాయి, నిన్ను చీమ ఎక్కడ కుట్టినది' అని దానిని మేము అడిగినప్పుడెల్ల కంటియొద్ద చీమకుట్టినచోటును తన వ్రేలితో చూపుచు బిక్కమొగముతో తన పూర్వపు బాధను తెలుపుచున్నట్లుండెడివాడు. ఇట్లెన్ని పర్యాయములు వానిని ప్రశ్నించినను, వాడట్లే తన వ్రేలితో ఆ స్థానమును చూపుచు వచ్చెను. ఇంతటితో మూఢలీలలు ముగిసినవి. ఇప్పుడు మఱియొక యుపాఖ్యానమును తెలుపుచున్నాను. ప్రతిదినము ఉదయమున నిక్కడ బిడ్డ లందరును స్నానమొనర్చి విభూతిధారణ మైనపిమ్మట ఉద్యానవనమున బ్రవేశించి శ్రీరామునిపటము నొక దానిని ఎదుట నిడుకొని

"ఓం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."

అని ప్రార్థన నారంభించి ఒక అరగంటసేపు స్తోత్రమును జరుపుచుందురు. అప్పుడు ప్రహ్లాదుడుకూడ విభూతిని నొసటను ధరించి ఆబాలురతో నేకీభవించి తన చేతులను జోడించి ఎదుట నున్న శ్రీరామునిపటమువంక తన నేత్రములను నిగుడించి నోట నేవియో పలుకులు పలుకుచుండెడివాడు. ప్రార్థన పూర్తియగుటతోడనే ఆపటము నొకగోడ చిలువకు తగిలించుట ఆచారమై యున్నది. పిమ్మట కొన్నాళ్లకు ప్రార్థనసమయమందే కాక మరి ఏకాలమందైనను

"ఓం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."

అని యింటిలో ఎవరైనను వచించినయెడల ప్రహ్లాదుడు వెంటనే చేతులుజోడించి శ్రీరామునిపటము తగిలింప

బడియుండిన గోడవైపునకు తనదృష్టిని మరల్చి పెదవులను కదల్చుచు, నేవియో కొన్నిపదముల నుచ్చరించుచుండువాని వలె పొడగట్టుచుండును.

ఇంతటితో వానిలీలలను ముగించుచున్నాను. పూర్వము శ్రీరామకృష్ణాద్యవతారపురుషులు సయితము ఇట్టి లీలల నుపక్రమించి రని భాగవతాదిగ్రంధములు వర్ణించి నప్పుడు విశ్వసింపజాలని నాస్తికు లెవరైన నుండిన నుండు గాక. కాని ప్రహ్లాదు డిక్కడ నున్నకాలములో ప్రతిదిన మును ఆహ్లాదకరములైన లీలలను బోలుచేష్టల నెన్నింటినో ఆతడు గావించియుండుట మేము ప్రత్యక్షముగ జూచి నప్పుడు పూర్వము అవతారపురుషులవిషయమై వ్రాయబడి యున్న లీల లెంతమాత్రము నతిశయోక్తులు కాజాలవని నాస్తికులకుగూడ విశ్వాస ముదయించునట్టి దృఢనమ్మక ముతో చెప్పగలను. ప్రహ్లాదు డిప్పుడు మాకు కడు దూర మునం దున్నను, వాడు కావించియుండిన నిత్యలీలలుమాత్రము మాకండ్ల యెదుట నిప్పటికిని పొడగట్టుచునేయున్నవి. కాని యెంతమాత్రమును మఱపునకు రాలేదు. బహుశః వాడును వాటిని మఱచియుండలేదని తలంచుచున్నాము. మఱియు, మరికొన్ని నూతనచేష్టలుకూడ వా డిప్పుడు ప్రదర్శించు చుండు నని మా దృఢవిశ్వాసము. ఇట్టిబాలుని ఆయురారో గ్యములను భగవానుడు కాపాడి వీని ప్రహ్లాదనామము సార్థక మగునట్లు భగవద్భక్తి పరాయణుడై లోకము నుద్ధరించుటకు వీని జీవితము ధారాదత్తము కాగలందులకు మే మాశీర్వ

దించుచున్నాము. అమ్మాయి జ్ఞానప్రసూనాంబ యీశ్రావణమాసారంభమున బాపట్లకు వెడలనున్నదని తెలియవచ్చినది. ఈ జాబు మీకు చేరునప్పటికి బహుశః ఆమె కనుపర్తిలోనే యుండునని తలంచుచున్నాము. ఒకవేళ ఆమె వేటపాలెమునకుగాని, బాపట్లకుగాని వెళ్ళియున్నపక్షమున, నీజాబును తామందరును పరిశీలించినపిమ్మట భద్రముగా నామెకు జేర్పగలందులకు కోరుచున్నాము.

మొన్న అమావాస్యతో గ్రీష్మఋతువు అంతమొంది వర్షకాల మాసన్నమైనది. ఇంతదనుక దివాకరుని అగ్నిజ్వాలచే పరితప్తులై యుండిన జీవకోట్లు ఇప్పుడు వర్షబిందువులచే నుపశమనమొంది సంతుష్టాంగరంగులై యున్నారు. మా ఓంకారనిలయముయొక్క ఆవరణప్రదేశమున పుష్పలతలిప్పుడు శృంగారముగ బెరిగి నేత్రోత్సవము గలుగజేయుచున్నవి. ఇచ్చట నూతనముగ రెండు లతాగృహములు నిర్మింపబడినందున నీ ప్రదేశము శోభాయమానముగ నున్నది. ఈ పుష్పలతలలో రెండు ప్రధానముగ వర్ణనీయములై యున్నవి, ఒకజాతిపుష్పములు ఊదారంగు గలిగి గ్రామఫోన్ గొట్టముల యాకృతిని బొందియున్నవి. మరియొకజాతివి రోజావర్ణముగలిగి స్త్రీలజడలను బోలియున్నవి. సన్నజాజీప్రసూనములు గలపొదరింద్లు బహుఆకర్షణీయముగ నున్నవి, సాయంప్రాతస్సంధ్యలయం దివి ఘుమఘుమ మధురవాసనల వెదజల్లుచుండుటయేకాక ప్రపంచమును మరిపించి నిష్ప్రపంచస్థితిని స్ఫురింపజేయుచున్నవి. మరికొన్నిపుష్పజాతులు

సృష్టికర్తయొక్క అద్భుతనిర్మాణశక్తిసామర్థ్యమును జాటుచున్నవి. ఇయ్యవి సరోవరమునందలి పంకేరుహములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి. వీనిమధ్య నున్నకర్ణికలచుట్టు సూది మొనలవంటి వివిధవర్ణము గల పుష్పపరాగములు అతికించినట్లు బహువిచిత్రముగ కాన్పించుచున్నవి. ఇట్టి లతాగృహములును, పర్ణశాలలును, పొదరిండ్లునుగల యిచ్చటి యుద్యానవనము భగవద్భక్తులకును, ఆత్మజ్ఞానులకును జగత్ప్రేమణకర్త తన అఖండముఖవిలాసమును జూపుచున్నాడా యనునట్లున్నది. ఈ పుష్పశ్రేణులను దర్శించినవారికి, వనదేవతలు తమ్మును జూచి చిరునవ్వు నవ్వుచున్నట్లు కాన్పించుచున్నవి. పురాణశ్రవణమువలనగాని, వేదాధ్యయనమూలమునగాని, యోగాభ్యాసముద్వారాగాని పరమాత్మను ఇంతవరకును దర్శించజాలకయున్నారు. మా యుద్యానవనము నొకతూరి గాంచినంతనే భగవత్తత్త్వమును సునాయాసముగ గ్రహించి స్వానుభవము నొందగల రనుట నిస్సందేహము. కాన తా మొక పర్యాయము, దంపతీ సమేతముగ నిచ్చటికి విజయముజేసి ఉద్యానవనముయొక్క రామణీయకమును కనులార గాంచి ఆనందము నొందవలె నని విన్నవించుచున్నాడను.

విజయవాడ, ఇంద్రకీలాద్రి,
ఓంకారనిలయము,
**4-8-1933.**

ఇట్లు విన్నవించు విధేయుడు,
తూనుగుంట్ల రామస్వామిగుప్త.

ఓంతత్సత్.

## వే ట పా లె ం ని వా స ము.

ఈ జాబు కనుపర్తిగ్రామములో పిల్లవాని పితామహు
నకు 6-8-32 తేదీన చేరినది. కాని అంతకు రెండుదినముల
క్రిందనే ప్రహ్లాదుడును తల్లియును బాపట్లకు ప్రయాణమై
వెళ్ళి మార్గమధ్యమున వేటపాలెములో దిగిరి. ఈ జాబు తాత
గారు చదువుకొని మనుమని విచిత్రబాలచేష్టలకు సంతోష
మును పట్టజాలకపోయెను. ఈ జాబును ఆయన వేటపాలెము
నకు వెంటనే పంపియుండెను. అచ్చట బంధువు లందఱును
దీనిని చదువుకొని ఆనందపరవశులైరి. రెండు దినములలో
తల్లి బిడ్డయు నాయనమ్మయు బాపట్లకు వచ్చి చేరిరి. అక్కడ
వీరు కాపుర ముండినయింటియిరుగుపొరుగువారు ఈ బిడ్డ
యందు అత్యంతవాత్సల్యము గలవారై యుండిరి. తండ్రిగా
రిచ్చట నెలదినములు ఉద్యోగము చేసియుండిరి. కాని ఆ పని
అప్పట్లో ఖాళీ అయినందున ఆయన ఆ గ్రామమున వదలి
వేయవలసి వచ్చెను. ఇంతలోఆశ్వయుజమాసము ప్రవేశించినది.
పిల్లవానిని తల్లిని బెజవాడకు పంపవలయునని మాతామహు
లు కోరిరి.

## బె జ వా డ లో లీ ల లు.

ఆశ్వయుజ బ౧ శనివారముఉదయము ప్యాసింజరు రైలు
లో ప్రహ్లాదుని బెజవాడప్రయాణమునకు ఆయత్తపరచిరి,
మూట, ముల్లె సిద్ధము చేయబడినవి. ప్రహ్లాదుడు తన ఆట
సామానును మరచిపోలేదు. గిలక్కాయ, బొంగరము, బిల్లం
గోడు, గాంధిబొమ్మ వీటి నన్నింటిని మూట కట్టించినాడు.

వీధిలో గుఱ్ఱపుబండి నిలిచినది. పిల్లవాని నాయనమ్మయు, మేనత్తయు గుమ్మడ్ల నీరుపెట్టుకొన్నారు. "ప్రహ్లాదా! నీవు బెజవాడకు వెళ్ళుచున్నావు. ఈతూరి అక్కడ నెలలపర్యంతము నుండక దీపావళిపండుగ వెళ్ళగనే రావలసినది." అని వా రన్నారు. గుఱ్ఱపుబండి పోయి స్టేషనుయొద్ద నిలిచినది. ప్రహ్లాదుడు ధూమశకటములో కాలుపెట్టినాడు. ఇదియే ఆఖరుతూరి ప్రహ్లాదుడు రైలు నెక్కుట. ఆనాడు పగలు 11 గంటలకు ప్రహ్లాదుడును, తల్లియు బెజవాడకు చేరిరి. వాని చిన్నమేనమామలు, పినతల్లులు, తాత, అమ్మమ్మ అందరును బిడ్డను ఎత్తుకొని ముద్దాడి సంతోషములో మునిగి పోయిరి. దినములు గడచిపోవుచున్నవి. పిల్లవాడు బెజవాడలో నున్న యీతూరి క్రొత్త క్రొత్త పనులను చేయనేర్చి నాడు. తాతగారిగృహమున కొన్ని నియమనిబంధనలు ఆచరణయందు జరుగుచున్నవి. తెల్లవారుఝామున నాలుగు ఘంటలకు ఒక జేగంటను మోగించెదరు. అప్పుడు అందరును లేచి ప్రాతఃకాలప్రార్థనమును జరుపుదురు. ప్రహ్లాదు డీ పద్ధతిని ఒక వారము దినములు శ్రద్ధతో కనిపెట్టిచూచినాడు. పిమ్మట తనంతట తానే 4 గంటలకు లేచి ప్రక్కలపై పరుండి నిద్రబోవుచుండిన చిన్నమేనమామల, తలముసుగులను పీకివేసి, 'లే లెమ్మ' అని వారిని బాధించి లేవగొట్టుచుండెడివాడు. మరియు ప్రార్థనశ్లోకములో మొదటిశ్లోకము.

"ఓం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

అని ప్రారంభ మగును.

రెండవశ్లోకము :

"ఓం అచింత్యావ్యక్తరూపాయ"

అని ఆరంభమగును. ఇట్టి శ్లోకములను గృహములో నున్న పదిమందియు కలసి యుచ్చరించుచుండుటచే నాలుగు అయిదు దినములలో ప్రహ్లాదుడీ పద్యముల శైలిని గుర్తుపట్టగలిగినాడు. అందరితోపాటు ప్రార్థనలో తాను కూడ పాల్గొనుట కుల్లాసపడి నోటితో నేమియో కొన్ని శబ్దములను ఆతడు పల్కుచువచ్చెను. ఏ కారణముచేతనో యితడు ప్రథమ శ్లోకమును వదలివేసి రెండవశ్లోకమును చెప్పుచుండెడివాడు. ఎప్పుడు దీపారాధనము చేసినను, ఎప్పుడు పటమును కదలించినను, చేతులను జోడించి తన దృష్టిని ఊర్ధ్వమున నిలిపి

"ఓం అచింత్యా, ఓం అచింత్యా"

అని ఈతడు పలుమార్లు పలుకుచుండును. ఇదే విధముగ రాత్రి శయనించునపుడును, అందరితో కలిసి ప్రార్థన జరుపుట చక్కగ నేర్చినాడు. మరియు ఈ ఓంకారనిలయమునందొక యుద్యానవనమును, దీనిమధ్య నొక తపోవేదికయు గలవు. ఈ యుద్యానవనము వివిధరకముల పుష్పములతో శోభాయమానముగ నుండును. కనకాంబ్రాలు, శంఖపుష్పములు, నిత్యమల్లె వివిధరంగులుగల, చంద్రకాంతపుష్పములు కాశీరత్నాలు, మున్నగు పుష్పజాతిమొక్కలు గలవు. మరియు బృందావనము, రుద్రజడ, మాచిపత్రి మున్నగు పత్రములు గలవు. చుట్టుపట్లనుండి బ్రాహ్మణోత్తము లనేకులు నిత్యదేవతార్చనకుగాను పుష్పములకొరకు తమ బాలబాలికలను .పళ్ళెరములతోగూడ ఈ ఓంకార నిలయము

నకు బంపుచుందురు. ఈ బాలబాలికలు వచ్చి పళ్ళెరము లలో, పుష్పములను పెట్టించుకొని వెళ్లు పద్ధతిని ప్రహ్లాదుడు కనిపెట్టినాడు. బాలికలు పళ్ళెరములను తీసికొని గుమ్మము లోనికి రావడ మాలస్యము, మన ప్రహ్లాదుడు వెంటనే యా పళ్ళెముల నందుకొని తోటలోనికి పోయి తన చేతి కందుచుం డిన పుష్పములను, పత్రిని కోసి

"ఒకొతి, దొందు, మూదు."

అనగ ఒకటి, రెండు, మూడు అని నోట సంఖ్యా వాచకముల నుచ్చరించుచు, పళ్లెములను పుష్పములతోను, పత్రితోను నింపి బాలబాలికలకు తిరిగి యిచ్చివేయుచుం డును. ఈ ప్రకారము ప్రహ్లాదుడు జరుపుచుండినపనిని నింటిలో నున్న పెద్దవారు చూచి తాము చేయవలసినవిధిని బిడ్డడే శ్రద్ధగా జరుపుచున్నాడు. వీ డికముందు ఎట్టి భక్తుడు కానున్నాడో యని ఆశతో నుంటూవచ్చిరి. పుష్పములకొరకు వచ్చు బ్రాహ్మణోత్తములు కూడ యీబిడ్డ చేయుచున్న పనిని చూచి మిక్కిలి కుతూహలపడుచుండిరి.

ఉద్యానవనములోనికి పక్షిసమూహంబు లెన్నియో వచ్చుచుండును. పిచ్చుకలు, గోరువంకపిట్టలు, సీతాకోక చిలుకలు- ఇంక నెన్నియో విహంగసంతానములు తోట లో ప్రవేశించి అందలి యిసుకతిన్నెమీద వ్రాలి, తమ బుల్లిబుల్లి రెక్కలతో, నిసుకను రెచ్చగొట్టి, గుంటలుచేసి, అందు కొన్నినిముషములు విహరించుచుండువినోదమును ప్రహ్లాదుడు నిత్యమును చూచి యానందించుచుండును.

మరియు, తాతగారి యింటిలో చాలవరకు అందరును అపక్వాహారులై యున్నందున వీరు ఆహారమునకై వానబోసికొన్న గోధుమలు కొన్నింటిని భూతబలికిక్రింద సమర్పించుచు ఆ గోధుమలను ఒకపాత్రలో నుంచి పిట్టలనిమిత్తము బహిరంగ ప్రదేశములో పెట్టినప్పుడు, ఈచిన్నిపిట్టలు తమముక్కులతో ఆ గింజలమీఁది పొట్టును ఒలిచి తమబిడ్డలబోసినోళ్ళ కందిచ్చుచుండువిలాసమును ప్రహ్లాదుడు కనిపెట్టుచుండును. కాన తాతగారు ఫలహారము చేయునప్పుడు వారి పాత్రలో నుండి కొన్ని గోధుమగింజలను ప్రహ్లాదు డడిగి చిప్పలో వేయించుకొని, ఆచిప్పను ఈపిట్టలముందర పెట్టుచుండెడివాడు. ఇట్లు కొన్నిదినములు చేయఁగా పక్షులు ఈ సంగతిని బాగుగా గ్రహించినవి. పిల్లవాడు ఏపాత్ర చేత పుచ్చుకొని దొడ్డిలోనికి వెళ్లినను, అందులో తాము భుజించుగోధుమలున్నవిగదా యని యూహించి అవి యాపిల్లవాని చుట్టుమూఁగి, కిచకిచధ్వని చేయుచుండును. ఒకనాఁ డొక పిచ్చుక గింజలకై ఆతురపడి పిల్లవానిచేతిమీఁద వ్రాలి ఆతనిచేతిపై రెట్టవేసెను. అది తెల్లగా బియ్యపుగింజవలె నుండెను. ప్రహ్లాదు డందుల కేమియు భయపడక అది యేమో విచిత్రముగా నుండుటచే, అమ్మమ్మయొద్దకు పోయి తనచేతిమీఁది యీ రెట్టను ఆమెకు చూపించెను. ప్రక్కన నిలుచుండి పిట్ట జరిపిన యీ వినోదక్రియను జూచుచుండిన యాతని పినతల్లులు వచ్చి యీ రెట్టయొక్క చరిత్రము నంతను ఏకరువు పెట్టగా అందరును ఒక్కపెట్టున నవ్వుకొని ప్రహ్లాదుని హాస

లీలలనుగూర్చి పదేపదే విమర్శించుచు వచ్చిరి. ఇంటిలోని వారు ఫలాహారము చేయగా మిగిలిన అరటిపండ్లు నారింజ పండ్లయొక్క పై చర్మముల నన్నింటిని ప్రోగుచేసియు, మిగిలి పోయిన కొబ్బరిముక్కలు అందరియొద్దను వసూలుపరచియు, వీథిగుమ్మములో, నిత్యము కాచుకొనియుండు మేకలకు ప్రహ్లాదుడు పెట్టుచుండెడువాడు. ఈతడు అహింసాపరుడు గనుకనే సర్వభూతములకు నిట్లు నిత్యసంతర్పణము చేయుచుండువాడు.

పక్షు లన్నింటిలోను ప్రహ్లాదునకు పిచ్చుకలమీదనే ప్రేమ యధికము. మేడమెట్లపైనున్న గదిలో కట్టబడియున్న ఓంకారపటముయొక్క సందులో కొన్ని పిచ్చుకలు గూడు పెట్టుకొని జీవించుచు అందులో కొన్ని గ్రుడ్లనుకూడ పెట్టినవి. ఈ గ్రుడ్లు చితికి పిల్లలయ్యెను. కొన్నిపిల్లలకు రెక్కలు వచ్చి ఎగిరిపోవుచుండెను. ఇందులో నొకపిట్టకు రెక్కలు బాగుగా పెరిగియుండనందున నొకనాడు గూటిలోనుండి జారి అది మేడమెట్లపైబడి తన్నుకొనుచుండెను. ప్రహ్లాదుడు ఈ చిత్రమును వీక్షించుచు పిట్ట పొందుచున్నకష్టమును గాంచి విచారపడుచుండెను. ఇంతలో మాతామహుడు ప్రహ్లాదునికొరకు వెదకుచు వెళ్ళి చూడగా పిట్టయొద్ద కూర్చొని దిగులు నొందుచున్న యీతనిని గాంచి వెంటనే యీపిట్టను, ఈ పిల్లవానిని తీసికొని వెళ్ళిరి. ఆ పిట్టకు ప్రత్యేకముగా కొన్ని చితుకుపుల్లలతోను, పీచుతోను, నొక పంజరమును నిర్మించి అందులో నొక మెత్తని పాన్పువేసి దానిపై నా పిట్ట

ను చేర్చి మేడపైనున్న గదిలో నొకమూలగోడకు మేకుగొట్టి దానికి దగిలించిరి. ఇందుకు ప్రహ్లాదుడు మిక్కిలి సంతసించెను. నాటినుండియు ప్రహ్లాదుడు దానికి నానబోసిన గోధుమలను, తురిమిన కొబ్బరిని పెట్టించుచు నిత్యము దాని యోగక్షేమములను విచారించుచుండెడివాడు. భూతదయ యనునది యీతనికి బాల్యమునుండియు కలిగియుంకుట నొకవిశేషము. మఱియు నుపవనమునందలి పుష్పములలోనిమకరందము పానము చేయుటకై నిత్యము ఉదయాస్తమయములయందు తేనెటీగలు తండోపతండములుగ వచ్చి ఆ పుష్పములలోని తేనెను కడుపార త్రాగి యీ ఓంకారనిలయసౌధాగ్రమున నొక తేనెతుట్టెను, మఱియు తోటలో మల్లెచెట్టు గుబురునందొక తేనెతుట్టెను పెట్టి ఝుం ఝుం అని అయ్యావి నిరంతరము ప్రణవనాదము చేయుచుండును. ప్రహ్లాదు డీ ఝుంకారనాదమును శ్రోత్రానందకరముగ వినుచు తోటలోని యిసుకతిన్నెపై కూర్చుండి అందలి యిసుకను కుళ్ళగించి "ఓం అచింత్యా, ఓం అచింత్యా" అని భగవంతుని నామస్మరణమును చేయుచుండును.

ప్రహ్లాదుడు పుట్టినదినములలో ఓంకారనిలయమున కెదురుగ నున్న యొక గొల్లస్త్రీ ప్రసవించి యిద్దరు కవలబిడ్డలను కనెను. ఆ గోపాలబాలురు ఇప్పుడు ప్రహ్లాదుని వయస్సునకు చెందినవారై వీధిలోనికివచ్చి ఆడుకొనుచుందురు. ప్రహ్లాదునకీ గొల్లవాండ్రపై అవ్యాజప్రేమ కలిగినది. ఇంటిలో నొక గదిమూలను దాచియుంచిన పండ్లబుట్టలోనుండి పండ్లను

సంగ్రహించి అప్పుడప్పు డీ బాలుర కిచ్చి సంతోషించుచుం డును. ఈ విధముగ సదాచారపరుడై నిత్యము ఉదయమున అందరితోపాటు తానును స్నానముచేసి విభూతిధారణ మొన రించుకొని దర్భాసనాసీనుడై స్వాములవారివిగ్రహము నెదుట సిద్ధాసనము వేసికొని నేత్రములు మూసి అంతర్దృష్టితో తనకు వచ్చియున్న "ఓం అచింత్యా" అను మంత్రమును పఠించుచుండును. మధ్యాహ్నము తాతగారు ఫలాహారము చేయుసమయమున నీతడు పిల్లంగోడును నోటియొద్ద పెట్టుకొని యూదుచు చిందులు ద్రొక్కుచు నిల్లంతయు సంచారము చేయుచుండును. దొడ్డిలోను, తోటలోను కలియ దిరుగుచు నృత్యగానంబులు చేయుచుండెను. ఈత డీ పిల్లన గ్రోవిని వాయించుచు ఇంటిలో సంచరించునప్పుడు వేణు గోపాలుడు ఆనాడు యమునాతీరమున నిండుజాబిల్లి రాత్రియందు గోపికలమధ్య రాసక్రీడలను సల్పియుండునట్టి దృశ్యము జ్ఞాపకమునకు వచ్చుచుండెను. ఇట్లు ప్రహ్లాదుడు ఈ తూరి బెజవాడలో నున్నకొలదికాలము సర్వభూత దయగలవాడై, భగవద్భక్తిపరుడై, భగవత్ప్రీతికరములైన కార్యములను జరుపుచు, ఒకప్పుడు "ఓం అచింత్యా" అను మంత్రముతో సర్వాంతర్యామిచైతన్యమును ధ్యానించుచును, ఒకప్పుడు పిల్లనగ్రోవితో గీతగోవిందము సల్పుచును పర వశుడై యుండుచుండెను.

## దీపావళి ప్రణవపూజ.

ఇంతలో ఆశ్వయుజ బ ౩౦ శనివారము దీపావళిపండుగ వచ్చినది. ఈపండుగను, టపాసులపండుగయని అందరుననియెదరు. కాని ప్రహ్లాదునితాతగారియింటిలో పండ్రెండుసంవత్సరములనుండియు నీ పండుగకు టపాసులను కాల్చుటలేదు. ఆ దినమున భగవదారాధనముమాత్రమే జరిపెదరు. ప్రణవపూజ సమష్టిప్రార్థన, భక్త్యుపన్యాసములు, ఆశీర్వచనములు ఇయ్యవి ఆనాటికార్యక్రమములో చేరియుండును. ఈకార్యక్రమమునంతయు బహిరంగముగ, రాజవీధిలో జరిపెదరు. దీనివలన పూజాఫలము, ఒక్క ఓంకారనిలయవాసులకే కాక, ఆ వీధియందును చుట్టుప్రక్కల వీధులయందును నివసించువారుకూడ పూజాసమయమున, సమావేశ మగుచుండుటచే ఇతరులకు కూడ ఫలప్రద మగుచుండెను. ఈ దీపావళికి పిల్లవానిమాతామహునకు తలవని తలంపుగా జాతాశౌచము వచ్చియున్నందున పూజావిధానమునంతను ప్రహ్లాదునితల్లియు, పినతల్లియు, స్వయముగ జరుపునట్టి భాగ్యము, నాడు తటస్థించెను. మన ప్రహ్లాదుడు కూడ ఆ నాడు వెలిగింపబడిన దీపరాసుల చిత్రమును చూచియు ప్రణవమందిరముయొక్కనిర్మాణసౌందర్యమును తిలకించియు, ప్రార్థనోపన్యాసములఫలము ననుభవించియునున్నాడు. ఈ ప్రణవమందిరము 6 అడుగుల యెత్తును, 5 అడుగుల పొడుగును, 1½ అడుగు వెడల్పును గలిగియుండును. లోపల దీపములు పెట్టుటకు నాలుగు అంతస్థులు గలవు. ఈ నాలుగు అంతస్థులలోను బ్రహ్మగాయత్రీమహా

మంత్రాక్షరములను సూచించు 24 జ్యోతులు వెలిగింపబడును. మందిరములోనిదీపకాంతులచే చిత్రవర్ణములతో గూడిన కొన్ని యక్షరగణంబులు బయటకు ద్యోతక మగుచుండును. మధ్యలో నొక గొప్పపూర్ణానుస్వారము ధవళ కాంతితో ప్రకాశ మగుచుండును. దాని నడుమను 'ఓమ్' అను ప్రణవాక్షరము రక్తనీలవర్ణములతో నలరారుచుండును. ఈ పూర్ణమునకు ఉపరిభాగమున-

"తన్నో హంసః ప్రచోదయాత్"

అను హంసగాయత్రీ మంత్రాక్షరములు వెలుగుచుండును. వానికి కొంచెము క్రిందుగా-

"సోఽహం"

అను అజపాగాయత్రిమంత్రబీజములు స్ఫురించుచుండును. ఇది యంతయు పూర్ణమునకు ఉపరిభాగమున కాన్పించు విషయము. పూర్ణమునకు మధ్యలో

"నమశ్శివాయ"

అను శివపంచాక్షరీమంత్రము చిత్రితమై యుండును. ఇకను అధోభాగమున

(I) ఏకోఽహం బహు స్యామ్

(II) ఓంకార ఏవేదగ్ం సర్వమ్

అను రెండు వేదవాక్యములు వివిధరంగులతో భాసమాన మగుచుండును. ఇట్టి మహామంత్రంబులతో గూడిన ప్రణవస్వరూపభగవానుని ఓంకారనిలయవాసు లందరును

ఆ నాడు దీపములచే నారాధనము జేసి ధన్యులైరి. తల్లి స్వయముగ జరిపిన యీ పూజాఫలితము మన ప్రహ్లాదుడు గూడ పొందుటకు సావకాశము కలిగెను. ఆ రాత్రి 8 గంటలకు పూజ, ప్రార్థనలు, ఉపన్యాసములు, ఆశీర్వాదములు, ఇవి యన్నియు ముగిసి ప్రసాద మెల్లరకును వినియోగింపబడెను. ఈ విధముగ నీ సంవత్సరము దీపావళిపండుగ ప్రహ్లాదుని సమక్షమున ఆనందకరముగ జరిగినందులకు ఎల్లరును సంతసించిరి. ఈ దీపావళికి ప్రహ్లాదుని పిలిపించిన పని ముగిసినది. ఇకను ప్రహ్లాదుని నాయనమ్మ కోరినప్రకారము ఈతూరి ప్రహ్లాదుని విశేషకాల ముంచుకొనక వెంటనే కనుపర్తికి పంపి వేయుటకు తాతగారు ఏర్పాటు చేసిరి. నాగులచవితి వెళ్లినమరునాడు కార్తీక శు ౫ గురువారము మంచిరోజుగదా యని అనుకొన్నారు. కాని కర్మవిధి ఎట్లున్నదో చూడుడు. నాగులచవితినాడు గుంటూరునుండి అర్జంటుటెలిగ్రాము వచ్చినది. ప్రహ్లాదునిచిన తాతభార్య ప్రసవపు నొప్పులు పడుచున్నదనియు, పురుడు పోసి వెళ్ళగలందులకు ప్రహ్లాదుని అమ్మమ్మను తక్షణమే గుంటూరుకు పంపవలసిన దనియును, ఆ తంతిలో నుండెను. ఇకను పురుడు కాలములో పిల్లవానిని, తల్లిని అత్తవారింటికి పంపుట భావ్యము కాదని యెంచి పురుడు వెళ్ళినవెంటనే వారిని పంపెదమని కనుపర్తికి జాబు వ్రాయించి ప్రహ్లాదుని అమ్మమ్మ తన తోడికోడలకు పురుడు పోయుటకై గుంటూరు వెళ్ళినది. పురుడుపని ముగించుకొని ముత్తవతల్లి కార్తీక బ ౧ సోమవారము నాటికి బెజవాడకు తిరిగివచ్చెను. వెంటనే ప్రహ్లాదుడు

ముత్తవతల్లిని కౌగిలించుకొనెను. "ఎట్లైనను సరే ఎల్లుండి తదియనాడు ప్రహ్లాదుని కనుపర్తికి పంపెదము" అని యను కొనిరి. ఇకను ఈశ్వరమాయ చూడుడు. మంగళవారమునాడు ప్రహ్లాదునకు కొంచెముగ జిగటవిరేచనములు కాన్పించి నవి. ఔషధము నిప్పించుచుండిరి. మరునా డుదయమున ప్రహ్లాదుని మాతామహుడు బాజారునుండి యొక క్రొత్త పంచాంగమును కొనితెచ్చి రాబోవు సంవత్సరారంభమున శుక్రమౌఢ్యమి ఎంతవరకున్నదో ఆ పంచాంగములోని 10 వ పేజీలో చూచి నిర్ధారణచేసికొని దానిని తిరిగి తనపుస్తకముల మీద పెట్టి బయటకు వెళ్లిరి. అది శ్రీముఖనామసంవత్సర పంచాంగము. అది కుప్పా విశ్వపతిశాస్త్రి మున్నగువారిచే గుణింపబడి బెజవాడ: మారుతీరాం అండ్ కంపెనీవారిచే ప్రక టింపబడి యుండెను. దాని అట్టపైన పెద్దఅక్షరములతో శ్రీరామ చక్రము అని వ్రాయబడి యీ క్రింద తెలిపినప్రకా రము అచ్చువేయబడియున్నది.

## చిన్న బిడ్డ గుణము.

## శ్రీరామ చక్రము.

బాలునివలన చక్రములో గుర్తుపెట్టించి దానివలన ఫలమును తెలిసికొనేది.

| | | | |
|---|---|---|---|
| 9 | 16 | 5 | 4 |
| 3 | 2 | 11 | 14 |
| 12 | 13 | 8 | 1 |
| 6 | 7 | 10 | 15 |

1 రామునివల్ల - స్థాననాశనము
2 సీతవల్ల - దుఃఖసంభవము
3 లక్ష్మణునివల్ల - కార్యసిద్ధి
4 విభీషణునివల్ల - కార్యసిద్ధి
5 కుంభకర్ణునిచే - మరణము
6 రావణునిచే - కులక్షయము
7 అంగదునిచే - రాజ్యనిశ్చయము
8 సుగ్రీవునివలన - బంధుదర్శనము
9 ఇంద్రసుతునిచే - మంగళప్రదము
10 ఓజాంబవా - దీర్ఘాయుష్యమగుగాక
11 ఓఆంజనేయా - సంతోషము
12 కైకేయివలన - కార్యనాశనము
13 కౌసల్యవలన - కార్యసిద్ధి
14 శూర్పణఖచేత - మహాభయము

15 భరతునివలన - కార్యసాఫల్యము
16 గుహునివలన - సంతోషము

ఈ ప్రకారము ఆపంచాంగపుఅట్టపైన వ్రాసి అచ్చు వేయుబడినచక్రము ప్రహ్లాదుని చిన్నమేనమామలు పది పండ్రెండేండ్లవారు వినోదముకొరకు ఈ చక్రములోని మాటలు నిజముగునో లేదో చూచెద మని తలంచి ప్రహ్లాదుని పిలుచుకొని వచ్చి అబ్బాయీ! యీ చక్రములో వేసి యున్న యేదో యొక అంకెమీద నీవు వ్రేలు పెట్టవలసినదని చెప్పిరి. దైవలిఖితము తప్పదు కాబోలు. ఆబిడ్డడు తనవ్రేలిని 5 అను అంకెమీద పెట్టెను. వెంటనే ఆచిన్ని మేనమామలు 5 అనే అంకెకు ఫలిత మేమి గలదో యని ఆచక్రముక్రింద నున్న ఫలమును చదివిరి.

"కుంభకర్ణునిచే మరణము."

అని వ్రాయబడి యున్నటుల వాండ్రు చదువుకొని భీతి చెంది, తత్క్షణమే యీ సంగతిని పిల్లవాని అమ్మమ్మతో ముచ్చటించిరి అమ్మమ్మయును ఈ సంగతి విని పంచాగ మును తెప్పించి దానిమీదిచక్రమును, దానిలో 5 అను సంఖ్యకు వేయబడినఫలితమును చూచుకొని, "యిది యేమి కర్మము? ఇట్లు ఎందుకు చేసితిరి?" అని పిల్లవాండ్రను తిట్టి, కొట్టి, యికముం దిట్టిపను లెన్నటికిని చేయవలదని కోపగించి వారిని పంపివేసెను. కాని యీవిషయము అందరి మనస్సుల లోను కలిగించినసంశయమును, భయమును, తొలిగింప లేక పోయెను. ఇకను దైవచిత్రమును చూడుడు. ఆనాడురాత్రి

ఆకస్మికముగా పిల్లవానికి వణకు పుట్టి చిన్నబిడ్డగుణము కానిపించినది. వెంటనే చికిత్సల నన్నింటిని చేయించిరి. పొగాకుచుట్టను కాల్పించి ఒడలిమీద నాలుగైదురతకులు వేసిరి. జిల్లేడాకుపసరు ముక్కురంధ్రములలో పోసిరి. నీరుల్లి పాయను నలిపి రెండుముక్కులలో నూదించిరి. పిల్లవానిని రెండుమూడు పర్యాయములు పైకి ఎగురవేసి పట్టుకొనిరి. ఇంతవరకు నేటివు వైద్యులు చేయుచికిత్స లన్నిటిని జరిపించినను పిల్లవానికి స్పృహ రాలేదు. ఎంతమాత్రమును ఏడ్వలేదు. సాధారణముగ జిల్లేడాకురసమును ఒక్కబొట్టు ముక్కులో పోసినయెడల వందలకొలదితుమ్ములు వచ్చునట. ఇట్టిస్థితిలో ప్రహ్లాదునిముక్కులలో పోసినపసరు అపారముగా నుండెను. ఇంతపసరు పోసినను తుమ్ములే రాలేదు. ఈ విచిత్రమున కందరును ఆశ్చర్యపడిరి. మృత్యుదేవత ముక్కులలో కూర్చున్నదన్నారు. ఎవరికిని ఏమియు తోచలేదు. ఇంతలో డాక్టరు శివసుబ్రహ్మణ్యంగారు, కంపౌండరు వెంకయ్యగారు తమ మందు సీసాలు, యంత్రసామానులతో సహా వచ్చి చేరిరి. సలసల మరగుచుండిన వేడినీళ్లలో పిల్లవానిపాదములను, చేతులను ముంచిరి. కాని అతడు ఏడవలేదు. ఘాటుగల ఉడుకులొనును ముఖముమీద చల్లిరి. ఏమియు ప్రయోజనము లేకపోయెను. ఆసనములోనికి ఎనీమాను ఎక్కించిరి ఎన్నిసాధనములు జరిపినను, నిరుపయోగ మాయెను. రామచరిత్రములో చెప్పబడిన కుంభకర్ణుడు పిల్లవానిని ఆవహించి యుండి నట్లున్నది. పిల్లవాడు కుంభకర్ణనిద్రలో పడియుండెను. స్పృహ

రాలేదు. పిమ్మట ఆతనికి యేవియో కొన్ని ఔషధములను లోని కిచ్చి స్వస్థతగా పరుండబెట్టవలసిన దనిచెప్పి డాక్టరు గారు వెడలిపోయిరి. అప్పుడు రాత్రి పదిగంటలైనది. పిల్ల వాడు అట్లనే మైకములోనే పడియుండెను. మరునాడు కను పర్తిలో నున్న పిల్లవానిపితామహునికిని, వేటపాలెములో నున్న మేనత్తకును, బాపట్లలో నున్న తండ్రికిని టెలిగ్రా ముల నిచ్చిరి. పిల్లవాని పినతాత తూనుగుంట్ల లక్ష్మీనారా యణగారు గుంటూరులో డాక్టరువృత్తియం దున్నారు. వీరు ఎమ్. బి. బి. యస్. పట్ట పరీక్షలో నుత్తీర్ణులై వచ్చి గుంటూరు గవర్నమెంటు ఆసుపత్రిలో ఆనరరీ సర్జ నుగా పనిచేయుచుండిరి. ఇక్కడ డాక్టరు సుబ్రహ్మణ్యం గారికి సహాయభూతులుగ నుందురని యెంచి వారినిగూడ బెజవాడకు పిలిపించి పిల్లవానికి చికిత్సలను చేయించుచుండిరి. బాపట్లలో నున్న పిల్లవానితండ్రికి టెలిగ్రాము రైలువేళకు ముందే చేరుటవలన వారు ఆసాయంత్రము 5 గంటలకే బెజ వాడకు రాగలిగిరి. వారు వచ్చి బిడ్డయొక్కస్థితిని కన్ను లార చూచుకొని నోటమాటరాక నిర్విణ్ణులై నిలిచిపోయిరి. ఇంతలో చిన్నబిడ్డయొక్క చిహ్నములు రెండవసారి కాన్పించి నవి. పిల్లవాడు చేతులు, కాళ్లు విరుచుకొని బిగదీసికొనిపోవు టయు, నల్లగుడ్లు పైకిపోయి తెల్లగుడ్లు వేయుటయు జరి గినది.

## ఆశలను వదలుకొనుట.

ఇకను ప్రహ్లాదునిమీద ఆశలు వదులుకొన్నారు. వానిని దొడ్డిచావడిలోనికి తీసికొనివెళ్లి క్రింద పరుండబెట్టిరి. ఇప్పటికి సాయంత్రము 6 గంటలు కావచ్చినది. సూర్యు డస్తమింపబోవుచున్నాడు. ప్రహ్లాదుని ప్రాణములును అస్తమింపనున్నట్లుండెను. ప్రహ్లాదునకు భూమిపై ఋణము తీరినదను కొన్నారు. తులసితీర్థమును గొంతులో పోసిరి. అంత్యదశలో తండ్రిమాత్రమే ప్రహ్లాదుని చూడగలిగెను. కాని అతనిని ప్రాణతుల్యముగ సాకిన అతని మేనత్త యెక్కడ? ప్రహ్లాదా యీ తూరి త్వరగా రావలసినదని చెప్పిన ఆనాయనమ్మ ఎక్కడ? పితామహు డేడీ? ఉప్పుకొరారునకు తీసికొనిపోయిన బాబాయి ఎందున్నాడు? వా రెవరును ఇంకను రాలేదే! వారినికూడా తుదిచూపు చూచుకొని గాని ప్రహ్లాదుడు భగవత్సన్నిధానంబునకు సెలవు పుచ్చుకొని వెళ్లదలచలేదు కాబోలు? అప్పుడు కొంచెము ప్రాణము వచ్చినట్లు అగుపరచినాడు. అందరకును ఆశ కలిగినది. వెంటనే పిల్లవానిని ఇంటిలోనికి తీసికొనిపోయిరి. మంచముపై స్వస్థతగా పరుండబెట్టిరి. అక్కడ వేటపాలెములో మేనత్తకును, కనుపర్తిలోని తాతముత్తవలకును, ఆసాయంత్రము రైలు అందలేదు. పాపము! వారికి కాళ్లు ఆడలేదు, నోట మాటరాలేదు. ప్రాణములతో ప్రహ్లాదుని చూచెదమో లేదో యను విషాదములో వారు మునిగిపోయిరి. దేవుడు రెక్కలిస్తేచాలు బెజవాడకు ఎగిరిపోయెదమని వారు తలంచిరి. ఇకను ఆ సాయంత్రము బెజ

వాడకు సరాసరివచ్చు రైలుబండ్లు లేవు. ఈ రాత్రి గడచు టెట్లు దైవమా! అని వారు విలపించుచుండ కృపానిధియగు భగవానుడు వారి కొక యూహ తట్టునట్లుచేసెను. వేటపాలె మునుండి గుంటూరునకు మోటారుకారుమీద వెళ్ళి అక్కడి నుండి బెజవాడకు రైలుమీఁగ వెళ్లవచ్చునని వారికి యూహతో చెను. వెంటనే వారు కారువేసికొని హడావిడిగా గుంటూరు వెళ్లి అక్కడినుండి రైలుమీద ప్రయాణమై రాత్రి 12 గంట లకు బెజవాడ చేరిరి. ఇక్కడ నింటిలో అందరును మేలుకొని పిల్లవానిని కాచుకొనియుండిరి. పిల్లవాని మాతామహుడు వీధి గుమ్మము దగ్గర కూర్చుండి పిల్లవాని తాతగారిరాకకై ఎదురు చూచుచుండిరి.

ఇంతలో చీకటిమరుగున, దూరముగ నొక బండి ఆగినచప్పుడు వినవచ్చినది. నలుగురైదుగురు మనుష్యులు ఇంటివైపు నడిచివచ్చుచున్నారు. అందులో నొక స్త్రీ నిట్టూర్పు విడుచుచు నడుగు వేయలేక వేయుచు వచ్చు న్నది. ఈమె, పిల్లవాని నాయనమ్మ. "ఎట్లా యున్నది, బావ గారూ" అని పిల్లవాని పితామహుడు గద్గదకంఠముతో పల్కిరి. ప్రహ్లాదుడు మీకొఱకే యింతవరకు ప్రాణములను బిగబట్టుకొని యున్నాడు అని బదులు వాక్యము వచ్చునరికి పాపము! ఆ పితామహునకు పైప్రాణములు పైకిపోయినవి. బండి దిగివచ్చినవా రందరును పిల్లవాని మంచమువద్ద కెట్లనో యీడ్చుకొనుచు పోయి అక్కడ కుప్పకూలినట్లు కూలి, గొల్లున నేడువసాగిరి. ఇకను ప్రహ్లాదుడు తనయవతారమును చాలిం

చుటకు నిశ్చయముచేసికొన్నట్లున్నది. బిడ్డను చూడదలచినవా రందరును వచ్చి చూచిరి. పితామహుని ఋణ మిదివరకే తీరిపోయినది. ఇక్కడ మాతామహునియింటిలో అతని ఋణము కొంచెముగా శేషించినట్లున్నది. ఇకను ఆలస్యములేదు. రెండు చిన్నములు కస్తూరియు, తల్లి దగ్గర ఆఖరుపాలును బాకీ శేషించియున్నవి. బిడ్డడు నోరు చప్పరించుటను అందరును కనిపెట్టినారు. పాలిచ్చుటకు తల్లిని కోరిరి. తల్లి వానిదగ్గర పరుండి రొమ్మును నోటి కందించగనే అది ఎక్కడి దాహమో గాని రివ్వు రివ్వున పాలుపీల్చుట మొదలు పెట్టినాడు. గుట గుట ధ్వని వినబడుచున్నది. సామాన్యముగ మూడు నాలుగు గుటకలలో పిల్లవాడు గిద్దెడుపాలను పీల్చి వేసినాడు. ఇట్టి చరమస్థితిలో పిల్లవాడు ఇంత బలముగా పాలను ఎట్లు పీల్చుచున్నాడో, యని అందరును ఆశ్చర్యనిమగ్నులైరి. ఇంతటితో పిల్లవాడు తల్లిఋణమును తీర్చికొన్నాడు. ఇకను కస్తూరి బాకీ నిల్చియున్నది. పిల్లవాడు కాళ్లు చేతులు బిగదీసికొనిపోయి గుడ్లు పైకి త్రిప్పినాడు. డాక్టరుగారికొఱకు కొందరు పరుగెత్తినారు. కంపౌండరు వెంకయ్యగారువచ్చి నాడి చూచినారు. 'దేహము చల్లబడుచున్నది' కస్తూరి వెయ్యమన్నారు. అప్పుడు కస్తూరి తెప్పించి పోసినారు. తిరిగి నాడిని తనిఖీచూచిరి. పిల్లవానిని దొడ్లోకి తీసికొని పొమ్మన్నారు. అందరును గొల్లుమన్నారు. మాతామహుడు బిడ్డను చేతులలోని కెత్తుకొని 'నారాయణ నారాయణ' యనుచును, 'ఓం అచింత్యా' అని పిల్లవాని ధ్యాన

శ్లోకమును పఠించుచును వాని నోటిలో తులసితీర్థమును పోసిరి. గుటక దిగినది.

## ప్రహ్లాదుని నిర్యాణము.

ఆ నాడు కార్తీకబహుళ ౬ శుక్రవారము. రాత్రి ఘడియారములో 2 ఘూములు దాటినది. పెద్దముల్లు సగానబడ్డది. గం 12-35 ని॥ కావచ్చుచున్నది. శ్వాస పైకి లేచినది. ప్రాణోత్క్రమణమగుచున్నది. 'హరహర మహాదేవ'. అదిగో! ప్రహ్లాదుని పంచప్రాణములు వాని నేత్రములగుండా లేచిపోయినవి. ఇంతటితో అవతారము పరిసమాప్తమైనది. కళేబరము నేలపై వ్రాలినది. 'శంభో శివ శివా, నారాయణ నారాయణ' అని ఆ యచింత్యావ్యక్తమూర్తిని అందరును ధ్యానమొనర్చిరి. ఇంతకు మించి యికను చేయవలసినకర్తవ్యమేమి కలదు? సూర్యోదయ మగువరకును ప్రహ్లాదుని తల్లి తండ్రి, తాత, నాయనమ్మ, పినతండ్రి, పినతండ్రి భార్య, మేనత్త, యామెభర్త, మాతామహుడు, మాతామహి, చిన్నమ్మలు, చిన్న మేనమామలు- అందరును ఆ కళేబరము చుట్టును మూగి, అతని లీలావిశేషములను, భక్తిపూర్వకములైన చేష్టలను, సర్వభూతదయాకార్యములను తలపోయుచు, ఇట్టి పుణ్యమూర్తి యింతత్వరలోను, నింత యాకస్మికముగను తమ్ము్మను విడనాడిపోయినందులకు వారు తమ యపార దుఃఖమును వెల్లడించియుండిరి.

ప్రహ్లాదుని చూడగలందుల కుద్దేశించి, యేమేనమామ లైతే బందరు, రాజమహేంద్రవరములనుండి ప్రత్యేక

ముగ దసరా సెలవులలో బెజవాడకు వచ్చియు, వాని చూడ
జాలక ఆశాభంగులై తిరిగి వెళ్లిపోయిరో, అట్టి మేనమామ
లకు ఈ బిడ్డయొక్క జబ్బు సమాచారముగాని, మరణవార్త
గాని, యింతవరకు వెళ్లనేలేదు. దైవముయొక్క యోగ
మాయ, ఘటనాఘటన కార్యములను ఎట్లు చేయుచున్నదో
చూడుడు. ఆ యిద్దరు మేనమామలకు అర్జంటు టెలిగ్రాములు
నిచ్చి వారిని పిలిపించి వారు ప్రహ్లాదుని కళేబరమును
చూచిన పిమ్మట, శ్మశానమునకు తీసికొని పోవలసినదని పిల్ల
వాని అమ్మమ్మ మొరాయించినది. అట్లు చేయుటవలన ఆ మేన
మామలకు ఈ మరణవార్త హఠాత్తుగా తెలిసి వారి ప్రాణ
ములు బీభత్సము నొందుననియు, అందువలన వానికి మఱింత
దుఃఖము ప్రాప్తించుననియు, బ్రతికియున్న పిల్లవానిని వారు
చూచిన ప్రయోజన ముండునుగాని విగతజీవుని చూచి ఏమి
ప్రయోజనము ఉండును అనియు, కాన వారికి తంతి నీయ
నక్కరలేదనియు, మాతామహుడు ఆమెకు సమాధా
నము చెప్పెను. అప్పుడు ఉషఃకాల మగుచున్నది. గ్రామ
ములోని బంధువులకు కబురు చేయబడెను. శ్రీయుత
అద్దేపల్లి వెంకటగురునాధరామ శేషయ్యగారు, పమిడయ్య
గారు, చిట్టూరి రామకృష్ణయ్యగారు మున్నగు బంధు
వులు వచ్చి మిక్కిలి ఖేదపడిరి. ఇంతలో అరుణోదయ
మైనది. దినకరుడు ప్రాగ్దిశనుండి తన చల్లనికిరణములను
ప్రసాదించి యికను ప్రహ్లాదుని కళేబరమును భూదేవి కర్పింప
వలసిన దని తెలిపియున్నాడు. చిన్నబిడ్డగుణము వచ్చిన

యీ రెండుదినముల నుండియు బిడ్డయొక్క కంటి నల్లపాపలు పైకిపోయి నేత్రములు వికారస్వరూపము దాల్చియుండెను. కాని ప్రాణము లిప్పుడు నేత్రములగుండా పోయినందువలన కాబోలు నల్లగుడ్లు యథాప్రకారము క్రిందికి దిగి, జీవించియున్న వాని నేత్రములవలె స్ఫుటముగ కాన్పించుచున్నవి. ఈ విశాలముఖములో భ్రూమధ్యప్రదేశంబున కాల్చి రక్ష వేయబడియున్నందున అక్కడ నల్లనిమచ్చ యేర్పడి ప్రహ్లాదుడు తన జ్ఞాననేత్రమును, అనగా మూడవనేత్రమును తెరచి, అందరిని చూచునటు కాన్పించినది.

ఇకను బిడ్డమీద ముసుగు వేసి భుజమున వేసికొని బయట గుమ్మమును దాటబోవుచుండగా ప్రతిదినము ప్రహ్లాదుడు గోధుమగింజలను పెట్టి పెంచుచుండిన ఉద్యానవనములోని పిట్టలన్నియు ఒక్కపర్యాయము లేచి ప్రహ్లాదునిశ్మశానమార్గమున కడ్డము వచ్చి గొల్లుమని కిచకిచధ్వనులను చేసెను. తోటలోని పుష్పము లన్నియు విచారమును తెలుపుచున్నవాయన్న ట్లుముడుచుకొనియున్నవి. చుట్టుపట్ల బీదబాలు రందరును ప్రహ్లాదునిమృతకళేబరమును వీక్షించి తమకు ప్రతిదినమును పండ్లు, ఫలముల నిచ్చి ఆదరించుచున్న మహోదాత్త భూగర్భము లోనికి వెళ్ళుచున్నాడుగదా యను విచారముచే కాబోలు ముఖములను వాల్చుకొనియుండిరి. అమ్మలక్కలు కంటనీరుపెట్టుకొనిరి. "ఓం అచింత్యా, ఓం అచింత్యా" అను భగవన్నామస్మరణపురస్సరఃబుగ ప్రహ్లాదుని కళేబరము మల్లికార్జునస్వామి వారిదేవాలయశిఖరమును వీక్షించి కనకదుర్గాంబా దేవాలయ

సోపానములను దాటి గోశాలను దర్శించి కృష్ణవేణీమహా ప్రవంతీతీరమునకు బోయి ఆ గంగలోని యిసుకతిన్నెలపై బ్రాలెను. అక్కడ లోతైన బిలము నొకదానిని త్రవ్విరి. మాతామహుడు బిడ్డకళేబరము నందుకొని రుద్రభూమిలోని యా భూగర్భశయ్యపై వెల్లకిల పండవేయగ లలాటప్రదేశమున ఆ విశాలనేత్రములనుండి యొక యపూర్వమైన ఆత్మజ్యోతి కాన్పించినది. "బిడ్డ బ్రతికియున్నట్లున్నాడు" అని అద్దేపల్లి పమిడయ్యగారనసరికి ఆబిలముయొక్క గట్లు విరచుకొని కళేబరముపై పడి మూసివేసినవి. పమిడయ్యగారు "అరే అరే" అని విస్మయము నొందుచు శరీరము పులకరించినందున వారికి కొంతవరకు నోట మాట రాలేదు. వారి కారాత్రి జ్వరము తగిలి మరునాడు సుస్తీగా నుండిరి. ఏగడ్డయందైతే ప్రహ్లాదు డుదయమొందెనో, ఆ గడ్డయందే యాత డస్తమించెను. "గంగమ్మతల్లీ! మాముద్దుబిడ్డ శరీరమును నీ కర్పించినాను. గడచిన వేసంగిదినములలో ఏ కృష్ణానదీ శీతలజలములలో నిత్యము ఈ బిడ్డను జలకమాడించి యుంటినో, ఆ కృష్ణమ్మతల్లికే, తుద కీదేహము నిప్పుడు బలిహరణ మిచ్చియున్నాను. ఓ పృధివ్యాదిపంచభూతములారా! దివ్యమైన మీ అణువులతో నిర్మించియిచ్చిన యీబిడ్డకళేబరమును కడకు మీకే స్వాధీనమొనర్చియున్నాను. సూర్యచంద్ర నక్షత్రములారా! యీ బిడ్డయందు మీరు ప్రవేశపెట్టిన తేజఃపుంజమును తిరిగి మీమహాతేజోరాశియందే లీనమొనర్చినాను. మీ సొత్తును మీకు చేర్చి నే నీ గంగలో చేతులు

కడుగుకొనివెళ్లుచున్నాను” అని ప్రహ్లాదుని మాతామహుడు పంచభూతములకు మ్రొక్కి సూర్యునికి నమస్కరించి గంగకు తిలోదకంబుల నిచ్చి స్నానముచేసి యింటికి వెడలిపోయిరి. వారు రిక్తహస్తములతో గృహమును తిరిగి ప్రవేశించి ప్రతి దినము మాతామహుడు బైటనుండి యింటికి రాగానే 'ఓ తాతోయ్' అని ఉల్లాసముతో కాళ్లకు చుట్టుకొనుచుండు ఆ ముద్దుబిడ్డడు ఎదురుగ వచ్చి తాతను కౌగిలించుకొన్నట్టి దృశ్య మొకటి పొడగట్టినది. “ఇ దంతయు మోహమాయ. బిడ్డనుగూర్చి యిక నెవరును విచారపడ నక్కరలేదు. పశు పత్నీసుతాలయములు లోకములో ఋణసంబంధమువలన కలుగుచుండును. ఋణము తీరగనే బంధములు తెగి “ఎవ రికివారే యమునాతీరే” అను సామెత చొప్పున లోక వ్యవహారము నడచుచుండును. కాన నీరహస్యమును గుర్తె ఱింగి మీ విచారమును మరచిపొండు.” అనిగుప్తగారు బం ధుమిత్రాదు లందరకును బోధించి వారికి ధైర్యవాక్యము లను చెప్పుచు, దుఃఖనివారణంబు చేయుచుండిరి. ప్రహ్లా దుని పితామహుడు, నాయనమ్మ మున్నగుబంధువులు గంపెడు దుఃఖముతో ఆనాడు మధ్యాహ్నము రైలులో తమ తమ గ్రామములకు వెడలిపోయిరి.

## అవతారసమాప్తి.

ఇక్కడ మాతామహగృహమున మామూలుప్రకారము ఉదయమునను రాత్రియు, నిత్యప్రార్థనలు జరుగుచుండెను. ప్రహ్లాదునిమరణమునుగూర్చి ప్రార్థనాసమయములో వీరు

భగవానునితో సంభాషించుచుండిరి. మాతామహులు ఈ బిడ్డను తమ దౌహిత్రునిగా భావించుకొని యుండలేదు. భగవంతుడు సాక్షాత్తుగ తమచే, సేవ చేయించుకొనుటకై తమ నిలయమున ఆవేశావతారముగ ఆవిర్భవించవలసినదని యీ ప్రహ్లాదుడు జన్మించుటకు పూర్వము తాము కావించి యుండిన ప్రార్థనాఫలముగ యీ బిడ్డ డుదయించినట్లు వారి విశ్వాసము. ఇతరుల కిది విపరీతముగ తోచవచ్చును. ఇందులో వైపరీత్య మేమియు లేదు. ప్రపంచములో నెవరికైనను భగవానునిపై భక్తి నిలువవలె నన్నచో విశ్వాస మొక్కటియే ప్రధానముగ కావలసియున్నది. ఒక వస్తువునందు తాము నెలకొల్పిన నమ్మకమే ఆవస్తువు తమకు ఆత్మబలమును ప్రసాదించు చుండును. వివేకమున కంటె విశ్వాసమే తనజీవితములో తనకు అద్భుతశక్తిని కలిగించినదని మహాత్మా గాంధిగారు పలుమారు తెలిపియున్నారు. మతోద్ధారకుల కందరికి నిట్టి విశ్వాసమే కల దనుట సత్యము. భగవంతుడు భక్తులచే సేవచేయించుకొనుట కెల్లప్పుడు నుత్సాహపడుచుండును. భక్తు లెప్పుడును భగవంతునకు సపర్య లొనర్చుటకు తహతహ లాడుచుందురు. భక్తులైన ఓంకారనిలయవాసులచే సేవచేయించు కొనుట కవకాశము నిచ్చునిమిత్తమే భగవానుడు ప్రహ్లాదగాంధిరూపమున యీ నిలయమున యావిర్భవించినాడు. ఈ కారణమున యీ బిడ్డకు చిన్నతనములోనే భగవద్విషయములయం దాసక్తి మెండైనది. ఆత డేగ్రామమునకుం వెళ్లినను, నేయింటి కేగినను, అక్కడివారి హృదయము

లందు ప్రేమను పురికొల్పి వారికి తనయెడల తిరిగి భక్తిని పుట్టించుచుండును. ఎవరి ప్రార్థనల నంగీకరించి భగవంతుఁ డీ బిడ్డను ప్రసాదించెనో, అట్టి ఓంకారనిలయవాసులచే యీ బిడ్డరూపమున భగవంతుఁడు సేవచేయించుకొని తృప్తి నొంది యున్నాఁడు. సేవకులుకూడ నానందము నొందిరి. కాని సంపూర్ణమైన తృప్తి వారికి కలుగలేదు. లోకములో ఏవిషయ మందైనను తృప్తి నుండవచ్చునేమో కాని అనన్యభక్తితో భగవంతునికి సేవచేయుచున్న భక్తులకు తృప్తియనునది యుండునా? ఎంతకాలము సేవచేసినను, యీ నాటితో చాలును అని భగవంతుఁడు చెప్పునేమో కాని భక్తుఁ డట్లన గలఁడా! ఇట్టి స్థితిలో ఒక సంవత్సరముపై ఏడుమాసములు మాత్రము జీవించి అవతారమును చాలించిన ప్రహ్లాదుని విష యమై ప్రేమకు పరిమితి యుండునని చెప్పగలమా! అందులో బిడ్డపెరిగి ఒక సంవత్సరము దాటిన మీఁదట మాటలు మాట్లాడుటయు, లీలలు జరుపుటయు, నేర్చిన యీ యేడు మాసములలోనే గదా, ఎవరైనను ఆతని ప్రేమామృతమును గ్రోలగలిగినది? ఏది ఎట్లున్నను, మహనీయులు ఎన్నఁడును హెచ్చుకాలము జీవించుట కుద్దేశించరు. వారు యీలోక ములో ఏకార్యమును చేయుటకై సంకల్పించి వచ్చిరో ఆకా ర్యము నెరవేరినతోడనే వారు తమయవతారమును చాలించె దరు. ప్రహ్లాదుఁడు బాల్యమునందే మాతామహునిచే సమ స్తోపచారంబులును చేయించుకొని సంతృప్తిజెంది యుండెను. తాను యింక నెవరినైనను సంతోషపెట్టవలెనని తలం

చెనో వారి నందరినిగూడ సంతోషపెట్టెను. ఏఏగ్రామము లకువెళ్లి, ఎవరెవరి గృహములను పవిత్రము చేయ నుద్దేశించి యుండెనో, అట్టి స్థలములను పునీతమొనర్చి యుండెను.

సమాధియొద్ద బిడ్డకు అన్నము బెట్టుట.

ఇకను బిడ్డ గతించి మూడుదినములైనది. నాల్గవదినము 21 తేది సోమవారం ఉదయమున చనిపోయిన బిడ్డకు ఆహారమును తీసికొనిపోయి శ్మశానములో వానిని సమాధి చేసిన చోట సమర్పించవలసిన ఆచారము కలదు ఆ నాడు బిడ్డకు యిష్టములైన పదార్థము లన్నింటిని తయారుచేసినారు. మరియు బిడ్డ జీవించి యుండగ మాతామహుడు బజారుకు వెళ్లినప్పుడెల్ల ప్రహ్లాదుడు ఒక కాని తెచ్చి తాతగారి చేతిలో పెట్టి "తాతోయ్, పండ్లు తే" అని చెప్పుచుండును. తాతగారు తమ యింటికి కావలసిన ఫలములు తెచ్చుచు ప్రహ్లాదుని కానితో ప్రత్యేకము ఒకటి, రెండు పండ్లను కూడ కొని తెచ్చి వాని చేతిలో పెట్టుచుండుట ఆచారమైనది. ఆ ప్రకారము ఆతడు జబ్బుపడిన దినమున కూడ తాతగారిని ఆతడొక కాని అడిగి తీసికొని యుండెను. ఆతడు మరణించు వరకు ఆ కాని అతని చేతిలోనే యుండిపోయినది. పిల్లవాని కళేబరము శ్మశానమునకు కొనిపోవునప్పుడు ఆ కానిని తీసి దాచిపెట్టిరి. ఇప్పుడు శ్మశానమునకు పంపబడుచున్న ఆహార వస్తువులతో బాటు యీ కానిని గూడ చేర్చిపంపిరి. మఱియు ఆతనికి బెండకాయకూర, కలకత్తాజామపండు, బూంది, యివి మిక్కిలి యిష్టమైన పదార్థములు. అందుచే 1000 (వెయ్యి

జామపండ్లను తెప్పించి ఆనాడు బీదబాలురకు పంచిపెట్టిరి. మఱియు ఆతడు జీవించి యున్నప్పుడు చంద్రకాంతపువ్వులను కోసి బెంకాయచిప్పలో వేసి లెక్కపెట్టుచుండును. కాన యిప్పుడు ఒక గిన్నెలో కొంచెము అన్నము, బెండకాయ కూర, బూంది, కలకత్తాజామపండును తరిగినముక్కలు, చంద్రకాంతపువ్వులు, పెసరఅట్టు, మున్నగుపదార్థముల నన్నింటిని అమర్చినారు. ఈ పదార్థములను చూచినవారికి కడుపులు తఱుగుకొని పోవును అనుట నతిశయోక్తి కాదు. ఇది గర్భనిర్భేదకమైన దృశ్యము. ఇకను యీ వస్తువులు శ్మశానమునకు తీసికొని పోబడవలసి యున్నవి. బిడ్డయొక్క చిన్న మేనమామలు, పినతల్లి, వీరు పండ్రెండేండ్లలోపు యీడుగల బాలబాలికలు, వీరుకూడా శ్మశానమునకు బయలుదేరినారు. "మీరు పిల్లలు, శ్మశానమునకు వెళ్లకూడదు. భయపడుతారు" అని తండ్రిగారు మందలించగా "మాకు భయము లేదు. శ్మశానములో పాపాయి అన్నము తిను చుండగా మేముకూడ చూడవలెను" అని ఏడ్చి హఠము చేసి వీరుకూడ బయలు దేరినారు. కాన తాతగారూ వీరితో కూడ బిడ్డకు ఆహారపదార్థములు తీసికొని శ్మశానమునకు వెళ్ళి చేరినారు. సమాధియొద్ద ఒక ఆకును పరచి గిన్నెలోని పదార్థములను దానిపై వడ్డనచేసి జలమును ప్రోక్షించిరి. బిడ్డచేతిలో చనిపోవుటకు ముందు వున్న రాగికాని కూడ ఆ యాకులో పడవేసిరి. పిమ్మట తాతగారు సమాధికి ప్రద

క్షీణ నమస్కారములుచేసి "ఓం అచింత్యా" అని ప్రహ్లాదుని పిలిచి యిట్లు పలికిరి.

మా తా మ హు ని ప్రా ర్థ న.

"నాయనా! ప్రహ్లాదా!! మూడు దినములైనది నీవు నిద్రబోయి. నీకింత దీర్ఘనిద్రయా? ఇప్పుడు సూర్యోదయమై రెండుఘంటలైనది. తెల్లవారుఝామున 4 ఘంటలకే నీవు స్వయముగ నిద్రలేచి అమ్మల నందరిని చేతితో తట్టి నిద్ర లేపి "ఓం అచింత్యా" యని యరచుచు ప్రార్థనము చేయు చుంటివిగదా! ఇక నీ సమాధిలోనుండి లెమ్మ. ఇదిగో నీ మేనమామలు, నీ చిన్నమ్మ ఓంకారము వీరందరును కలసి ఏకిప్పుడు బువ్వ తెచ్చినారు. నీకుయిష్టమైన బూంది, జానుపండ్లు కూడ తెచ్చినాము. నీ చేతిలో దాచుకొన్న కాని యిదిగో మీ అమ్మమ్మ నీకు పెసరపొంగలంచేసి పంపినది. ఇవిగో మీ యమ్మ స్తన్యపాలు పంపినది. వీటిని పుచ్చుకో. నీవు సాక్షాత్ వైకుంఠనాధుడవు. ప్రహ్లాదుని నామమును సార్థక పరచి మాకు భక్తిని పురికొల్పినావు. ఆనాడు ఆ ప్రహ్లాదుడు తనతండ్రి హిరణ్యకశిపుడు పెట్టిన బాధల నన్నిటిని సహించి యుండెను. నీవు యీనాడు "చిన్నబిడ్డగుణము" అను రాక్షసుడు పెట్టినబాధల నన్నిటిని దిగమ్రింగినావు. ఒడలంతా కాల్చి రక్షలు వేసినా పలుకక పోతివి. ముక్కులో పసరు పోసినా తుమ్మకపోతివి. సల సల మరిగిన నీళ్ళలో నిన్ను ముంచినా ఏడవకపోతివి. ఎత్తిపైకి ఎగురవేసినా భయపడక పోతివి. ఉల్లిపాయను నమిలి యూదినా యూరకుంటివి. ఆ నాడు

ఆ ప్రహ్లాదుడు తన చిత్తమును నారాయణుని పదపంకేరుహ ముల మీదనుంచి యిహలోకమును మరచి స్పృహ తప్పి యుండెను. ఈనాడు నీవును నీ "అంచితాత్యా అవ్యక్తమూర్తి" పై దృష్టిని నిలిపి విషయప్రపంచమును మరచి స్పృహ తప్పి యుంటివి. ఆనాడు ఆ ప్రహ్లాదుడు తన తండ్రితాతల వంశమును పావన మొనర్చినట్లు యీనాడు నీవును నీ తండ్రితాతల వంశ మును పునీత మొనర్చినావు. ఈ లోకమున నీవున్నది బహు కొలదికాలమేయైనను నీతో సంబంధముగల బంధుమిత్రా దుల ప్రేమనవనీతమును శ్రీకృష్ణునివలె నీవు చోరగ్రస్త మొనర్చినావు. నిన్ను మరచుటకు వీలులేదు. ఇకను లేచి మేము వడ్డించిన పదార్థముల నారగింపుము. మేము తిరిగి యింటికి వెళ్ళవలసియున్నాము. నీతలిదండ్రులకేమి చెప్పె దవు? నీ వియోగమును సహించలేక మీ నాయనమ్మ అల్లాడి పోవుచున్నది. నీ మేనత్త, బాబాయి, అమ్మమ్మ, మేనమా మలు విలపించుచున్నారు. ఇంకా నిన్ను ముద్దుపెట్టుకొని యున్న భక్తులును, భక్తురాండ్రును ఎందరో నీకై పరితపించు చున్నారు. వీరిందరియొక్క హృదయతాపముల నెట్లు చల్లార్ప మనెదవు? ఇదిగో కాటికాపరి తొందర చేయుచున్నాడు. మేము వెళ్ళవలసియున్నాము. నీ మనసిచ్చి నాతో మాట్లాడుము" అని పిల్లవాని మాతామహుడు పలికి కొంతసేపు కండ్లుమూసికొని తదేకధ్యాననిమగ్నులై నిలచిరి. ఒక నిమిషములో సుషుప్తి వంటిస్థితి వారికి కలిగి యీ క్రిందివాక్యములు వారికి విన వచ్చెను.

---

ఓమ్.

# ప్రహ్లాదగాంధి.

## సమాధిసందేశము.

(21-11-1932 ఆంగీరస సం॥ కార్తీక బ ౮ సోమవారం, ఉదయం 9 గంటలకు కృష్ణానదీ సైకత రుద్రభూమియందు)

తాతా! నేను సర్వాంతర్యామి నని మీకు తెలియును గదా. మీకోరికచొప్పున నేను మీ ఓంకారనిలయమునం దుద్భవించి భక్తులైన మీయందరిచే, ఋుసార, సేవింపబడి సంతుష్టినొందితిని. మీరు కృతార్థులైతిరి. నేను వచ్చినపని పూర్తియైనది. కాన తిరిగి నే నిప్పుడు నా స్వస్థానంబున ప్రవేశించితిని. మీరు నా కిప్పుడు తెచ్చిపెట్టిన సర్వపదార్థములలో "ఓం అచింత్యా"అనునదియే నాకు మిక్కిలి రుచిగానున్నది. దీనియందే నాకు ప్రేమ మెండు. నేను మిమ్ములనువిడచి యెక్కడకును పోలేదు. నేను మృత్యుంజయుడను నాపేరు ప్రహ్లాదగాంధి యైయుండ నాకు మరణమెక్కడ? ప్రహ్లాదుడు చిరంజీవుడు గదా! గాంధి జీవన్ముక్తుడుగదా! చిరంజీవులకు మృత్యువు లేదు. జీవన్ముక్తులకు మరణమునులేదు.

నేను ఓంకారస్వరూపుడను, ప్రణవమే నాశరీరము, ఓంకారనిలయమే నానివాసము. ప్రణవోపాసకుల చిత్తమునందు సర్వదా రమింతును. భక్తుల హృదయమే నాసంచారస్థానము, జ్ఞానుల నిష్ఠయే నా యునికి. యోగులధ్యేయాకారమే నాస్వభా

వము. సకలచరాచరజీవులయందలి ప్రాణ సంచారమే నాగతి. ఇప్పుడు నాజననీజనకులును, బంధుమిత్రులును ఎవరి కొరకు దుఃఖించుచున్నారో అట్టి నేను వారిహృదయకమల కర్ణికామధ్యమున స్వయంజ్యోతినై వెలుంగుచున్నాను. వారు నన్ను చూడకపోయినను, నేను, వారిని చూచుచునే యున్నాను. వారి ఆలాపములను ఆలకించుచునే యున్నాను. వారు నన్ను వెదకి తెలిసికొనగలందులకే నేనిట్లు మాయయను తెరచాటున దాగి యున్నాను. త్రిగుణాత్మికయగు ఈ మాయ నాశక్తియే. నావలెనే యిదియు అనాదియైయున్నది. ఇయ్యది నా కంటె భిన్నముగాదు. కాని భిన్నమైనట్లు తోచుచుం డును. నా సన్నిధాన మహిమచే యీ మాయ సృష్టిస్థితిసం హారకార్యములను జరుపుచుండును. ఆత్మయు, అసంగుడును సాక్షియునైన నాపై అజ్ఞానులు యీ కార్యములను ఆరో పించుచున్నారు. అందుచే వారు సంసారదుఃఖములను బొందు చున్నారు. నన్ను శరణుబొంది నా స్వరూపమును తెలిసి కొనిన జ్ఞానులుమాత్రమే యీ మాయాసంసారమును నశిం పజేయగలరు. తక్కిన వారికీ సంసారము నిలిచియేయుండును.

ప్రేమించిన వస్తువు కండ్లయెదుట కాన్పించుచున్నంత వరకు ఆ వస్తువుపైగల ప్రేమ వృద్ధి నొందజాలదు. ప్రేమవృద్ధి కావలెనన్న ప్రేమింపబడిన వస్తువు మరుగుపడి యుండవ లెను. తనమీదిప్రేమను అతిశయింపజేయుటకే తనను మరుగుపరచు యీ మాయ అవుసరమగుచున్నది. "వెదుక వెదుక జిక్కు వేదాంతవేద్యుండు" అనునట్లు అన్వేషణము

చేతనే ఆత్మ లభ్యమగును. ఇట్లు స్వయంకృషివలన లభ్యమైన వస్తువు యిక నెన్నటికి మరుగుపడజాలదు. మరుగుపడినను మార్గము తెలిసియేయుండును. నేనుండు స్థానమును మీచే స్వయముగ వెదకించి, ఇక నెన్నటికిని నా వియోగము మీకు కలుగకుండ చేయుటకే నేనిప్పుడు మరుగుపడియున్నాను.

నువ్వులలో నూనె దాగియున్నట్లు, పువ్వులలో సువాసన యున్నట్లు, పండ్లలో రస మున్నట్లు, కట్టెలో అగ్ని యున్నట్లు, పాలలో వెన్న యున్నట్లు, వడ్లగింజలో బియ్యపుగింజ యున్నట్లు, నేను మీ దేహములలో దేహినై దాగియున్నాను. ఇది నేను దాగియున్న చోటు. ఇకను తిరిగి మీకు నేను కనబడుటకై మార్గమునుకూడ చూపుచున్నాను. నువ్వులను పిండి నూనెను తీసినట్లు, పువ్వులను నలిపి వాసన జూచినట్లు, పండ్లను చిదిపి రసమును లాగినట్లు, కట్టెను మధించి అగ్నిని బొందినట్లు, పాలను చిలికి వెన్నను గైకొనినట్లు, వడ్లను దంచి బియ్యమును తీసినట్లు ఆత్మధ్యానము నభ్యసించియు, ఆత్మవిచారము చేసియు, మీ దేహములయందు దాగియున్న నన్ను మీరు గ్రహింపుడు. నేను అచింత్యుడను, అవ్యక్తుడను. నిర్గుణుడను, సగుణుడను, సమస్తజగదాధారమూర్తిని, బ్రహ్మమును అయి యున్నాను. కాన, నాకై మీరు విచారము పడవలదు. విచారపడినందున నేను కాన్పించువాడను కాను. నా దేహమును గూర్చి విచారపడుటమాని, నా ఆత్మను గూర్చి విచారము చేయుడు. స్వభావసిద్ధముగ మీ రందరును ఆత్మస్వరూపులే. కాని ఈ దేహములు మీరు

కారు. ఈ దేహములు మాయచే కల్పింపబడినవి. మీ యందుగల నిద్రాశక్తి మిథ్యయైన స్వప్నమును కల్పించినట్లు, నా యందున్న యీ మాయాశక్తి మిథ్యయైన యీ సాంసారిక జగత్తును కల్పించుచున్నది. మెలకువ వచ్చిన తోడనే స్వప్నము నశించునట్లు, జ్ఞానము కలిగినతోడనే యీ సంసారమును నశించును. ఈ జగత్తునందు మీ దృష్టికి గోచరించు నామరూపాత్మకములైన యీపదార్థము లన్నియు ఎండమావులలోని జలమువలె, భ్రమాత్మకములైనవి. జీవుడు యిట్టి మోహముల వెంటబడి బాధపడక వెంటనే వైరాగ్యమునొంది, ఉపరతిని బూని, ఆత్మజ్ఞానమును సంపాదించి, నాయం దైక్యము నొందవలసి యున్నాడు. లోకములో బిడ్డలను కోల్పోయిన తల్లులకును, భర్తలను కోల్పోయిన భార్యలకును, సంతానము నశించిన తండ్రులకును, తండ్రులను కోల్పోయిన బిడ్డలకును, భార్యలకు ఎడబాసైన భర్తలకును, యింకా యితర విధముల, వ్యసనములను జెందుచున్న సర్వ జీవులకును, నా అచింత్యా సందేశములోని తత్త్వమును విస్తరించి చెప్పి, వారికి దుఃఖోపశాంతిని గలిగింపుము. భయము వలన మరణము కలుగునుగాని, మరణమువలన భయ మెన్నటికిని సంభవించదు. "నేను దేహమును" అను అజ్ఞానమే మృత్యువు. "నేను దేహిని" యను జ్ఞానమే అమృతము, శాంతము, శివము. కాన యిట్టి జ్ఞానమును లోకమునందు వ్యాప్తిచేసి జీవులకు శాశ్వతశాంతిని గలిగింపుము. ఇంతకంటె

నేను చెప్పవలసినది లేదు. శీఘ్రముగ పోయి మీ కర్తవ్యమును నెరవేర్చుడు. మీకు శుభ మగుగాక.

ఓంతత్సత్.

### మాతామహుని విలాపము.

ఈ మాటలు మాతామహుని మనస్సునకు తట్టగనే వెంటనే వారు కండ్లు తెరచి చూచిరి. అచ్చట నితరు లెవరును కాన్పించలేదు. అంతట ప్రహ్లాదునిగూర్చి వా రిట్లు స్తుతించిరి. "నాయనా! ప్రహ్లాదా!! నీ దివ్యదర్శనమును నీదివ్యశ్రవణమును, నేను పొందిన యీ సుముహూర్తము నాజీవితచరిత్రలో మహత్తరమైయున్న దనినమ్ముచున్నాను. ఆత్మతత్త్వమునుగూర్చి యిదివర కెందరో ఉత్తమపురుషులు గ్రంథముల వ్రాసియుండిరి. మహనీయు లెందరో దివ్యసందేశముల నిచ్చియుండిరి. కాని అసలు ఆత్మ కీ మాయ యనునది యేల అవసర మయ్యెనో, యియ్యది యెందు కిట్లుండవలసివచ్చెనో అను ప్రశ్నకు మాత్రము నాకు తెలిసినంతవరకు ఇంతవర కెవరును జవాబు చెప్పియుండలేదు. మాయ యెట్లు కలిగినదని ప్రశ్నించరాదనియు, అది ఎట్లు నశించునని మాత్రమే అడుగవలె ననియు, నింతవర కుద్భవించిన తత్త్వవేత్తలు పలుకుచుండిరి. కాని ఆమాయ యెందులకుండవలెనో అయ్యది ఆత్మ కెట్లు అవసర మయ్యెనో అను విషయమును నేడు నీముఖతః మాత్రము వెల్లడియైనందులకు ముముక్షువులందరును ధన్యులైనారు. ఒకవస్తువు పోయి దొరికినగాని దానియందు ప్రేమ అతిశయించదనియు, ఆప్రేమ వృద్ధియగుట కొరకే ఆవస్తువు మరుగై యుండవలసిన

అవసరము కలదనియు నీవు తెలుపుచు, అట్లనే ఆత్మకూడ మాయచాటున దాగియుండి పిమ్మట అన్వేషణము వలన కాన్పించినప్పుడు దానియందు ఆనంద మతిశయించి స్థిరముగ నుండుననియు, ఇందునిమిత్తమే ఆత్మతో మాయకు అవినాభావసంబంధము కలిగియున్నదనియు నీవు కావించినయీ బోధ నాకు చిత్తసమాధానము కలిగించినదనుట అతిశయోక్తి కాజాలదు. ఈసత్యమును గ్రహించియే కాబోలు నాటకకర్తలు నటీనటులకు కొంతకాలము వియోగమును గలిగించి పిమ్మట వారికి సంయోగమును కలిగించియున్నారు. అటులనే రోగులకు అన్నముపై రుచిని కలిగించుటకై డాక్టర్లు వారిచే కొన్నాళ్లు లంఘనములు చేయించుచున్నారు. రాత్రుల బాగుగా నిదుర పట్టుటకే పగటినిద్ర మానివేయుడని బ్రహ్మచారులకు గురువులుపదేశించుచున్నారు. తప్పిపోయినపిల్లవాడు కాన్పించిన దినమున తలిదండ్రులకు కలిగినసంతోషమునకు మేర యుండదు. భర్తను గోలుపోయినభార్యకు తిరిగి అతడు లభించిన నాడు ఆతనిపై నామె కెంతప్రేమ యుండునో యూహకు అతీతమైనవిషయము. అట్లనే మాయ ఆత్మను మరుగుపరచియుంచును. ఆత్మ మరుగై యున్నప్పుడు ఆత్మమీాద ప్రేమ అంతగా నుండజాలదు. కాని ఆమాయ తొలగి తిరిగి ఆత్మ లభించిననాడు ఆత్మకు కలుగునానందము వర్ణనాతీతము. ఇట్టి నీదివ్యసందేశమును లోకములో ప్రచారము చేయనిచో మేము తప్పక స్వార్థపరులమే యగుదుము. కాన నీ నిర్యాణ దినమైన కార్తీక బ ౬ తిథియందు ప్రత్యాబ్దికవిధిగ ప్రతి

సంవత్సరము నీ వర్ధంత్యుత్సవమును జరిపి నీవు కావించిన యీ సమాధిసందేశమును ఇందలి తత్త్వబోధను జిజ్ఞాసువులకును ముముక్షువులకును వెల్లడించి ప్రచారము చేయుటకై భగవానుడు మాకు శక్తిసామర్థ్యములను ప్రసాదించుగాక! ఆ నాడు ఆ ప్రహ్లాదుడు తన తండ్రియైన హిరణ్యకశిపునకు బోధించిన ఆత్మతత్త్వమును తిరిగి యీనాడు ఈ ప్రహ్లాదరూపమున నీవు నీ తాతయగు నాకుపదేశించి నన్ను ధన్యుని గావించితివి. నీ వలన నా జన్మము సఫలమైనదని యెంచుచున్నాను." అని ప్రహ్లాదుని మాతామహుడు కొంతసేపు ఆ సమాధి సమీపంబున నిలిచి, చింతించినవాడాయెను. పిమ్మట వారు ఆ సమాధికి ప్రదక్షిణనమస్కారంబులు చేసి చిన్నవాండ్రనందరిని వెంటబెట్టుకొని యింటికి బయలుదేరిరి. త్రోవలో కృష్ణానదియందు అందరును స్నానమొనర్చి గృహమునకు వెడలిరి. శ్మశానములో తనకు వినవచ్చినవాక్యములనుగూర్చి ప్రహ్లాదుని మాతామహుడు రెండుమూడుదినములు దీర్ఘముగ యోచించెను. అప్పుడు వారికిట్లు తోచెను.

"అచింత్యా"అను పదమునకు సంస్కృతభాషలో నేమి అర్థము? ధ్యానమున కతీతుడైన పరబ్రహ్మము. అయితే తెలుగుభాషలో 'చింత'అను పదమున కేమి యర్థము? 'విచారము'అని అర్థము. అప్పుడు "అచింత్యా" అనగ తెలుగులో ఏమిఅర్థమగును? "విచారపడతగదు" అని అర్థము. కాన 'అచింత్యా' అనుదానికి సంస్కృతభాషలో పరబ్రహ్మము అనియు, తెలుగు భాషలో 'దుఃఖపడవలదు' అనియు అర్థ

ములు స్ఫురించుచున్నవి. కాన "ఓం అచింత్యా" అను నప్పుడు ప్రహ్లాదుని తాత్పర్య మేమైయుండును ? అనిత్యమైన యీ దేహాదులనుగూర్చి దుఃఖపడవల దనియు, నిత్యమైన పరబ్రహ్మమునుగూర్చి పరిశ్రమము చేయు డనియు, అట్లైనచో జీవులు ఈ జన్మదుఃఖ జరావ్యాధి సంసారసాగరమును తరించి సుఖపడగలరు. కాన దిగులుపడియున్న తనవారికి సద్గురువులవారి వలన ఆత్మజ్ఞానము నుపదేశింపు డనియు, నితరులకు కూడ ప్రబోధము చేయుడనియు, ప్రహ్లాదుడు తన అంత్యసందేశమును ప్రకటించినాడు. అని మాతామహులు సారాంశమును తేల్చుకొనిరి. అప్పటినుండియు ప్రహ్లాదుని సందేశము గుప్తగారిమనస్సులో గాఢముగ నాటి దినదినము నూతనవికాసము నొందుచుండెను.

ప్రహ్లాదునివియోగము బంధువులకేకాక యితరులకు గూడ మనస్తాపము గలిగించియుండెను. అందరి దుఃఖభారము తొలగించవలసిన మహాబాధ్యతను ప్రహ్లాదుడు తన మాతామహునిపై నిలిపియుండెను. ప్రస్తుతము తల్లి, తండ్రి, నాయనమ్మ వీరి సంగతి ముందుగ విచారింపబడవలసియున్నది. వీరు దుఃఖసముద్రములో మునిగిపోయిరి. వీరికి దుఃఖోపశమనమును సద్గురూపదేశముద్వారా నిర్వర్తింపవలయునని ప్రహ్లాదుడు కోరియుండెను. ఇప్పుడు సద్గురు వెట్లు లభించును ? ఈశ్వరసాక్షాత్కారము నొందిన మహానుభావులు తటస్థించుట పూర్వ పుణ్యపరిపాకమువలన గాని కలుగజాలదు.

"ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్ నిబోధత."

అను విధివాక్యము గలదు. అనగా, 'ఓ జీవులారా! లెండు, మేలుకొనుడు. సద్గురువుల నాశ్రయించి పరమాత్మని తెలిసికొనుడు'' అని దీని యర్థము. ఇట్టి హెచ్చరికను చేసి జీవుని కడతేర్పగలమహానుభావులకొరకు ప్రహ్లాదునిమాతా మహులు అన్వేషించుచు నిరీక్షించుచుండిరి. ఇట్లుండ బందరు నుండి యీలేఖవచ్చినది.

ప్రహ్లాదుని జననీజనకులు, సద్గురుదర్శనము.

ఓమ్.

బందరు.

మహారాజశ్రీ తూనుగుంట్ల రామస్వామిగుప్తగారికి-
సోదరుడు తమ్మన ముక్తేశ్వరరావు—

"ప్రియసోదరా!

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు ఇక్కడకు నాలుగు దినములక్రింద వచ్చినారు. ఇంక నిక్కడను వారమురోజు లుందురు. నిన్నటిరోజున మీ వదినెగారు శ్రీవారిదర్శన మునకు వెళ్ళివచ్చినారు. కనుక వెంటనే మీ రందరును బయలు దేరి రాగోరుతాను. ఇక్కడబిడ్డలువగైరాలందరును క్షేమము. అక్కడ మీ క్షేమములను వ్రాయించగోరుతాను.

గ్రహించవలెను.

తమ్మన ముక్తేశ్వరరావు."

ఈ జాబు వచ్చినతోడనే పేదకు పెన్నిధి దొరకినచంద మున, నోరుదెరచిన ముత్యపుచిప్పలకు స్వాతివాన లభించిన భంగి, అందరకును పరమానందమైనది. ఈ జాబులో తెలుప బడిన శ్రీ సద్గురుమూర్తి యెవరు? ఆదిశంకరులకు జన్మ భూమియగు మలయాళదేశంబున నవతరించి శైశవముననే బ్రహ్మచర్యవ్రత మూని, తపోవనముల కరిగి, పరమవిజ్ఞాన మహదైశ్వర్యమును సముపార్జించి, సంసారఘోరదావాగ్నిచే దహింపబడుచున్న మానవకోట్లకు తన బ్రహ్మజ్ఞానసుధారస వృష్టిని అనుగ్రహింపసమకట్టి కొంతకాలము తిరుపతిగోగర్భ నందు తపమొనర్చియు, హిమవత్పర్వతప్రాంతతపోభూముల సంచారము సల్పియు, ప్రస్తుతము శ్రీకాళహస్తిసమీప కాశీ బుగ్గతీర్థతీరస్థవ్యాసాశ్రమమునందు వేంచేసియున్నస్వా నుష్ఠానగరిష్ఠులును, యథార్థభారతి యను ఆధ్యాత్మికమాస పత్రికమూలమున ఆత్మజ్ఞానప్రచారము గావించుచున్న తపో నిష్ఠావరిష్ఠులును, విశిష్టశిష్టాచారపరిపాలకులును, శుష్క వేదాంతతమోభాస్కరులును, అహింసాతత్పరులును నగు శ్రీమలయాళసద్గురుమూర్తి శ్రీబృందావనపురమున కరు దెంచినట్లు పై జాబు తెలుపుచున్నది. ఇట్టి సద్గురుమూర్తి కి దర్శనభాగ్యమును, పాదసేవామృతమును, ప్రహ్లా దుని తల్లిదండ్రులకును, నాయనమ్మకును, సంప్రాప్తమగు నట్లు చేయవలె ననిప్రహ్లాదునిమాతామహులు తలపెట్టిరి. వెంటనే ప్రహ్లాదుని రెండవ మేనమామయైన రాధాకృష్ణుని బాపట్లగ్రామమునకును, కనుపర్తికిని పంపిరి. ప్రహ్లాదుని

తండ్రి వెంటనే బెజవాడకు వచ్చెను. కాని నాయనమ్మ వచ్చుటకు సందర్భపడలేదు. అందరును శ్రీ స్వాములవారి దర్శనార్థమై బయలుదేరిరి. ప్రహ్లాదుని తల్లి, తండ్రి, మాతామహులు, మాతామహి, పినతల్లియు, 24-11-32 తేదిని సాయంత్రము బందరునకు చేరిరి.

ఈ బందరు నోబిల్ కాలేజిలో ప్రహ్లాదుని మూడవ మేనమామ ఆనందమోహన్ అనునాతడు బి. ఏ. పరీక్షకు చదువుచుండెను. ప్రహ్లాదుని జబ్బుసమాచారముగాని, నిర్యాణవార్తగాని యింతవరకు నీ మేనమామకు తెలుపబడలేదు. ఏలననగా, నీతని కప్పుడు సెలక్షన్‌పరీక్షలు జరుగుచుండెను. ఈ కఠినవార్త యొక వేళ ఆతనిచెవికి సోకినట్లాయెనా, ఆతనిమనస్సు చెదరి పరీక్షాభంగ మగునేమోయను భీతిచే నాతనికి తెలుపలేదు. కాని 24 తేదీన జ్ఞానప్రసూనాంబ సహా అందరును బందరునకు వచ్చుచుంటి మనిమాత్రము ఆతనికి జాబు వ్రాయబడెను. అందులో ప్రహ్లాదునిమరణ వార్త తెలుపబడలేదు. దసరాసెలవులలో ప్రహ్లాదుని చూచుభాగ్యము కలుగలేదు. కనుక నిప్పు డయ్యది తనకు బందరులోనే అప్రయత్నముగ తటస్థించబోవుచున్న దని యీ మేనమామ సంతసించినవాడై బసకు వచ్చి బెజవాడ నుండి వచ్చిన తనవారి నందరిని కలుసుకొనెను. "ప్రహ్లాదు డేడీ? ఒక్క పర్యాయము ఎత్తుకొని, ముద్దుపెట్టుకొని, కరవు తీర్చుకొనియెదను." అనుచు, ప్రహ్లాదుని తనచేతి కీయవలసినదని తల్లియైన జ్ఞానప్రసూనాంబను ఆతడు కోరియుండెను. ఈ

ప్రశ్నకు తల్లి యేమి జవా బీయవలెనో ఊహింపుడు. ఎవరును తల యెత్తలేదు. అందరిముఖమండలములు వెల వెల బారిపోయినవి. రెండు నిమిషములు ప్రపంచ మంతయు చీకట్లు క్రమ్మిన ట్లున్నవి. "ఇది యేమి? అందరు నిట్లున్నారేమి?" అని ఆ మేనమామ తిరిగి ప్రశ్నింపవలసివచ్చెను. "ప్రహ్లాదుని పని పూర్తియైనది. అతనికి నీళ్ళు వదలుకొన్నాము." అని అక్కడ నున్నవారు దుఃఖవార్తను చల్లగ జారవిడిచిరి. ఆ మేనమామయొక్క ఆంతరంగికప్రపంచము అప్పు డెట్లుండెనో, ఎవరికి వారు స్వానుభవముచే నూహింపవలసినదే గాని మాటలతో వర్ణించుటకు వలను పడదు. కొంతసేపటికి ప్రాణములు తెప్పరిల్లగనే జరిగిన వృత్తాంత మంతయు నాతని కెఱింగించిరి. ఈ మేనమామ చిన్నతనమునుండియు వైరాగ్యచింతనము గలవాడును, ఈశ్వరభక్తి గలిగి జ్ఞానవిచారణయందు ఆసక్తితో పని చేయుచున్నవాడును అగుటవలన ఆకస్మికదుర్వార్తాశ్రవణముచే చలించిన తన మనస్సును క్రమశః ఆతడు సమాధానపరచుకొని స్వస్థచిత్తు డాయెను. ఆ రాత్రి యీ మేనమామకు నిదుర పట్టలేదు. మేల్కొనియుండగనే స్వప్నములు కాన్పించినవి. ప్రహ్లాదునిస్వరూపమును, ఆత డిదివరలో నొనర్చియుండిన చేష్టలును, ఆతనికండ్లయెదుట పొడగట్టుచుండెను. నిద్ర పోవలె నని యాత డెంత ప్రయత్నించినను, నిద్ర పట్టదాయె. పోనిండు, కండ్లు తెరచి మేల్కొనియుందుమా యనిన కండ్లయెదుట బిడ్డడు ప్రత్యక్ష మగుచుండెను. 'ఈ సంది

గ్ధావస్థలో నుండి తప్పించుకొను టెట్లురా? దైవమా' యని యాతడు యోచించి ఆయర్ధరాత్రివేళ నొక కాగితమును, కలమును చేబూని, ఆబిడ్డనుగూర్చి యీ క్రిందిపద్యములను వ్రాసి కండ్లు మూసికొనగనే పిల్లవాడు సంతృప్తుడై కాబోలు వెంటనే అదృశ్యుడాయెను. ఈ పద్యములను వ్రాసిన ప్రహ్లాదుని మేనమామకు, గణయతిప్రాసలక్షణములు తెలియవు. అంతరాత్మప్రేరితుడై, ఆవేశమునందు ఆతనినోటనుండి యీ పద్యములు అప్రయత్నముగ వెలువడెను.

ప్రహ్లాదుని స్మృతి పద్యములు.

సీ॥ ప్రహ్లాదనామంబు పాటించి చెన్నుగ
భక్తుండవై మెలగినావు
ఆహ్లాదసౌఖ్యముతో అతిశయిల్లెడి నీవు
ఆడుచు పాడుచు గడపినావు
భక్తులహృదయాల రంజింపజేయుచు
పుష్పగుచ్ఛంబుల గోసినావు
ఓంకారయాశ్రంబు పావన మగునట్లు
ఓంకారపూజను సలిపినావు
గీ॥ పరమపవిత్రహృదయాంతరాళంబు
కరము స్వచ్ఛలావణ్యరూపంబు
బొందిన నీయొక్క నెడబాటు నేమిచేతు
అహాహాహా! మహితదుఃఖభాజనుండ నైతి. 1

సీ॥ వేదాన్తవేద్యుడై వేదధర్మంబును
విదితంబు చేసిన నీ తాత యొకడు

గణితవిద్యయందు నిపుణాతినిపుణుండు
శాంతచిత్తుండు నీ తండ్రి యొకడు
సత్యంబు సాధింప యత్నంబుచేసిన
మూర్తిమతియైన నీతల్లి యొకతె
నీ నామమును గాంచి నిర్మలచిత్తుడై
జ్ఞానంబు వెదజల్లు గాంధి యొకడు
గీ॥ ఇందరి విడనాడి పోవుచుంటివ నీవ
కాదుకాదు అందరివద్దనె నుంటివీవ
హృదయంబులోనున్న పుండరీకాక్షుండు
సర్వాంతర్యామియై మెలగుచుండు.
సీ॥ నిర్యాణమును జేసి యీ లోకమును విడిచి
యెట్టి వేదాన్తబోధ గావించినావు
ప్రియంబు బుద్బుదం బన్నవిషయంబు
నిజమని లోకమున్ జాటినావు
లక్షాధికారైన భిక్షాధికారైన
ఈశ్వరదృష్టిలో నొకటి సుమ్మ
సంసారకూపంబు దాటయత్నించుచు
పరిశుద్ధచిత్తులై మెలగవలయు
గీ॥ భక్తసాన్నిధ్యసంసిద్ధి నొందవలయు
ముక్తి బొందెడు వెరవునే బూనవలయు
మోక్షసామ్రాజ్యస్థాపన జేయవలయు
నరయ గోవిందుపాదముల్ ప్రోవవలయు.
సీ॥ నిర్మలంబైనట్టి నీ వాక్కునందు
అచింత్యాశబ్దంబు అలరారుచుండు

అక్కజంబైనట్టి నీ మోమునందు
ఆనందబాష్పము లొదవుచుండు
నీలమేఘచ్ఛాయ నీరూపుచందంబు
మేలిమి బంగరై మెరయుచుండు
చిన్ననాటినీదు చైదంబు లన్నియు
మాకెట్టి యబ్బుర మరసిచూడ
గీ॥ సకలసౌభాగ్యనిలయంబు నైననేమి
సుగుణభూషణభూషితు డైననేమి
విరించి కృతంబు విధివశంబునునైన
బ్రిహ్మవ్రాత కెవడు బదులుసెప్ప. 4

సీ॥ పరమేశునాజ్ఞలు పాలనపడువేళ
మానుషయత్నంబు మరుగుపడును
హేరామ! హేకృష్ణ! హేమాధవా!యంచు
నెంతయో పల్కిన నేమిఫలము?
చిత్తశుద్ధియు గల్గి చేసినకార్యంబు
భళిభళీ యంచును పొగడబడును
ఇందిరానందను నాజ్ఞకై వేచియు
భక్తుండు వినయుడై బరగుచుండు
గీ॥ పండరిపురనాథ భద్రకీర్తి
నిరతిశయ సౌఖ్యనిలయమీవ
ఓభక్తమందార! ఓసుందరాకార!
కాచి మమ్మేలుమీ కమలనాభ!! 5

## రామమోహనప్రహ్లాదస్మృతి.

(శ్రీయుత కాకరపర్తి సుబ్బారావుగారు, బి. ఏ.)
(వాసవిపత్రిక. 7 సంపు. సంచిక 12., పేజి 4 32)

రామమోహనుడు నా సోదరుండగు కాకరపర్తి జ్వాల నరసింహం B. A. గారికి 16-4-31 న జన్మించెను. బ్రహ్మశ్రీ తూనుగుంట్ల రామస్వామిగుప్త, B. A B., L. గారికి దౌహిత్రుడు. శ్రీవారు దౌహిత్రునియందు గల వాత్సల్యముచే ప్రహ్లాద యని నామ మిడిరి. అట్టి రామమోహనప్రహ్లాదుడు 18-11-32 నాడు పిన్నవయస్కులగు తల్లిదండ్రులను, మమ్ముల నందఱిని విచారసాగరమున ముంచి దివి కేగెను.

---

## రామమోహనప్రహ్లాద
## స్మృతి.

గీ॥ పుట్టి యెఱుగను మాయింట పురుడనంగ
అట్టి దెట్టిదో తెల్పితి పుట్టి నీవు
పురుడనంగను సంతోషపడుడ నైతి
సంతసం బెల్ల అప్పుడే యంతమొందె. 1

'రామమోహను' డని తండ్రి నామ మిడియె
తాత 'ప్రహ్లాద' యని ముద్దుచేత పిలిచె
రామమోహన ప్రహ్లాద నామధేయ
రెండుసంవత్సరము లైన నిండలేదె
అపుడె ఆ సన్నమయె నీకు అస్తమయము. 2

నన్ను చూచిన అది యేమొ నాన్న! నీవు
ఎంతదూరము నుండైన గంతువైచి
'బాబ!' రమ్మని పిలిచెడు బాలకుండ
వట్టి ప్రహ్లాద నేటికి గిట్టినావె. 3

ఎన్ని జన్మంబులకునైన చిన్ననాన్న
మరతు మన్నను నీ రూపు మఱపురాదు;
కనుక ముందైన నాయొక్కగర్భమందు
పుట్టి తీర్చవె నాకోర్కె చిట్టితండ్రి!
మరణ మొందితివేగాని మరపురావు. 4

నన్ను పొరబడి పిలుతువు "నాన్న!" యనుచు
మాట లన్నియు నీనోటిమాట యయ్యె
చక్కదన మంత కనులలో చిక్కియుండె,
నట్టికన్నుల నెందు మే మరయబోము. 5

రెండు వర్షాలు నీతోడ రేయిబవలు
కాలమును గడిపినట్టి నీ కన్నతల్లి
కిట్టియెడబాటు నెట్టుల పెట్టవలయు
మాయదైవము! నీ కిది న్యాయమగునె. 6

పిన్నవయసున పుట్టిన పుత్రుడవని
మురిపెమును జెందు నీతండ్రి ముచ్చటలను
ఒక్కమారుగ త్రుంచెను ఓర్వలేక
దైవమా! నిన్ను దూఱిన తప్పుగలదె? 7

బాబ బాబాయి అనిపిల్చుపల్కులెల్ల
వీనులందున నేటికి వినుచునుందు
మాట లన్నియు త్వరలోనె మరచునట్లు
మాయదైవము! యిదియైన చేయవయ్య!
కొమరునాత్మకు శాంతంబు గొల్పుమయ్య
సాయమున కదె కొను నమస్కారశతము! 8
పుట్టి రెటులుగను మాయింట గిట్టుటనగ
అట్టి దెట్టిదొ తెల్పితి గిట్టి నీవు
కష్టసుఖములు తెలుపంగగాను మాకు
నిన్ను బంపెను కాబోలు చిన్నతండ్రి!! 9

---

## గురూపదేశము.

పిమ్మట ప్రహ్లాదుని తల్లి, తండ్రియు, మాతామహుడు, నాయనమ్మ- వీరందరును శ్రీ పరమహంసపరివ్రాజకాచార్యవర్యులు శ్రీ మలయాళసద్గురువులవారిని దర్శించి వారి పూజ్యపాదసంస్పర్శనంబు గావించి యిట్లు విన్నవించిరి.

నమో నమో వాఙ్మనసాతిభూమయే
నమో నమో వాఙ్మనసైకభూమయే
నమో నమో ఽనంతమహావిభూతయే
నమో నమో ఽనంతదయైకసింధవే. 1

అద్య మే సఫలం జన్మ జీవితం చ సుజీవితం,
యత్తవాంఘ్రియుగాంభోజే మన్మనో భ్రమరాయతే. 2

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యో ర్మాఽమృతం గమయ
ఆవి రావీ ర్మయేధిరుద్రియ త్తే దక్షిణం ముఖం
తేన మాం పాహి నిత్యం. 3

అనగా, వాక్కునకును, మనస్సునకును గోచరింపనట్టి వాడును వాక్కునకును మనస్సునకు విషయభూతుడై నట్టియు, మహావిభూతిసంపన్నుడును, అపారకరుణాసముద్రుడును అగు సద్గురుమూర్తీ! నీకు వందనములు. గురుసత్తమా! నీపద పంకేరుహముల స్పృశించుభాగ్యవిశేషమువలన నేడు మా జన్మములు సఫలములైనవి. మా జీవితములు పవిత్రవంతము లైనవి. కావున అనృతజడదుఃఖాత్మకమైన యీ సంసారకష్టములనుండి మమ్ము కాపాడి నిత్యమై, సత్యమై అమృతస్వరూపమైన మోక్షపదవిని మాకు అనుగ్రహింపుడు అని అందరును శ్రీ స్వాములవారిని ప్రార్థించిరి. తత్క్షణమే శ్రీ స్వాములవారు శిష్యులమనస్తాపములను చల్లార్చునట్టి అమృతవాక్కులతో వీరికి ధైర్యోత్సాహములను పురికొల్పిరి. మరునాడు కార్తీక బ ౧౨ వెళ్లగా బ ౧౩ శుక్రవారము రాత్రి 6 గంటల ప్రదోషసమయము, మహాపుణ్యప్రదమైనది. ఈ పవిత్రకాలము సంవత్సరమున కొక్కతూరియే వచ్చును. అందులో శుక్రవారము తటస్థించుట పుణ్యతమము. ఈ సుముహూర్తమున శ్రీ స్వాములవారు స్వయముగ రుద్రాభిషేక మొనర్చిరి. ప్రహ్లాదునితల్లిచేతను, అమ్మమ్మచేతను లక్ష్మి

పూజను చేయించిరి. అభిషేకకాలమందు మాతామహుని చేత పురుషసూక్తమును చెప్పించిరి. అనంతరము స్వాముల వారు ప్రహ్లాదునితల్లికిని, తండ్రికిని మహామంత్రోపదేశ మును కావించిరి. వారికి చిత్తశాంతిని కలిగించుమహా వాక్యార్థమును బోధించిరి.

ఇంతటితో ప్రహ్లాదుని కోర్కె యీడేరినది. ఇకను ప్రహ్లాదునినాయనమ్మ మున్నగువారికిని, బంధుమిత్రాదుల కును, సమస్తజనులకును సంసారబాధా నివృత్తికారణమైన ఆత్మజ్ఞానమును తెలిపి ప్రహ్లాదుని వాంఛను సఫలపరుపవల సినకార్యభారము ఇకను శేషించియున్నది. ప్రహ్లాదు డెందునిమి త్తమై యవతరించియుండెనో అట్టి పవిత్రకార్యము ముగిసి నది. మాతామహులచే సంతోషపూర్వకముగ ఉపచారసే వలను చేయించుకొనియున్నాడు. తల్లియైన జ్ఞానప్రసూనాంబకు ప్రథమపుత్రుడై పుట్టి, ఆమె గర్భమును పవిత్రముచేసినాడు. సాక్షాత్ శ్రీమన్నారాయణుండు పరమభక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదనామమును, ప్రపంచశాంతిస్థాపనాచార్యుడైనగాంధి నామమును సమ్మేళన మొనర్చి ప్రహ్లాదగాంధిరూపమున కాక రపర్తివారివంశమున నుద్భవించి వంశపావన మొనర్చియు న్నాడు. బెజవాడ, కనుపర్తి, వేటపాలెం, బాపట్ల, బందరు, రేపల్లె గ్రామములలోని బంధుమిత్రాదుల యిండ్లకు వెళ్లి వారిహృదయ ప్రేమనవనీతము నాకర్షించి, వారికి భక్తివిశ్వా సములను కలుగజేసినాడు. ఇంతటితో తృప్తినొందక మానవుల కందరకును ఆత్మజ్ఞానము నుపదేశించి, మరణభయమును,

మృత్యుభీతిని నివారించుటకై తన నిర్యాణచతుర్ధదివసమున శ్రీకృష్ణ వేణీసైకతభూమియం దున్న తన సమాధినుండి లేచి "అచింత్యా" సందేశమును చాటియున్నాడు. ఈ సందేశము లోని రహస్యమును, తత్త్వమును, సువ్యక్తపరచి ప్రపంచము నందు ప్రచార మొనర్పగలందులకు తన మాతామహుని భుజ స్కంధములపై కార్యభారము మోపియున్నాడు.

ప్రహ్లాదుడు మరల మరల కాన్పించుట.

ప్రహ్లాదుడు తన 'అచింత్యాసందేశము'నకు తాత గారు వ్యాఖ్యానమును వ్రాసి మానవకోటికి మరణభయం బును పోగొట్టు ఆత్మజ్ఞానమును బోధించవలయు నని ప్రహ్లా దునకు తీవ్రసంకల్ప ముండుటచే ఆతడు పదేపదే తాతగారి దృష్టికి కాన్పించుచు హెచ్చరిక చేయుచుండెను. కాన అట్టి ఆత్మవిచారమునుగూర్చి తెలుపుటకై వాని 'అచింత్యా సందేశమున కిప్పుడు వ్యాఖ్యానము ప్రారంభింపబడుచున్నది. సావధానచిత్తముతో శ్రవణము చేయుడు.

---

# ప్రహ్లాదగాంధి

## ద్వితీయ భాగము - తత్త్వబోధ.

### ఉపక్రమము.

తాను గావించినసమాధిసందేశమునకువ్యాఖ్యానమును వ్రాయవలసినదని ప్రహ్లాదుడు నావంటి కించిద్జ్ఞున కాజ్ఞ నిచ్చి యుండుటకంటె అనుభవజ్ఞులైన తత్త్వవేత్తల కా కార్యమును వదలివేసియుండినయెడల సమంజసముగ నుండెడిది. ఆత్మజ్ఞానమును గూర్చి తా నిచ్చిన మహత్తర మైనసందేశ మెక్కడ? అందలి సామాన్యార్థమునుకూడ గ్రహింపజాలని అల్పమతినైన నే నెక్కడ? తరంగతాడితమైన మహోదధిని తృణప్రాయమైన తెప్పకొయ్యతో దాటబూనిన మందబుద్ధి వలె విశాల కరాళకామ నక్ర గ్రహములతో నిండియున్న సంసారసాగరమును తరింపజేయగల ప్రహ్లాదుని సమాధి సందేశమునకు నావంటి మందుడు వ్యాఖ్యానము జేయబూనుట సాహసకార్య మని వేరుగ చెప్పవలెనా? రఘువంశమహా కావ్యరచనకు బూనుకొనినకాళిదాసువంటి మహాకవీశ్వరుడే యెత్తైన వృక్షాగ్రమునందలి ఫలముల నందుకొనుటకై చేతు లెత్తినపొట్టివానిచందంబున తాను లోకులయుపహాస్యము నకు పాత్రుడు కాగల నని తలంచియుండ వేలకొలదివత్సర

ములు ఉగ్రతపస్సు చేసి ధ్యానసమాధియందు చిత్తలయ మొనర్చిన యోగనిష్ఠాగరిష్ఠులచే తెలుపబడదగిన తత్త్వబోధ నుగూర్చి నేను వ్యాఖ్య వ్రాయబూనుటయందు నేను ప్రజా పరిహాసమునకు పాత్రుడ నగుదు నని తలంచుటలో విచిత్ర మేమున్నది? కాని నా సాహసకార్యమును మన్నింపు డని ప్రజలను ప్రార్థించుటకు నా శోక కారణము అండయై నిలిచినది. ప్రహ్లాదునియొక్క ఆజ్ఞను నెరవేర్చవలసిన బాధ్యతను వహించియున్నవా డగుటచేతను, ఈ విష యమై సూక్ష్మలోకమునుండి ప్రహ్లాదుడు పదేపదే హె చ్చరికలు చేయుచుండుటచేతను, ఈ మహత్కార్యమును చేబూనుటయందు నా సాహసకృత్య మేమియు లేదు అని ప్రాజ్ఞ లకు విన్నవింపవలసియున్నాను. లోకములో నేకార్యము నెవరు తలపెట్టినను, అయ్యది పరమేశ్వరునివలననే నిర్వర్తింప బడుననియు, కార్యాచరణమునందు మానవులు కేవలము సర్వేశ్వరుని యుపకరణములవంటివా రనియు నానమ్మకము. ఎట్లన,

సర్వోపి వ్యవహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః,
అజ్ఞానా న్న విజానంతి మృదేవ హి ఘటాదికం.

అనగా, 'ఘటము మృత్తికయొక్క కార్య మైనట్లు, జగ త్తులోని సకలకార్యములకును, బ్రహ్మమే కారణమై ఆతడా కార్యములను జనులచేత చేయించుచున్నాడు. కాని ఆకార్య ములకు తామే కారకుల మని అజ్ఞానవశులై జనులు తలంచు చున్నారు.' అని దీనియర్థము. కాన 'ఆ సర్వేశ్వరుడే యిప్పుడు

న నొక యుపకరణముగ గావించుకొని తానే యీ వ్యాఖ్యానకార్యమును నిర్వహించుచున్నాడు.' అని నానిశ్చితాభిప్రాయము. ఇట్టిస్థితిలో దీనియందలి ఫలాఫలములుగాని, లోపాలోపములుగాని న న్నాపాదింపజాలవు. యజమానుడొనర్చినక్రియలయందు భృత్యులకు ఎట్టి యుత్తరవాదిత్వముండునో ప్రాజ్ఞులే యూహింపవలెను. ఈ దృష్టితో నికను ప్రహ్లాదుని సమాధిసందేశమునకు వ్యాఖ్య వ్రాయఁగడంగెదను.

## జీవుల దుఃఖములు.

ప్రహ్లాదుని సందేశములో అనేకముఖ్యాంశములు గలవు. వాని పర్యవసానమును తెల్పుచు జీవులకు గలదుఃఖము నుపశమింపచేయవలెనని ప్రహ్లాదుడు ఉపసంహారమునందు తెలిపియున్నాడు. కాన అట్టి జీవులదుఃఖములనుగూర్చి మున్ముందుపక్రమింపవలసియున్నాము. ప్రపంచములోని జీవు లందరును, ఏదో యొక విధముగ దుఃఖము ననుభవించుచున్నారు. కొంద రాదియందును, కొందరు మధ్యలోను, కొంద రంతమందును కష్టము లనుభవించుచున్నారు. కొందరు శారీరకబాధలను, కొందరు మానసిక క్లేశములను, మరి కొందరు శారీరక మానసిక అశాంతి నొందుచున్నారు. వీ రందరును అనిత్యములై క్షణభంగురములైన విషయాదులను స్థిరము లని నమ్మి వానివలన ఆశాభంగమునొంది బాధలకు గురియగుచున్నారు. కొందరు దారిద్ర్యముచే, పరితపించి తమకు ధనము సంప్రాప్తమైనయెడల సుఖపడవచ్చు నని యాశపడుచున్నారు. కాన మన మిప్పుడు ధనవంతు లైనవారికడకు బోయి, వారు సుఖ

ముగ నున్నారో లేదో విచారించెదము. వా రేమి చెప్పు చున్నారో వినుడు. 'అయ్యా! మాకు భగవంతుడు కావలసి నంత ధనము నిచ్చియున్నాడు. కాని మా గర్భమున నొక్క పుత్రుడుగూడ కలుగకపోయెను గదా యని మేము అను క్షణమును విచారపడుచుంటి' మనిరి. కాన బిడ్డలు కలవారి యొద్దకు మన మికను పోయి ప్రశ్నించెదము 'ఏమయ్యా! మీరు కుశలమా!' యని యడుగగనే, 'అయ్యా, ఏమిచెప్పు దుము, మాపాట్లు? తినుట కన్నము కలదు. కట్టుటకు గుడ్డ యున్నది. ఇంత పిల్ల, జెల్ల యున్నారు. కాని అబ్బబ్బ! అందరికి రోగములే వైద్యునియింటికి వెళ్ళనిదినము లేదు. బాధపడని రోజు లేదు.' అని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. పోనిండు దేహారోగ్యముకూడ కలవానిని పలుకరించి చూచె దము. ఈత డేమనుచున్నాడు? 'అయ్యా ధనధాన్యాదులు, సిరిసంపద ఆరోగ్యము- అన్నియు నున్నవి కాని బిడ్డలు దుర్మార్గ సహవాసంబునబడి తల్లిదండ్రులమైన మాతో నిత్యము కల హించుటయే. మే మిందువలన అపకీర్తిపా లగుచున్నాము. మా కష్టము లెప్పుడు నివారణ యగునో' యని వారు మొఱ పెట్టిరి. ఇకను సత్సంతానపరులైన వారిని గూర్చి యోచించె దము. పాపము! వారు వ్యాజ్యములలో తగుల్కొని, న్యాయ వాదులకును, సాక్షులకును డబ్బు పోయుచు, కోర్టులచుట్టు తిరుగనిదినమే లేదట. కాన నిట్టి వ్యాజ్యబాధలు లేని మరి కొందరిస్థితిని విచారించెదము. వా రేమనుచున్నారు. 'అయ్యా అన్నియు సరిగనే యున్నవి. కాని మా వంశములో నొక్కరికైన

నింత యుద్యోగముకాని, మంచి హర్మోదాగాని లేకపోవుట కొఱతగ నున్న' దని యనుచున్నారు. ఇక నెట్టి లోపములు లేని సకలైశ్వర్యసంపన్నుడైన రాజునొద్దకు వెళ్లి ఆయనయభిప్రాయము తెలిసికొందము. కాని వీరి ఘోష వర్ణనాతీతము. 'అయ్యా! నేను రాజపదవి నొంది సర్వాధికారములను చెలాయించుచున్నసంగతి సత్యమే కాని నాకంటె అధికబలపరాక్రమములు గల చక్రవర్తివలన నాకు కలుగుచున్న బాధ మీా కేమి తెలియును? నా ప్రారబ్ధమును ఎవరు తప్పించగలరు?' అని వక్కాణించుచున్నాడు. ఇది యేమి యాశ్చర్యము! దరిద్రునిదరగ్గనుండి మహారాజువరకుగల సకలమానవుల యోగక్షేమముల నారసినను, వీరిలో నెవదును సంతుష్టమానసులై యుండకపోవుట విస్మయహేతు వగుచున్నది. ఇంతటితో మనవిచారణను ముగింపక, ఆచక్రవర్తిగారియింటికిగూడ పోయి వారి వృత్తాంతమును శ్రవణ మొనర్చెదము. 'భూమండలాధిపతియగు నోచక్రవర్తీ! పృథ్వీతలమున గల మానవకోటిలో తా ముత్తమపురుషులు శ్రీమహావిష్ణుస్వరూపులు. మీా క్షేమవార్తను వినగోరి యేతెంచినారము.' అని విన్నవింపగ ఇంతలో చక్రవర్తిగారు ఖిన్నులై యిట్లు ప్రత్యుత్తర మొసగెను "ఆర్యులారా! తాము సెలవిచ్చినవిషయములు అనృతములు కావు. కాని నాహృదయమున నొక గొప్పదిగు లుదయించి నాబలమునంతను పీల్చివైచుచున్నది. మొన్నటిదినము మా సంస్థానములోని జ్యోతిశ్శాస్త్రజ్ఞుని బిలిచి నా భావిగ్రహస్థితినిగూర్చి తెలుపు డని కోరగా, ఆతడును 'నెలదినము

లలో నీకు మరణయోగము కలదు.' అని సెల విచ్చెను. సకల భూమండలాధిపత్య ముండియు నా గ్రహములపై నా కధికారము లేక పోయెనుగదా! యని నేను వగచు చున్నా"నని ఆ చక్రవర్తి పలికెను.

పోనిండు. ఇకను గ్రహములనుగూడ బంధించగలవా రున్న యెడల వారిని విచారించిచూచెదము. పూర్వ మొకప్పుడు హిరణ్యకశిపు డనువాడు విష్ణుదేవుని సాధించవలె నని సంకల్పించి నిర్జనారణ్యములయందు ఘోరతపము చేసి బ్రహ్మదేవునివలన సమస్తవరములు బొందియుండెను. పంచభూతముల నరికట్టగలశక్తి, గ్రహములను బంధించగల సామర్థ్యము, దేవతలను పరాజితులుగ నొనర్చునై పుణ్యము - ఇట్లు సమస్త వరములను బడసి, తుదకు శ్రీ మహావిష్ణువుతో వైరము బూనియుండెను. అంతట నాతడు గ్రహముల నన్నింటిని కారాగృహమున బంధించివేసెను. దేవతల నోడించి వారిని పదభ్రష్టులుగ నొనర్చెను. తుదకు వానిగతి యేమైనది? శ్రీ మహావిష్ణువు నృసింహావతారమెత్తి, తన భక్తుని బాధించుచుండిన యా రాక్షసాధముని బట్టి చీల్చి చెండాడి, విగతజీవునిగ జేసియుండెను. ఇకను దేవతలకు గూడ దుఃఖము కలదా? యనిన, కలదు. ఇందులకు శ్రుతి, స్మృతి, పురాణములే సాక్ష్యములు. దేవాసురుల అన్యోన్యయుద్ధములు పరస్పరశాపములు, ఒకరి యైశ్వర్యమును మరియొకరు అపహరింపదలచుట, ఇత్యాది రాక్షసభయమువలన, దేవతలకు గూడ దుఃఖము కలుగుచున్నది. మరియు, పుణ్యకర్మక్షయ

ముచే స్వర్గసుఖము సళించునని, దేవతలకు భయము కూడ గలదు. అయితే, యిట్టి దుఃఖము కలవారు మన కుపాస్యు లెట్లు కాగల రనిన, రాజులు దుఃఖము కలవా రయ్యు, ద్రవ్య బలపరాక్రమసంపన్ను లగుటచే మన కెట్లు ఉపాస్యులై యిష్టార్థముల నొసగుచున్నారో, అట్లనే దేవతలు గూడ అష్టైశ్వర్యసిద్ధులు గలవా రగుటచే నితరత్ర వారు దుఃఖితు లయ్యును, మన కుపాస్యమూర్తు లగుచున్నారు. అయితే, దేవతలు తమ దుఃఖమును అంతఃకరణనిష్ఠంబుగా జూచెదరు. అందుచే వారు ఆనందస్వరూపులని శాస్త్రములు వచించు టకు కారణమైనది.

కాన లోకములో ధనము, సంతానము, కీర్తి, ఆరోగ్యము, బలము, అధికారము, గృహబంధనము, దేవతా వరములు, ఇత్యాది సముపాయము లన్నియును, జీవుల కెంత మాత్రమును సుఖము నీయజాల వని తేలినది. మనకు కాన్పించు విషయాదు లన్నియు దుఃఖమాత్రములే.

ఈ దుఃఖము సహజమా? కల్పితమా?

ఇట్లు సర్వప్రాణులకును కలుగుచున్న దుఃఖము స్వాభావికమా? ఆగంతుకమా? అనిన ఆగంతుక మనియే చెప్పవలెను గాని స్వాభావికం బని చెప్పరాదు. స్వాభావిక మైనచో దుఃఖనివృత్తికై ఎవరును ప్రయత్నము చేయక యుండవలయును గదా? కాని దుఃఖనివృత్తికై అందరును ప్రయత్నము చేయుచునే యున్నారు. అయితే దుఃఖము

స్వాభావికమే గాని దాని నివృత్తికొఱకు ప్రయత్నములు చేయబడుచున్నవని అనకూడదా యనిన, స్వభావము స్వరూపముగదా? అప్పుడు స్వరూపమునకు నాశము గల్గుట సంభవించును. అంతట దుఃఖనివృత్తి నొందినవారు లోకములో లేక పోవలెను. అట్లుగాక స్వప్రయత్నము చేసి దుఃఖనివృత్తి నొందిన జ్ఞాను లెందరో లోకమున గాన్పించుచున్నారు. కాన దుఃఖము ఆగంతుకమే యగును. దుఃఖము స్వాభావికమైనదని చెప్పినచో అయ్యది నివృత్తికాదని యర్థమా? అని కొందరు ప్రశ్నించుచున్నారు. దుఃఖము స్వాభావికమైనచో అది నశించక యుండవలె ననుట సత్యము. అట్లైన మఱియొక ప్రశ్న బయలుదేరుచున్నది. అగ్నికి స్వాభావికమైన యుష్ణము మణిమంత్రౌషధములచే నివర్తించి శైత్యమును గలిగించుట లేదా? అట్లనే ఆత్మకు దుఃఖము స్వాభావికంబైనను, కర్మోపాసనలవలన అయ్యది నశించి సుఖమును కలిగించు నని కొందరు వాదించుచున్నారు. ఇందులకు సమాధాన మేమనిన, అగ్నియందలి యుష్ణమునకు మణిమంత్రాదులవలని నివృత్తి తాత్కాలికమేగాని ఆద్యంతనివృత్తి కానేరదు. మణిమంత్రాదులచే అగ్నియందు తాత్కాలికముగ నణగగొట్టబడిన యుష్ణము కొంతకాలము దాటగనే తిరిగి విజృంభించుచున్నది. అట్లనే, కర్మోపాసనాదికముచే ఆత్మకు దుఃఖము తాత్కాలికముగ నశించి సుఖము కలిగినను, కాలాంతరమున అయ్యది తిరిగి ఆవిర్భవించును. కాన దుఃఖము స్వాభావికము కానేరదు. మఱియు స్వాభావికమైనచో, ప్రాణులు సర్వావస్థ

లయందును దుఃఖము ననుభవించుచుండవలయునుగదా! కాని సుషుప్త్యవస్థయందును, సమాధినిష్ఠయందును తూష్ణీంభావావస్థయందును జీవులకు దుఃఖము తోఁచుటలేదు. పైగా సుఖానుభవమే తోఁచుచున్నది. కాన ఆత్మకు దుఃఖము ఆగంతుకమనియే చెప్పవలెను. ఆగంతుకదుఃఖ మనగా స్వాభావికముగ లేనిదై మధ్యను నేదోయొక కారణమువలన వచ్చియుండవలయును గదా. ఆకారణ మేది? అనిన శరీరపరిగ్రహము చేతనే వచ్చిన దని చెప్పవలయును. ఎందెందు శరీరపరిగ్రహము గలదో అందందు దుఃఖము కలదు.

## ఈషణత్రియము.

పైన దెల్పిన విషయాదులలో ధనము, పుత్రులు, భార్య, వీనిమీఁదగల కోర్కెలు ముఖ్యముగ ప్రతిమానవుని బాధించుచున్నవి. వీనినే దారేషణ, ధనేషణ, పుత్రేషణ యనియు ఈషణత్రియము లనియు చెప్పుదురు. ఈ విషయములు విషముతో సమాన మని చెప్పెదరు. కాని యొక్కప్పుడు విషయముకంటె విషమే మేలగును. ఎట్లన, తన్ను భక్షించినవారినే విషము చంపును. విషయ మన్ననో తన్ను మనసున తలచినంతమాత్రముననే హాత మొనర్చును. ఎట్లన,

శ్లో॥ విషస్య విషయాణాంచ, దూర మత్యంత మంతరం,
ఉపభుక్తం విషం హన్తి విషయాః స్మరణాదపి.

అనగ, 'ఇంద్రియములచే ననుభవింపబడు చెడ్డవస్తువుల కన్నను, మనఃప్రీతిపాత్రంబులైన యీషణత్రయాదులు

ప్రాణులను త్వరగా చెరచుచున్నవి. విషము దేహమును ప్రవేశించి హింసించును. విషయము లన్ననో జ్ఞప్తికి వచ్చినంతనే హానిని కలిగించును' అని అర్థము. ఈషణత్రయములలో పుత్రేషణను గురించి ప్రథమమున విచారించెదము. లోకములో ప్రతివారును పుత్రులు కావలెనని యపేక్షించుచుందురుగదా! ఈ పుత్రులవలన దమకేమి యుపయోగము? పుత్రులను కోరి భార్య గర్భవతియై తుదకు ప్రసవించినది. అయితే ప్రసవించుసమయములో గర్భకోశమున కేదియో హాని కలిగి భార్య మృతినొందెను. భార్య చనిపోయిన దని దుఃఖముచే బిడ్డకలిగినా డను సంతోషము నివృత్తియైనది. ఇకను బిడ్డపెరిగి పెద్దవాడు కాగనే అతని వివాహాది ఖర్చులవలన ఆతడు తన ధనమును హరించినాడని తండ్రికి దుఃఖము కలుగును. మఱియు ఆ పుత్రు డాకస్మికముగ మరణించినట్లాయెనా, ఆ పుత్రశోకము వలన తండ్రి ప్రాణములకే మోసము సంభవించును. లోకములో బిడ్డలు మృతినొందినందుకు దుఃఖమును భరింపజాలక వ్యాధిగ్రస్తులై మంచము నెక్కి శుష్కించి మృత్యువాత బడిన తలిదండ్రులనెందరిని మనము చూచియుండలేదు. కాన పుత్రులు తుదకు శత్రువులే యగుచున్నారు. ఈభావమునే యీక్రింది శ్లోకము సూచించుచున్నది.

శ్లో॥ జాయమానో హరే ద్భార్యాం, వర్ధమానో హరే ద్ధనం।
ద్ధ్రియమాణో హరే. త్ప్రాణా న్నాస్తి పుత్రసమో రిపుః

అనగ, 'పుత్రుడు పుట్టి తనతండ్రియొక్క భార్యను హరించును. పుట్టి పెరిగినమీదట తండ్రిగారి ధనమును

హరించును. ఒకవేళ నీతడు చనిపోయి నట్లాయెనా, తండ్రి గారి ప్రాణములనే హరించును. కాన పుత్రునితో సమానుడగు శత్రువు లేడని యర్థము.

మఱియు,

అలబ్ధమాన స్తనయః పితరౌ క్లేశయే చ్చిరం
లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేనచ బాధతే.

అనగా, 'పుత్రులు లేనందులకు తల్లిదండ్రులు దుఃఖితులగుదురు. కాని గర్భము దాల్చినపిమ్మట గర్భపాత మైనచో గాని, ప్రసవించునప్పుడు తల్లికి గలుగు బాధచేగాని తల్లిదండ్రులు మిక్కిలి దుఃఖము జెందవలసియున్నారు.' అని యర్థము. ఇంతయేల! పుట్టిన పిమ్మట బిడ్డలకు గ్రహబాధలును, రోగబాధలును, గలిగినప్పుడు తల్లిదండ్రులు సహింపగలరా? మఱియు, ఆబిడ్డలు దుర్మార్గు లైనపక్షమున తమకు యావజ్జీవ దుఃఖమేగదా! ఎట్లన,

జాతస్య గ్రహరోగాది కుమారస్య చ ధూర్తతా
ఉపనీతే ప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే.

అనగ, పుట్టినబిడ్డ గ్రహరోగాదులచే బాధపడునప్పుడును, వాడు మూర్ఖు డైనను, జ్ఞానోపదేశము చేయించినను వా డజ్ఞాని యైనప్పుడును, ఒకవేళ పండితుడైనను వానికి వివాహము కానప్పుడును తల్లిదండ్రులకు సంతానమువలన సంతాపమే కలుగునుయని యర్థము. పుత్రులు పుట్టని యెడల తల్లిదండ్రులకు మొదటిదుఃఖము; పుట్టినపిమ్మట వారికి వ్యా

ధులు తటస్థించినచో రెండవ దుఃఖము; దుర్మార్గులైనచో మూడవ దుఃఖము; జారచోరత్వాదులచే వర్తించుచో నాల్గవ దుఃఖము; వార్ధక్య దశయందు వారు తమ్ము ననాదరణచేయుట అయిదవ దుఃఖము. కాన పుత్త్రులు పుట్టినను దుఃఖమే, పుట్టకపోయినను దుఃఖమే యగుచున్నది.

ఇకను దారేషణావిషయమై ముచ్చటింపవలసియున్నది. భార్యమీఁది మమకారమునకు దారేషణ యని పేరు. తనకు పెండ్లి కాలేదు కాలేదని పురుషుడు సంతాపపడి ఎట్లనో భార్యను సంపాదించగ, ఆమె అనురాగము కలిగియున్నచో నొక కష్టము, అనురాగము లేనిచో మఱియొక కష్టమును బొందుచున్నాడు.

రక్తా హరంతి సర్వస్వం ప్రాణానపి విరాగతః,
అహో! రాగవిరాగాభ్యాం కష్టకష్టా హి యోషితః.

అనగ, 'స్త్రీలు అనురాగయుక్తులైనచో, తమ భోగార్థము భర్తయొక్క సర్వస్వమును హరించెదరు. ఒకవేళ ప్రతికూలురే యగుచో భర్తయొక్క ప్రాణములనే అపహరించెదరు. కాన భార్యలు మంచివారైనను, చెడ్డవారైనను, భర్తకు దుఃఖమునే కలిగించెదరు.' అని తాత్పర్యము.

మఱియు సుందర స్త్రీయొక్క మోహమునకు లోబడువారు కామబంధనంబులలో చిక్కికొనియెదరు.

హరిణీపాదమాత్రేణ బంధితం హి జగత్త్రియం,
సుఖం తు బిందుమాత్రేణ దుఃఖం పర్వత మేవచ.

అనగ, 'స్త్రీయొక్క మోహస్థానమునందు ముల్లోకములు బంధింపబడియున్నవి. అచ్చట సుఖ మల్పము, దుఃఖము పర్వతసమానమునై యున్నది.' అని యర్థము. వివేకదృష్టితో చూచినయెడల స్త్రీమోహము భయంకరమైనది యగుచున్నది.

ఇతో మాంస మితో రక్త మితోఽస్థీనీతి వాసరైః,
ప్రాజ్ఞః కతిపయైరేవ యాంతి స్త్రీవిషచారుతాం॥

అనగ, 'ఇచ్చట మాంస మున్నది, యిచ్చట రక్తమున్నది, యిచ్చట ఎముక లున్నయవి యని వివేకముతో విచారించినపుడు స్త్రీశరీరము విషమువలె భయంకరమగుచున్నది' యని యర్థము. ఇకను ధనేషణను గూర్చి తెలుపబడును. "ధనమూల మిదం జగత్" అని చెప్పబడు ధనముయొక్క ప్రయోజన మెట్లున్నదో గమనింపుడు.

అర్థానా మార్జనే దుఃఖం ఆర్జితానాం చ రక్షణే।
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్ దుఃఖభాజనాన్.

అనగ, 'ధనమును సంపాదించునపుడు బహుకష్టములు పడవలసియున్నందున అప్పుడొక కష్టము; సంపాదించిన దానిని చోరులు మున్నగువారు హరించకుండ రక్షణచేయుటయందు రెండవ దుఃఖము; పిమ్మట ఆ ధనము నశించి పోవునప్పుడును, వ్యయ మైపోవునప్పుడును మూడవదుఃఖము. కావున ఎన్నివిధముల జూచినను ఛీ! యీ ధనమువలన కష్టమే కలుగును' అని యర్థము. మఱియు ధనము మీఁది ఆశ ఎన్న

టికిని తరుగునది కాదు. దేనికైనను పరిమితి గలదుగాని ధన వాంఛకు మాత్రము హద్దు ఎక్కడను లేదు. ఎట్లన,

యథైవ శృంగం గోః కాలే వర్ధమాన స్స వర్ధతే।
తథైవ తృష్ణా విత్తేన వర్ధమానేన వర్ధతే॥

'అనగ గోవు పెరిగినకొలది దానికొమ్ములుకూడ నెట్లు పెరుగునో అట్లనే ధనాశకూడ ధనము వృద్ధియైనకొలదియు పెరుగుచుండును.' అని యర్థము. మఱియు, నిట్టి ధనమును సంపాదించుటకు న్యాయవిరుద్ధమగు కార్యములను చేయవలసి వచ్చుచున్నది. ఈ యన్యాయార్జితవిత్తము తుద కింద్రియ భోగములకే వినియోగపడుచుండుట లజ్జాకరము.

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్ధసంచయాన్.

అనగ, 'ఆశ యను త్రాళ్ళచే కట్టబడిన కామ క్రోధ పరాయణులు తమ కామభోగముల కొరకు అన్యాయముగ ధన మార్జించుచున్నారు.' 'ధనమూల మిదం జగత్' అను ఆర్యోక్తినిబట్టి ధనవంతునకు సర్వసుఖములు కలుగు నని యందరును భ్రమపడుచున్నారు. కాని బాగుగ యోచించి నచో ఆతనికి గల కష్టములు మరియొకనికి యుండజాల వని నిష్కర్ష చేయవచ్చును. ఎట్లన,

అర్థజాని విదుః ప్రాజ్ఞాః దుఃఖా న్యేతాని దేహినాం,
అర్థస్యోత్పాదనే చైవ పాలనే చ తథాక్షయే.
రాజభి స్సలిలా దగ్నే శ్చోరత స్స్వజనా దపి,

భయ మర్థవతాం నిత్యం మృత్యోః ప్రాణభృతామివ
యథా హ్యామిష మాకాశే పక్షిభి శ్శ్వాపదై ర్భువి
భక్షితం సలిలే మత్స్యైః తధా సర్వత్ర విత్తవాన్.

అనగ, "ధనము సంపాదించుటయందును, పోషించుట యందును, ఖర్చుపెట్టుటయందును దుఃఖము; ఈ దుఃఖము మానవులను విడిచి పెట్టియుండునదికాదు. రాజుల వలనను, అగ్నివలనను, బంధువుల వలనను, చోరులవలనను భయము. దేహము గలవారిని మృత్యువు వెంటాడినచందమున యీ ధనికులను భయము వెన్నంటియుండును. ఆకాశమున పక్షుల చేతను, భూమిపైన కుక్కలు మున్నగు క్రూరజంతువుల చేతను, నీటియందు మత్స్యముల చేతను, మాంసఖండ మెటుల భక్షించబడునో అటులనే ధనము గలవాడు సర్వత్ర బాధింప బడును "అని యర్థము. కాన ధనవంతుని బాధలు దైవము నకే యెరుక. ధనవంతునకు ఇతరులవలన బాధ కలుగుట యట్లుండ తన కుమారునివలననే అతని కత్యంతభీతి గలుగు చుండును. ధనికుడైన తండ్రి మరణించినగాని, కుమారుని ఆస్తి స్వాధీనము కానేరదు. కాన తండ్రికి విషము పెట్టి చంపిన కుమారులు లోకమున నెందరు గలరో చరిత్రయే సాక్ష్య మిచ్చుచున్నది. ఈ సంగతిని శ్రీశంకర భగవత్పాదా చార్యుల వా రిట్లు స్థిరపరచియుండిరి.

అర్థ మనర్థం భావయ నిత్యం, నాస్తి తతస్సుఖలేశ స్సత్యం,
పుత్రాదపి ధనభాజాం భీతిః, సర్వత్రైషా విహితా రీతిః.

అనగ, 'ధనము సర్వానర్థమూలము. దానివలన సుఖ లేశముగూడ లేదు. ధనముగలవానికి పుత్త్రునివలన గూడ భయము గలదు. ఈస్థితి సర్వత్ర గమనింప తగియున్నది' అని యర్థము. లోకమున జీవులకుగల విషయాపేక్షలలో పుత్రుడు, భార్య, ధనము - ఈ మూడును మిక్కిలి బలవత్తరములైనవి.

విషయాదులు.

ఇకను తక్కిన భోగవస్తువులు సయితము జీవులను బాధించునవియేగాని అయ్యవి సుఖపెట్టు ననుట కల్ల. సిరిసంపదలు బాగుగ నున్నకాలములో నీ యిందియసుఖములు ప్రాణిని మోహమున ముంచివేయును. కష్టకాలములో తపింపజేయును. సంపాదనకాలములో చింత కలిగించును. కాన విషయభోగము లెన్నటికిని సుఖావహములు కావు. ఈ యర్థమునే యీక్రింది శ్లోకము వ్యక్తపరచుచున్నది.

సమ్మోహయతి సంపత్సు తాపయన్తి విపత్సుచ,
ఖేదయన్త్యర్జనే కాలే కదా భోగా స్సుఖావహాః.

కాన దేహసౌఖ్యముల నిచ్చు నీ ధన ధాన్యాదులు జీవులకు ప్రాణహారములే యని పెద్దలు సిద్ధాంతపరచియు న్నారు. ఎట్లన,

ధనైర్వా ధనదైః పుత్త్రైః దారాగారసహోదరైః,
ధ్రువం ప్రాణహరై ర్దుఃఖమితి వేదాంతడిండిమః.

అనగ, 'ధనమువలనగాని, ధనము నిచ్చువారి వలన గాని, పుత్రులు, భార్య, గృహము, సోదరులు మున్నగువారి

వలనగాని జీవుని ప్రాణములు హరించి దుఃఖపెట్టబడు ననుట నిశ్చయము.' అని వేదాన్తము ఘోషించుచున్నది. చిన్న బిడ్డలు మన కెంతయో ముచ్చటను కలుగజేయుదురు. వాని యాటపాటలు మనకు సంతోషమును కలుగజేయును. అయ్యవి సత్యము లని భ్రమించితిమి. కాని చూచుచుండగనే ఆబాల్య క్రీడలు గతించి పోయినవి. యౌవనకాలమందలి గర్వము గతించినది. ముసలితనములోని వైరాగ్యమును గతించినది. ఎట్లన,

ఇష్టా బాలకచేష్టా యౌవనదర్పోఽథ వృద్ధవైరాగ్యం,
సాపి గతా సోపి గత స్తదపి గతం స్వప్నమాయేయం.

అనగ, 'బాల్యమునందలి బాల్యచేష్టలును, యౌవన మందలి దర్పమును, వార్ధక్యమునందలి వైరాగ్యమును, దేని దేని ననుభవించునపుడు అదియది సత్యమని తోచును గాని, అయ్యవి స్వప్నమువలె మాయమై పోవును.' మఱియు,

చలా విభూతిః క్షణభంగి యౌవనం
కృతాంతదంతాంతరవర్తి జీవితం,
తథాప్యవజ్ఞా పరలోకసాధనే
నృణా మహో విస్మయకారి చేష్టితం.

అనగ, 'మానవుల యైశ్వర్యము స్థిరము కాదు. యౌవనము క్షణభంగురము. జీవితము మృత్యువుయొక్క పండ్లసందున పడియున్నది. ఇట్లున్నను, నిత్యమైన పరలోకసాధనమును గూర్చి జనులు తలపెట్టకయుండుట ఆశ్చర్యకర మగుచున్న'దని యర్థము. మఱియు,

సంపదో జలతరంగవిలోలాః యౌవనం త్రిచతురాణి దినాని,
శారదాభ్రపరిచంచల మాయుః, కిం ధనైః పరహితాని
కురుధ్వమ్.

అనగా, 'మానవుని సంపదను చూచెదమా, నీటిబుగ్గ వలె నున్నది యౌవనమును విచారించెదమా, మూడునాల్గు గినములు మాత్రమే యుండునది. ఇకను ఆయుఃప్రమాణ మును పరికించెదమా, శరత్కాలమేఘమువలె గాలికి కొట్టు కొనుపోవునది. ఇట్టి స్థితిలో అశాశ్వతములగు నీ విష యాదులను నమ్మకొనక లోకహితంబునకై గడంగుడు' అని యర్థము. కాన పైన తెల్పిన యీషణత్రియములును తక్కిన విషయాదులును సర్వజీవులకును దుఃఖహేతువు లగుచున్నవి. ఇట్లయ్యును జీవులకీ దుఃఖములు స్వతస్సిద్ధములు కావనియు, ఇయ్యవి శరీరపరిగ్రహముచేతనే కలుగుచున్న వనియుపైన తెల్పియున్నాము. అయితే ఈ శరీరపరిగ్రహము ఎందు వలన కలిగినది. అని మనము తెలిసికొన వలసియున్నాము.

కర్మమువలన శరీరపరిగ్రహము,

ఈ శరీరము కర్మముచేత పుట్టుచున్నది. అయితే కర్మము లెన్నివిధములు? ఏయేకర్మకు ఏయే శరీరములు పుట్టుచున్నవి? అనువిషయము తెలియదగియున్నది. కర్మ ములు మూడువిధములు. 1 పుణ్యకర్మ. 2 పాపకర్మ. 3 పుణ్య పాపమిశ్రమకర్మ. ఈ మూడువిధములగు కర్మలవలన జీవు లకు మూడువిధములగు శరీరములు కలుగుచున్నవి. ఎట్లన, కేవల పుణ్యకర్మమువలన దేవాదిశరీరప్రాప్తియు, కేవల

పాపకర్మవలన తిర్యగాది శరీరప్రాప్తియు, పుణ్యపాప మిశ్రమ కర్మమువలన మనుష్యశరీరమును కలుగుచున్నవి. వీనిలో ప్రతి కర్మభాగము ఉత్తమ, మధ్యమ, సామాన్యము లని మూడు అవాంతరభేదములతో జరుగుచున్నది. ఎట్లన, ప్రథమమున కేవలపుణ్యకర్మమును విచారించెదము. వీనిలో పుణ్యోత్కర్షము వలన దేవతలలో నుత్తముడైన హిరణ్యగర్భశరీరప్రాప్తియు, పుణ్యమధ్యమమువలన దేవతలలో మధ్యముడగు నింద్రాది శరీరప్రాప్తియు, పుణ్యసామాన్యమువలన దేవతలలో అధము డగు యక్ష, రక్షఃపిశాచాదిశరీరప్రాప్తియు కలుగుచున్నది. ఇకను రెండవదియగు కేవలపాపకర్మకుగల ఫలమును విచా రించెదము. ఇందులో పాపోత్కర్షమువలన పరులకు సంతాప కరమైన గుల్మ, సర్ప, వృశ్చికాది శరీరప్రాప్తియు, పాప మధ్యంబువలన ఆమ్ర, పనస, నారికేళ, మహిషాశ్వగర్ధభాది శరీరప్రాప్తియు, పాపసామాన్యమువలన గోగజాశ్వత్థవృ క్షాదిశరీరప్రాప్తియు కలుగుచున్నది. ఇకను మూడవది యగు పుణ్యపాప మిశ్రమకర్మములను గూర్చి యోచించె దము.వీనిలో మిశ్రోత్కర్షమువలన మనుష్యులలో నుత్తమమగు జీవన్ముక్తుల శరీరప్రాప్తియు, మిశ్రమధ్యమమువలన మను ష్యులలో మధ్యములగు స్వాశ్రమోచిత కామ్యకర్మరుల శరీరప్రాప్తియు, మిశ్రసామాన్యమునకు మనుష్యులలో నధ ములగు చండాలవ్యాధాదిశరీరప్రాప్తియు గలుగును. ఈపుణ్య పాప మిశ్రమరూపములైన కర్మములు మనోవాక్కాయము లను త్రివిధకరణంబులచేత చేయబడుచున్నవి. కాన సర్వ

దుఃఖములకు హేతుభూతంబులైన జీవుల శరీరము లన్నియు పైన తెల్పిన కర్మములచేతనే పుట్టుచున్నట్లు తేలినది.

అయితే కేవలకర్మములవలన శరీరము లెట్లు పుట్టు ననిన కేవలకర్మములవలననే శరీరములు పుట్టజాలవు. అయ్యవి కర్మములతో కూడిన పంచీకృత పంచమహాభూతములవలన కలుగుచున్నవి. అయితే కేవల భూతములచేతనే శరీరములు పుట్టవా యనిన, పుట్టనేరవు. ఎట్లన పంచభూతములు సర్వత్రి నిండి యున్నను, సర్వత్రి శరీరములు పుట్టుచుండుటలేదు. ఇకను పంచభూతములు శుక్లశోణితాకారములుగ నెక్కడ పరిణమించుచున్నవో, అక్కడ శరీరము ఉత్పత్తి యగుచున్నవని చెప్పవల ననిన, అట్లును చెప్పరాదు. ఏలయన, నిత్యము స్త్రీపురుషసంయోగములవలన శుక్లశోణితంబులు కూడుచున్నను అందందు శరీరములు పుట్టుచుండుట లేదు. మరి యేమనిన, పంచీకృతభూతములును, శుక్లశోణితాకారంబుగ పరిణమించి సాధారణకారణమైన దేశకాలాదుల నపేక్షించియున్నను, అసాధారణకారణమైన పూర్వకర్మము నపేక్షించి గాని విచిత్రిశరీరాద్యాకారంబులుగ పరిణమింపజాల వని చెప్పవలెను. కేవల కర్మమువలన శరీరము వచ్చినదనియు చెప్పరాదు. ఏలయన, కర్మము నిరాశ్రియంబై యుండలేదు. కాన కర్మముతో కూడిన పంచీకృతమహాభూతములవలననే శరీరములు పుట్టుచున్నవని చెప్పవలెను. ఈ రెండుకారణములలో పంచభూతములు ఉపాదానకారణమును, కర్మము, నిమిత్తకారణమును అయి యున్నవి. వీనిలో నిమిత్తకారణమైన

కర్మమువలన శరీరవైచిత్ర్యము వచ్చుచున్నది. ఉపాదాన కారణమైన పంచభూతములవలన మాంసాస్థి మజ్జము లేర్పడు చున్నవి. ఇవి అన్నిశరీరములలోను స్థిరమైయున్నను, జీవుల కర్మవిశేషముచేతనే వారివారి శరీరభేదములు కలుగుచున్నవి. కాన శరీరపరిగ్రహమునకు కారణము కర్మమే యని చెప్పవలెను.

కర్మమునకు కారణము రాగద్వేషాదులు.

అయితే పైనదెల్పిన కర్మమునకు కారణ మేది యనిన, రాగద్వేషాదు లని చెప్పవలసియున్నది. అచేతనము లగు రాగద్వేషాదులకు కారయితృత్వము చెప్పవచ్చునా? ఒక ఘటము మరియొక ఘటమునకు కారణ మగునా? యోగ్యత గలచోట ప్రేరకత్వము చెప్పవచ్చును. అగ్నియు, మందు గుండును అచేతనము లైనను, అచేతన మైనయగ్నికి అచేతనములైన మందుగుండ్లను గూర్చి ప్రేరకత్వము కలదు. కాన నీ రెండునుగూడి శత్రుసంహారము చేయుచున్నవి. అటులనే అచేతనములగు రాగద్వేషాదులు జీవుల త్రివిధకర్మములను గూర్చి కారయితృత్వము వహించుచున్నవి. అయితే ఆత్మ సర్వాంతర్యామి. అనగా సమస్తమును నడిపించువాడని చెప్పుశతృవులకు విరోధమురాదా యనిన, రాదు. ఎట్లన, సూర్యునిసన్నిధానమున సమస్తప్రాణులును తమ తమ కార్యములందు ఎటుల ప్రవర్తించు చున్నారో, మఱియు అయస్కాంతసాన్నిధ్యమున అయస్సు (ఇనుము) ఎటుల చలించుచున్నదో, అటుల ఆత్మసాన్నిధ్యమున సమస్తజగత్తును

వ్యవహరించుచున్న దని చెప్పవలెను. అట్లైనచో, ఆత్మకు వికారిత్వము రాదా యనిన, రాదు. ఎట్లన, ఆదిత్యప్రకాశ సాన్నిధ్యమున సమస్తప్రాణులును తమ వ్యాపారములను చేయుచున్నను, ఆ ప్రాణులయందలి వికారములు ఆ సూర్యుని ఎటుల స్పృశింపనేరవో అటులనే ఆత్మ సన్నిధానమున సమస్తేంద్రియములు చలించినప్పటికిని, ఆ యింద్రియనిష్ఠములైన వికారములు ఆత్మను స్పృశింపజాలవు. కాన జీవుల త్రివిధకర్మములు తమతమ రాగద్వేషాదులవలననే ప్రేరేపింపబడుచున్నవి అని తేలినది. ఈ రాగాదు లేవి, యివి ఎవ రెవరిని ఎట్లు ఎట్టికర్మకు పురికొల్పెను ? అను విషయమిచ్చట తెలియదగియున్నది. రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దంభము, దర్పము, అహంకారము - ఈ 13 ను చిత్తముయొక్క దుర్వృత్తులు. ఇచ్ఛ, భక్తి, శ్రద్ధ యను మూడు వృత్తులును చిత్తముయొక్క సద్వృత్తులు.

1. రాగము : ఇది స్త్రీ విషయమైవచ్చెడి చిత్తవృత్తి. ఇయ్యది దశకంఠ రావణాసురుని కర్మమునకు ప్రేరేపించెను.

2. ద్వేషము : ఒక డపకారము చేసిన అందుకు ప్రతిక్రియ చేయవలెననెడి చిత్తవృత్తి. ఇది హిరణ్యాకశిపుని ప్రేరేపించెను.

3. కామము : గృహారామ క్షేత్ర ధన ధాన్యాదులను సంపాదింపవలెననెడి చిత్తవృత్తి. ఇది నరకాసురుని ప్రేరేపించెను.

4. క్రోధము : తాను సంపాదించిన పదార్థముల కెవడు విఘ్న మొనర్చునో అట్టివాని యెడల కలుగు ఆగ్రహము. ఇది బకాసురుని ప్రేరేపించెను.

5. లోభము : సంపాదించిన పదార్థములను వ్యయము చేయకూడదను చిత్తవృత్తి. ఇది దుర్యోధనుని ప్రేరేపించెను.

6. మోహము. ఐశ్వర్యమదముచే కృత్యాకృత్యముల నెఱుంగకుండు చిత్తవృత్తి. ఇది దశరథుని ప్రేరేపించెను.

7. మదము : సకలసంపదలను కలిగియున్న నే నేమి చేసినచో చెల్లదు ? అనెడి చిత్తవృత్తి. ఇది కార్తవీర్యార్జునుని ప్రేరేపించెను.

8. మాత్సర్యము : ఒకడు తనకంటె నధికుడై యుండెనేని వాని యుత్కర్షమును సహింపలేక యుండు చిత్తవృత్తి. ఇది శిశుపాల దంతవక్త్రులను ప్రేరేపించెను.

9. ఈర్ష్య : దుఃఖము పరునికి రాక తనకు వచ్చెనే యనెడి చిత్తవృత్తి. ఇది అరుణాక్షుని ప్రేరేపించెను.

10. అసూయ : తనసుఖము ఇతరులకుకూడ కలుగ వచ్చునా యనెడి చిత్తవృత్తి. ఇది పౌండ్రక వాసుదేవుని ప్రేరేపించెను.

11. దంభము : తానొనర్చిన ధర్మముపలువు రెరుంగ వలె ననెడి చిత్తవృత్తి. ఇది ఆకాశ రాజాదులను ప్రేరేపించెను.

12. దర్పము : తాను దొడ్డవాడ ననియు, నితరు లెవరును తనకు సరికా రని తోఁచెడి చిత్త వృత్తి ఇది శతకంఠరావణుని ప్రేరే పించెను.

13. అహంకారము : ఓరీ! నిన్ను శిక్షించెడివాడ నని యెరు గవా? నేను పట్టు విడువనివాడ నని పరులను బెదరించెడి చిత్తవృత్తి. ఇది మధుకైటభులను ప్రేరేపించెను.

ఈ 13 ను దుర్వృత్తులు. ఇకను సద్వృత్తు లేవనగా-

14. ఇచ్ఛ : అనిర్వాచ్యంబు లగు శౌచాదిక్రియలను చేయవలె ననెడి చిత్తవృత్తి. అనగ, క్షుత్పిపాసలను తీర్చుకొనుటకు మల మూత్రములను విసర్జించుట; వీటిని జరు పవలె ననెడి చిత్తవృత్తి.

15. భక్తి : గురుదేవతాదులందుగల ప్రీతి.

16. శ్రద్ధ : గురువేదాంతవాక్యములయం దతి విశ్వాసము.

పైన దెల్పిన రాగాదులలో మొదటి 13 వృత్తులకును వశ్యుడై కర్మముల నొనర్చినవానికి నరకప్రాప్తి కలుగును. ఆ రాగాదులను స్వప్రయత్నముచే మరలించి శ్రద్ధాభక్తి రూపములుగ చేసినచో స్వర్గప్రాప్తి కలుగును. ఇకను ఇచ్ఛ యనెడి వృత్తితో చేయబడిన క్షుత్పిపాసాది నివృత్తియు, మూత్రపురీషాది విసర్జనంబును, చేసినచో స్వర్గనరకాదులు లేవు. చేయనిచో తాత్కాలికబాధ మాత్రము కలుగును. ఎక్కడ రాగద్వేషాదులు కలవో అక్కడ కర్మ పుట్టుచున్నది. ఎక్కడ నవి లేవో అక్కడ కర్మ లేదు. ఎట్లన, సుషుప్త్యవస్థ యందును, తూష్ణీంభావావస్థయందును, సమాధ్యవస్థయందును రాగాదులు లేవు. కాన అచ్చట కర్మంబులేదు. జాగ్రత్స్వప్న ములందు రాగద్వేషము లున్నవి గాన నచ్చట కర్మము గలదు. ఈ యన్వయవ్యతిరేక పద్ధతివలన రాగాదులు కర్మను పురికొల్పుచున్నవని తేలినది.

రాగాదులకు కారణము అభిమానము.

పైన దెల్పిన రాగద్వేషములు దేనివలన గలుగు చున్నవి? అభిమానమువలన కలుగుచున్న వని చెప్పవలెను. అయితే, సమస్తమానవులకును అభిమానము వలననే రాగాదిపూర్వక ప్రవృత్తులు కలుగుచున్న వని చెప్ప వచ్చునా? చెప్పవచ్చును. ఎట్లన, ఒకస్త్రీకి తాను స్త్రీ నని యభిమాన మెప్పుడు వచ్చుచున్నదో అప్పుడు స్త్రీకార్యము లగు భర్తృసేవ, గృహసంరక్షణము, పాకాదిక్రియలు, మున్నగువానియందు రాగాది పూర్వక ప్రవృత్తి కాన్పించు

చున్నది. అట్లనే యొకపురుషునకు తాను పురుషుడ నని యభిమాన మెప్పుడు వచ్చుచున్నదో అప్పుడు పురుషకార్యములైన దారపరిగ్రహము, కృషి, ధనార్జనము మున్నగు క్రియలయందు రాగాదిపూర్వకప్రవృత్తి కాన్పించుచున్నది. సుషుప్తి, తూష్ణీంభావ సమాధ్యవస్థలయందు అభిమానము లేకపోవుటచే అక్కడ రాగాదిపూర్వకప్రవృత్తి లేదు. జాగ్రత్స్వప్నములయందు అభిమానము కలదు. కాన అచ్చట ప్రవృత్తి కలదు. కాన అన్వయవ్యతిరేకముచే, రాగాది ప్రవృత్తికి అభిమానమే కారణ మని తేలినది.

## అభిమానమునకు కారణము అవివేకము.

పైన తెల్పిన అభిమాన మెట్లు వచ్చుచున్నది? అవివేకమువలన వచ్చుచున్నది. అవివేక మనగా నేమి? బ్రాహ్మణుడు, క్షత్రియుడు, శాస్త్రి, అవధాని మున్నగు సమస్తనామములును దేహేంద్రియాది సంఘాతములను గూర్చి వచ్చుచున్నవి. కనుక అయ్యవి దేహేంద్రియాది సంఘాతమునకే చెల్లునుగాని ఆత్మకు చెందవు అని యెఱుంగకుండుట అవివేకము. ఈ అవివేకముచేతనే అభిమానము వచ్చుచున్నది.

## అవివేకమునకు కారణము అజ్ఞానము.

పైన తెల్పిన అవివేకము దేనివలన వచ్చినది? అజ్ఞానముచేత వచ్చినది. అయితే అజ్ఞాన మనగా నేమి? తన్ను తా నెఱుంగకుండుట. అయితే తన్ను తా నెఱుంగనివాడు లోకములో

కలడా యనిన, కలడు. ఎట్లన, నేను మనుష్యుడను, పురుషుడను, స్త్రీని అని ఎరుగువారు కలరు. నేను బ్రాహ్మణుడను, క్షత్రియు డను, వైశ్యుడను, శూద్రుడను అని యెఱుగువారు కలరు. నేను బ్రహ్మచారిని, గృహస్థుడను, వానప్రస్థుడను, సన్యా సిని అని యెఱుగువారు కలరు, నేను తెలుగువాడను, అరవవా డను, కర్ణాటకుడను, మహారాష్ట్రుడను అని ఎరుగువారు కలరు. నేనుప్లీడరును,డాక్టరును, యింజనీరును అని ఎఱుగువారు కలరు. నేను వానితండ్రిని, వీనికుమారుడను అని ఎఱుగువారు కలరు. ఇట్లు ఎఱుంగుట వాస్తవముగ నెఱుంగుటకాదు. ఎట్లన,

నాహం మనుష్యో నచ దేవయక్షౌ,
న బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాః,
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో,
భిక్షు ర్నచాహం ..................

అనగ, నేను మనుష్యుడను, దేవుడన, అను ఏజాతి వాడనుకాను. బ్రాహ్మణుడు మున్నగు నేవర్ణమువాడను కాను. బ్రహ్మచారి మున్నగు నే యాశ్రమమువాడనుకాను. ప్లీడరు మున్నగు నేవృత్తివాడను కాను అని తాత్పర్యము.

అయితే, మనుష్యుడు తాను మనుష్యుడ నని చెప్పు చున్నాడుగాని పశువని చెప్పుటలేదుగదా! పురుషుడు తాను పురుషుడ ననియే భావించుచున్నాడుగాని స్త్రీయని భావించుట లేదుకదా? ఇయ్యది తన్ను తాను వాస్తవముగా నెఱుంగుట కాదా? అని మీ రడుగుదురేమో ఇందుకు సమాధానము వినుడు. పురుషుడైనవాడు తాను పురుషుడైనట్లు చెప్పుసంగతి

యథార్థముకాదు. తాను నిజముగా పురుషుడే, యైనచో తాను ఎప్పుడును పురుషుడుగానే యుండవలెను. అనగ, గత జన్మమునందును తాను పురుషుడై యుండవలెను. రాబోవు జన్మమందును పురుషుడై పుట్టవలెను. కాని అట్లు జరుగుటలేదు. ఒకజన్మములో పురుషుడై పుట్టినవాడు మరుజన్మమునందు దేవుడో, యక్షుడో, పిశాచమో, లేక పశు పక్షి క్రిమికీటకస్థావరజంగమమో అయియుండవచ్చును. కాన పైన తెల్పిన మనుష్యత్వము, పురుషత్వము, బ్రాహ్మణత్వము మున్నగు రూపములు యథార్థములు కావు. కల్పితములై యున్నవి. కాన నేను బ్రాహ్మణుడ నని ఎఱుగువాడు వాస్తవముగ తన్ను తా నెఱిగినవాడు కాడు. అయితే, పామరులవిషయములో అట్లనవచ్చునేమోగాని, శాస్త్రజ్ఞు లెందరో మేము బ్రాహ్మణులమనియు, పండితులమనియు, తార్కికులమనియు, వేదాంతులమనియు చెప్పుకొనుచున్నారే! వారుకూడ తమ్ము తాము నిజముగ తెలుసుకొనుటలేదని చెప్పనగునా యని యనిమెదవేమో, అనవచ్చును. ఎట్లన,

1. చార్వాకులు: అనాత్మయైన స్థూలదేహమును 'నేను' (ఆత్మ) యని యెఱింగినవారు గనుకవీరు శాస్త్రజ్ఞులైనప్పటికిని తమ్ము తాము యథార్థముగ తెలిసికొనినవారు కారు.
2. ప్రాణోపాసకులు: వీరు అనాత్మయగు ప్రాణమును ఆత్మయని యెఱింగినవారు కాన వీరును తమ్ము దా మెఱింగినవారు కారు.

3. ఇంద్రియోపాసకులు : వీరు ఇంద్రియములు ఆత్మయని వాదించువారు. కాన వీరును తమ్ము తాము ఎఱింగినవారుకారు.

4. మానసోపాసకులు : వీరు జడమగు మనస్సును ఆత్మయని తెలుసుకొనుచున్నారు. గనుక వీరును తమ్ము తాము ఎఱింగినవారుకారు.

5. విజ్ఞానవాదులు : వీరిలో కొందరు క్షణికవాదులు. అనగా క్షణికమైన విజ్ఞానమును, ఆత్మయని నమ్ముచున్నారు, కొందరు శూన్యవాదులు అనగా శశవిషాణతుల్యమైన శూన్యమును ఆత్మగా భావించుచున్నారు. కాన వీరును తమ్ము తా మెఱింగిన వారు కారు.

6. మీమాంసకులు : ఆత్మ అనురూపు డని వీరు గ్రహించుచున్నారు. కాన వీరును తమ్ముతా మెఱింగినవారు కారు.

7. తార్కికులు : వీరు ఆత్మకు విభుత్వము నంగీకరించియు నిచ్ఛాది గుణంబులును, దృశ్యత్వము నంగీకరించిరి, గాన వీరును తమ్ముతా మెఱింగినవారు కారు.

8. సాంఖ్యులు : వీరు ఆత్మకు సచ్చిదానందత్వము నంగీకరించినను, ఆత్మకు నానాత్వంబును జగత్తునకు సత్యత్వంబును, జీవేశ్వరులకు

భేదంబును అంగీకరించిరి. కాన వీరును తమ్ముతా మెఱింగినవారు కారు.

9. వేదాంతులు : వీరిలో కొందరు ముముక్షువులును, కొందరు అముముక్షువులును కలరు. అముముక్షువులు అనగా మోక్షము పొందుటకుగాక యితరకారణములచే వేదమును తెలిసికొన్నవారు; వీరిలో ప్రయోజనమును కోరి జ్ఞానమును బొందినవారు కొందరు, ప్రసిద్ధిని బడయుటకై చదివినవారు కొందరు, గౌరవమును బడయుటకై చదివినవారు కొందరు, ఇతర మతస్థులను దూషించుటకై చదివినవారు కొందరు కలరు. అముముక్షువులైన వీరు వేదాంతశాస్త్రమును చదివినవారైనప్పటికిని, మోక్షార్థమై వీరు జ్ఞానమును సంపాదించి యుండలేదు గనుక వీరును తమ్ముతా మెఱింగినవారు కారు. ఇకను మోక్షమునిమిత్తము చదివిన ముముక్షువులలో కొందరు ప్రతిబంధసహితులు, కొందరు ప్రతిబంధరహితులును గలరు. ప్రతిబంధసహితులైన ముముక్షువులు కాలాంతరమున ఆ ప్రతిబంధము నుండి

విడివడినగాని తమ్ము తా మెఱుంగ జాల
రు. కాని ప్రతిబంధరహితులైన ముము
క్షువులు మాత్రమే సద్యస్కాలమున
తమ్ము తా మెఱింగినవారై యున్నారు.

వీ రందరిలో ప్రతిబంధరహితులైన ముముక్షువులు మాత్రమే ఆత్మను యథార్థముగ తెలిసినవారై యున్నారు. తక్కినవారు జీవుని ఆత్మగా నెఱుంగుదురు. గాని అకర్తయు, అభోక్తయు అపరిచ్ఛిన్నుండును, అసంగుడునైన ప్రత్యగాత్మను ఆత్మ యని యెఱుంగరు. ఇట్టి ఆత్మ నెఱుంగకపోవుటయే అజ్ఞానము. ఈ అజ్ఞానమే పైన తెల్పిన అవివేకమునకు కారణము. అయితే యీ అజ్ఞానమునకు కారణమేమి? ఇది అనాదియై యున్నది గనుక దీనికి కారణములేదు. అనగా నొక దానివలన కలిగినదని చెప్పవీలు లేదు. అయితే దీని స్వరూపమేమి?

## అ జ్ఞా న ము.

ఇది సత్తుకాదు. అసత్తుకాదు. సదసత్తును గాదు. సావయవముగాదు. నిరవయవమును కాదు. ఎట్లన జ్ఞానము కలిగిన తోడనే యిది నశించుచున్నది గనుక దీనిని సత్తు అని చెప్పరాదు. నేను అజ్ఞుండను అనగా నా కేమియు తెలియ లేదు అని అనుభవింపబడుచున్నది గాన దీనిని అసత్తు అని చెప్పరాదు. సదసత్తు అని చెప్పెద మనిన పరస్పరవిరుద్ధము గనుక చెప్పరాదు. జగత్తునకు మూలకారణమై యున్నందున సావయవ మని చెప్పరాదు. జగదాకారముగ పరిమించుచు

న్నది గనుక నిరవయవమని చెప్పరాదు. కాన అనిర్వచనీయ మనియే చెప్పవలెను. దీనికి ప్రధానము, అవిద్య, ప్రళయము, మహాసుషుప్తి, తమస్సు అని కూడ పేర్లు కలవు. ఇట్లు అనిర్వచనీయమగు నీయజ్ఞానమువలన అవివేకమును, అవివేకమువలన అభిమానమును, అభిమానమువలన రాగాదులును, రాగాదులవలన కర్మమును, కర్మమువలన శరీరమును, శరీరమువలన దుఃఖమును కలుగుచున్నవి అని యింతవరకు రుజువైనది. ఈ విషయమును శ్రీ శంకరభగవత్పాదు లిట్లు సంగ్రహముగ తెల్పియున్నారు.

1 ప్రశ్న:—ఆత్మనః కిం నిమిత్తం దుఃఖం
ఉత్తరము: శరీరపరిగ్రహనిమిత్తం దుఃఖ మాత్మనః.

2 ప్ర : శరీరపరిగ్రహః కేన భవతి?
ఉ : కర్మణా.

3 ప్ర : కర్మ కేన భవతి?
ఉ : రాగాదిభ్యః.

4 ప్ర : రాగాదిః కేన భవతీతిచేత్ ?
ఉ : అభిమానాత్.

5 ప్ర : అభిమానః కేన భవతి?
ఉ : అవివేకాత్.

6 ప్ర : అవివేకః కేన భవతీతిచేత్ ?
ఉ : అజ్ఞానాత్.

7 ప్ర : అజ్ఞానం కేన భవతీతిచేత్ ?
ఉ : న కేనాపి భవతి. అజ్ఞాన మనా ద్యనిర్వచ

నీయం. అజ్ఞానా దవివేకో జాయతే, అవివే
కా దభిమానో జాయతే, అభిమానా ద్రా
గాదయో జాయంతే, రాగాదిభ్యః కర్మాణి
జాయంతే, కర్మణ శ్శరీరపరిగ్రహో జాయ
తే. శరీరపరిగ్రహా ద్దుఃఖం జాయతే.

కాన సమస్తసుఖదుఃఖములకు మూలకారణ మేది యనిన తన్ను తాను తెలిసికొనని అజ్ఞానమై యున్నది. తన్ను తాను తెలిసికొనుట యనగా, ఆత్మజ్ఞానమును సంపాదించుటయే యైయున్నది. కాన పుత్ర,మిత్ర, కళత్ర, దేహేంద్రియాదుల నెల్ల దుఃఖరూపముగ నెఱిగి వానియం దభిమానమును వదలి తనకు నిత్యసుఖమును, ప్రీతిని కలుగజేయు తన ఆత్మను తాను తెలిసికొనవలసియున్నాను. ఎట్లన,

ఏవం వివిచ్య పుత్రేఽసౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని,
నిశ్చిత్య పరమప్రీతిం వీక్ష్యతే త దహర్నిశం.

అనగా, ఈ ప్రకారము విమర్శించి పుత్రాదుల యందు అభిమానమును, రాగమును విడిచి తన యాత్మయే తనకు పరమప్రీతి నిచ్చునదియని తెలిసికొని ఆత్మను సాధించ వలసియున్నారు అనిదీని యర్థము.

అన్నిటికంటె తనయాత్మయే తనకు ప్రీతి.

భార్య, పుత్ర, విత్తాదులకంటె తన యాత్మయే తనకు ఎట్లు ప్రీతికరమైనది? యను ప్రశ్న వచ్చుచున్నది. ఇందుల కీ యితిహాసమును వినుడు.

పూర్వ మొక వర్తకుడు స్వగ్రామములోనున్న తన యాస్తి నంతయు విక్రయించి యేటికి అవతల గట్టున నున్న మఱియొక గ్రామములో వ్యాపారముచేయ సంకల్పించి తన భార్యను, పుత్రుని, ధనమును తీసికొని ప్రయాణ మాయెను. మార్గమధ్యమున ఏరు అడ్డమురాగా పుత్రుని తన చంకలో నిడుకొని, డబ్బుమూటను శిరస్సున ధరించి, భార్యను చేత బట్టుకొని, నీటి ప్రవాహములో దిగెను. కొంతదూర మేగు నప్పటికి ప్రవాహ మధికమైనందున వర్తకునకు భారము మెండాయెను. నీటిలో నడక సాగలేదు. కొంత భారమును తగ్గించుకొననియెడల తన ప్రాణమునకే ముప్పువాటిల్లు నని యాతడు తలపోసి వీరిలో నెవరిని వదలివేయ నగునని తనలో తానిట్లు సిద్ధాంతము చేసికొనెను. "నే నిప్పుడు మోయుచున్న భార్యా, పుత్ర, విత్తముల మూడింటిలో పుత్రుని మాత్రమే నే నిప్పుడు నీటిలో వదలివేసి నా భారమును తగ్గించుకొనియెదను. ఏల ననగా, నా కిప్పుడు భార్య యున్నది గనుక యీమె వలన మఱియొక పుత్రుని నేను బడయగలను" అని యాతడెంచి పుత్రుని ప్రవాహములో విడచి వేసెను. ఆతని కిప్పుడు భారము తగ్గి సంతసించినవా డాయెను. కాని కొంతదవ్వేగునరికి ఉన్న బరువే సహింపరాని దాయెను. అంతట నా వర్తకు డిట్లు చింతించెను. ఇప్పుడు నాకుగల భార్యాధనములలో నేదియో నొకదానిని వదలివేయని యెడల నా ప్రాణమునకే అపాయము రాగలదు. వీరిలో నెవరిని వదలి వేయనగును? భార్యను వదలివేసి ధనమును రక్షించుకొనియె

దను. ఏలనన భార్య పోయినను ధనము చేతియందున్నది గనుక దీనితో మరియొక వివాహంబును చేసికొనవచ్చునని యాత డూహించి భార్యను ప్రవాహములో విడచెను. మఱికొంత దూర మేగుసరికి ధనపుమూట కూడ భార మని యాతనికి తోచెను. దీనినికూడ వదలిపెట్టినగాని ఆతడు రక్షింపబడడు. అప్పు డాత డిట్లు చింతించెను. నేను చనిపోయిన పిమ్మట నీ ధనముతో నేమి ప్రయోజనము? నేను జీవించియున్నచో ధనమును తిరిగి సంపాదింప వీలగును. అని యెంచి తన తలపై నున్న మూటను నీటిలో పడవైచి తన్ను రక్షించుకొని ఆవల యొడ్డు జేరెను.

ఈ యితిహాస మేమి బోధించుచున్నది? భార్యా పుత్రి విత్తాది బాహ్యవిషయములపై గల ప్రేమకంటె తన మీద తనకు అధికప్రీతి కలదని తేలుచున్నది. తనమీది ప్రేమవలననే తాను భార్యా పుత్రాదులను ప్రేమించు చున్నాడు.

విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ స్వపిండంచ తథాప్రియం,
ఇంద్రియాశ్చ ప్రియాః ప్రాణాః ప్రాణా దాత్మా పరః ప్రియః.

అనగ, 'ధనముకన్న పుత్రులు ప్రియులు, పుత్రునికన్న తన శరీరము ప్రియము. తన శరీరము కన్న తన యింద్రియ ములు ప్రియములు, ఇంద్రియములకన్న ప్రాణములు ప్రియము. ప్రాణములకన్న ఆత్మ ప్రియము.' అని అర్థము. లోకమునందు తండ్రియైనవాడు తన పుత్రునిపై వచ్చిన హత్యానేరమును తొలగించి వానిని రాజదండననుండి రక్షించుటకు ప్రియ

త్నించును. రాజు లంచము పుచ్చుకొనువాడైన యెడల, అత
నికి ధనము నంతను కర్చుపెట్టి పుత్రుని విడిపించుచున్నాడు.
కాన ధనముకన్న పుత్రుడు ప్రియుడు అని తేలినది.
ఒకవేళ రాజు లంచము పుచ్చుకొనక పుత్రునియొక్క మరణ
శిక్షను తండ్రియే భరించుటకు సమ్మతించుచో, పుత్రుని
విడిచిపెట్టెద నని రాజు తీర్పుచేసినయెడల అప్పుడు తండ్రి
యేమి చేయును? నాపుత్రునకును, నాకును సంబంధము లేదని
చెప్పి తండ్రి అప్పుడు తన శరీరమును రక్షించుకొనును. కాన
తన పుత్రునికంటె తనదేహము ప్రియము. పుత్రుడు తనశరీ
రమును రక్షించవలసినదని రాజును ప్రార్థించగ, నీ నేత్రములను
పొడిపించుకొనుటకు నీవు ఇష్టపడునెడల శరీరదండనము తొల
గించెదనని, రాజు ఉత్తరువును చేయుననుకొనుడు. అప్పుడు
పుత్రు డేమిచేయును? శరీరదండనమున కంగీకరించి, తన
నేత్రేంద్రియములను కాపాడుకొనును. కాన శరీరమునకంటె
నింద్రియములు ప్రియము. పక్షాంతరమున రాజు ఆనేరస్థుని
ప్రాణములను తీసివేయు డని యాజ్ఞాపించినచో 'ఆతడు స్వామీ!
నా నేత్రములను పొడిచి, నా ప్రాణములను రక్షించుడు.' అని
ప్రార్థించును. కాన నింద్రియముల కన్న ప్రాణములు
ప్రియము. యుద్ధమునందు శత్రువుతో పోరాడి ప్రాణము
లను త్యజించినవానియాత్మకు స్వర్గమందు సుఖము కలుగు
నని వచించిన ధర్మశాస్త్రప్రమాణములను బట్టి ఎందరో
యుద్ధములో తమ ప్రాణములను విడుచుటకు సంతోషముతో
బయలుదేరుచున్నారు. ఈ విషయము సర్వజనవిదితమే.

కాన ప్రాణములకంటె ఆత్మ ప్రియము అని తేలినది. భార్య తన భర్తను ప్రేమించుట భర్తమీాది ప్రేమచేతగాదు. తన మీాది ప్రేమచేతనే భర్తను ప్రేమించుచున్నది. అటులనే తన ప్రయోజనముకొఱకే సర్వవస్తువులును ఆమె వాంఛించు చున్నది. ఎట్లన-

"న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి"

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి."

అనగ, 'తనకుభర్త ప్రియుడగుట భర్తమీాది ప్రేమ చేతగాదు. తనమీాది ప్రేమచేతనే భర్త తనకు ప్రియుడగు చున్నాడు. తనయొక్క భోగముకొఱకే సర్వజగంబును తనకు ప్రీతి యగుచున్నది.' అని తాత్పర్యము. ఇట్లు సర్వప్రీతిపాత్రం బైన ఆత్మనుగూర్చి జ్ఞానమును బొందినగాని దుఃఖనివారణము కానేరదు. ఈ జ్ఞానము ఆత్మానాత్మవిచారముచేతనే కలుగును.

ప్ర: "తజ్జ్ఞానమ్ కుత ఇతిచేత్ ?" అనగా 'ఆజ్ఞానము దేనివలన కలుగుచున్నది?'

ఉ: "విచారా దేవ భవతి" అనగ 'ఆత్మానాత్మ విచారమువలన కలుగును' అని యర్థము.

కాన ఆత్మానాత్మవిచారమునకు గడంగెదము.

ఆ త్మా నా త్మ వి చా ర ము.

A అనాత్మ యనగా నెట్టిది?

"అనృత జడదుఃఖాత్మకం సమష్టి వ్యష్ట్యాత్మకం శరీర త్రియం" అనగ, అనృత జడదుఃఖాత్మకమైనదియు, సమష్టి,

వ్యష్టిరూపకమైనదియు నగు స్థూలసూక్ష్మకారణశరీరములు అని యర్థము.

అన్నృత మనగా నేమి?

"కాలత్రయే విద్యమానం వస్తు అన్నృత మిత్యుచ్యతే" అనగ, భూతభవిష్యద్వర్తమానకాలములయందు అనుభవింపబడు వస్తువు అన్నృత మనబడును.

జడ మనగా,

"స్వవిషయపరవిషయజ్ఞానరహితం వస్తు జడ మిత్యుచ్యతే"-అనగ, తనవిషయమైనట్టియు, అన్యవిషయమైనట్టియు జ్ఞానములేని వస్తువు జడ మనబడును.

ఇకను దుఃఖ మనగా నేమి?

"అప్రీతిరూపం వస్తు దుఃఖ మిత్యుచ్యతే" అనగా, ఇష్టములేనివస్తువు దుఃఖ మనబడును.

స్థూలశరీర మనగా నేమి?

"పంచీకృత మహాభూత కార్యం కర్మజన్యం జన్మాది షడ్భావవికారాత్మకం" అనగ, పంచీకృతములైన భూతములవలన చేయబడినదియు కర్మమువలన పుట్టినదియు, జన్మము మొదలుగాగల యాఱుభావములతో గూడుకొని యున్నదియు నైయున్నది. మఱియు,

పంచీకృతమహాభూతసంభవం కర్మసంచితం,
శరీరం సుఖదుఃఖానాం భోగాయతన ముచ్యతే.

అనగ, సుఖదుఃఖకర్మానుభవనిమిత్తము పంచీకృతములైన స్థూలభూతములకూడికచే ఈ స్థూలశరీరము నిర్మింపబడినది. ఇకను సూక్ష్మశరీర మనగా నేమి?

"అపంచీకృతభూత కార్యం సప్తదశకలింగం...

సప్తదశకం నామ జ్ఞానేంద్రియాణి పంచ, కర్మేంద్రియాణి పంచ, ప్రాణాదివాయవో మనో బుద్ధిశ్చేతి"

అనగ, పంచీకృతముకాని సూక్ష్మభూతములవలన పుట్టినదియు, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, ప్రాణములైదు, మనస్సు బుద్ధి యనునవి రెండు - ఈ పదునేడును కూడి సూక్ష్మశరీర మగుచున్నది. ఈ శరీరము భోగసాధనమై యున్నది.

ఎట్లన,

పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియసమన్వితమ్,
అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్.

ఈ ప్రమాణము పైన తెల్పిన ప్రకారము సూక్ష్మశరీరనిర్మాణమును తెలుపుచున్నది. ఇకను కారణశరీర మనగా నేమి?

"శరీరద్వయహేతుః అనాద్యనిర్వచనీయం సాభాసం బ్రహ్మాత్మైకత్వజ్ఞానేన నివర్త్యం అజ్ఞానం కారణశరీర మిత్యుచ్యతే" అనగా, స్థూల సూక్ష్మశరీరములకు హేతువైనదియు, అదిలేనిదియు, నిట్టిదని చెప్పనలవికానిదియు, చిదాభాసునితో కూడుకొనియుండునదియు, బ్రహ్మాయు నాత్మ

యు, నొకటే యను జ్ఞానముచే నశించునదియు, కారణశరీర మనబడును. దీనికి అజ్ఞానమని కూడ పేరు కలదు. ఇంతవరకు అనాత్మ సంబంధమైన స్థూల సూక్ష్మ, కారణశరీరములను గూర్చి విచారింపబడినది, ఇప్పు డీ శరీరములయొక్క సమష్టి, వ్యష్టిభేదమును తెలుపవలసియున్నది.

## సమష్టి, వ్యష్టిభేదము.

యథా. వనం సమష్టిః వృక్షో వ్యష్టిః, జనసమూహ స్సమష్టిః, జనశ్చవ్యష్టిరితి; తద్వత్ అనేకశరీరం సమష్టిః ఏకశరీరం వ్యష్టిః

అనగ, ఏ ప్రకారము వనము సమష్టియై వృక్షము వ్యష్టియో, జనసమూహము సమష్టియై జనుడు వ్యష్టియో, ఆ ప్రకారము అనేకశరీరములు గలది యైనప్పుడు సమష్టి యనియు, ఒక శరీరముగ నుండునప్పుడు వ్యష్టియనియు చెప్ప బడును. కాన బ్రహ్మాండము సమష్టియు, పిండాండము వ్యష్టియునై యున్నది. పైన తెల్పిన శరీరత్రయములో స్థూల శరీరము కరచరణాద్యవయవాకారమై, స్తంభమువలె ప్రత్యక్ష ముగ కనబడుచున్నది. అన్నమయకోశము దీనియందు కలదు. ఇకను సూక్ష్మశరీరము పదునే డవయవములతో గూడుకొని ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడిం టిని కలిగియున్నది. స్థూలశరీరమువలె నిది ప్రత్యక్షముగ కాన్పించుట లేదుకదా! స్థూలశరీర వ్యతిరిక్తముగ నిది కల దని యెటుల చెప్పనగును? స్థూలశరీరముచే చేయబడుచున్న

పదునేడు విధములగు కార్యములను బట్టి సూక్ష్మశరీరము కల దని చెప్పవచ్చును. అయితే యీ కార్యములు సూక్ష్మశరీరముయొక్క కార్యము లని యెట్లు చెప్పవచ్చును? అగ్ని, కాష్ఠాదుల నాశ్రయించి దహనపాకాదిక్రియలను జేసినప్పటికిని, ఆ క్రియలు కాష్ఠాదులక్రియ లని చెప్పబడక అగ్నియొక్క క్రియ లనియే చెప్పబడు చున్నట్లు, సూక్ష్మశరీరము స్థూలశరీరము నాశ్రయించి పదునేడు విధములగు కార్యములను చేసినను, అయ్యవి కేవల స్థూలశరీరముయొక్క క్రియలు కాక, సూక్ష్మశరీరముయొక్క కార్యము లనియే చెప్పవలెను. ఇఁక ను కారణశరీరము అనగ అజ్ఞానము. ఇది స్థూలసూక్ష్మములకు కారణమై యుండుటచే దీనికి కారణశరీర మని పేరు వచ్చినది. కార్యములచేత కారణ మూహింపబడును. కార్యమైన ధూమముచేత కారణమైన అగ్ని కల దని యూహింపబడుచున్నది. మఱియు,

"అహ మజ్ఞః"

అనగ, 'నా కేమియు తెలియుటలేదు.' అను అజ్ఞానము మనచే ప్రత్యక్షముగ అనుభవింపబడుచున్నది. కాన కారణశరీరముకూడ కలదనియే చెప్పబడుచున్నది. దీనియందు ఆనందమయకోశము కలదు.

అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే.

అనగ అనాదియైనట్టియు, అనిర్వచనీయ మైనట్టిదియు, అవిద్యయే కారణశరీర మనబడును. ఈ శరీరములకు

సమష్టివ్యష్టిభేదము నెందుకు చెప్పవలెననగా, ఆత్మకు జీవత్వ మును, నీశ్వరత్వమును వచ్చుటకొఱకు చెప్పబడెను. ఆత్మ కీ రెండును ఉపాధులచేత అనాదిగ వచ్చియున్నవి. కాని అజ్ఞానులిట్లెఱుంగక ఆత్మకు జీవత్వ ఈశ్వరత్వములు వాస్త వము లని యెఱుగుచున్నారు. సమష్టిశరీరత్రయోపాధిచేత నీశ్వరత్వమును, వ్యష్టిశరీరత్రయోపాధిచేత జీవత్వమును వచ్చుచున్నవి. అయితే యీశ్వరత్వమునందు సమష్టికా రణశరీరముమాత్రము చాలియుండగ, సమష్టిస్థూలసూక్ష్మ శరీరములు యేల చెప్పబడవలెను? ఇయ్యవి ఉపాసననిమిత్తము చెప్పబడియున్నవి. సమష్టికారణశరీరోపాధికుడైన ఆత్మ, ముఖ్యాధికారికి ఉపాస్యుడుగ చెప్పబడుచున్నాడు. ఇట్టి కారణోపాధికుడైన యీశ్వరునకు అంతర్యామి యనియు, అవ్యాకృతుడనియు పేర్లు గలవు. ఇతనికి సమష్టికారణమునందు అభిమానములేదు. ఏలయన, అభిమానము అహంకారముయొ క్క ధర్మము. కాన ఆత్మకు సమష్టికారణశరీరవిశిష్టమాత్రి త్వమే యీశ్వరత్వ మని చెప్పవలెను. ఇట్టిమూర్తిని ఉపా సింపజాలనివారికి సమష్టిసూక్ష్మశరీరోపాధికుడైన యీశ్వ రుడు అనగ హిరణ్యగర్భసూత్రాత్మలను ఉపాస్యులుగ బోధించెదరు. ఆత్మకీ శరీరమునం దభిమానముగలదా? యనిన అభిమానమున కాశ్రయంబైన స్థూలశరీరము లేదు గనుక లేదని చెప్పవలెను. ఇట్టి హిరణ్యగర్భునిగూడ నుపాసింపలేనివారు సమష్టిస్థూలశరీరోపాధికుని యుపాసింపవచ్చును. ఈతనికి విరాట్, వైశ్వానరు డనియు పేర్లు గలవు. వీనికి అభిమానము

కలదా యనిన, నియతమైన శరీర మొకటిలేదు. కాన అభిమానము లేదనియే చెప్పవలెను. ఈశ్వరుడు రాజస, సాత్త్విక, తామసగుణముల ననుసరించి సృష్టి, స్థితి, సంహారకార్యముల నిమిత్తము బ్రహ్మ, విష్ణు, రుద్రు డని చెప్పబడుచున్నాడు. వీరిలో విష్ణువు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనముకొఱకు మత్స్య కూర్మాది అవతారముల నెత్తియున్నాడు. ఇట్టి యవతార మూర్తులకుమాత్రము ఆయా శరీరములయందు సృష్టి స్థిత్యా ద్యభిమానము కలదు. అయితే, అభిమానమువిషయమై జీవునకును, ఇట్టి యవతారమూర్తులకును భేదము లేదా యనిన జీవునకు అహంకార మమకారపూర్వకమైన అభిమానము కలదుకాని అవతారమూర్తులకు లోకసంరక్షణార్థ మభిమాన మేగాని స్వాభావికంబుగ లేదు. ఆత్మకు జీవత్వ మెట్లువచ్చినది? వ్యష్టిశరీరత్రయోపాధివలన వచ్చినది. జీవత్వమునకు శరీరత్రయము కావలెనాయనిన, కావలసియేయున్నది. జీవుడు అంతఃకరణప్రతిబింబుడు గాన సూక్ష్మశరీర మతనికి కావలసియున్నది. స్థూలశరీరము లేక కర్తృత్వము కూడదుగాన, స్థూలశరీరము కూడ నుండవలెను. ఈ రెంటికిని కారణ ముండవలెను గనుక కారణశరీరముగూడ యవసరము.

ఇకను జీవున కీ శరీరత్రయమునందు అభిమానము కలదాయనిన, అభిమానము లేనిదే కర్తృత్వ ముండదుగాన, అభిమానము కలదనియే చెప్పవలెను. వ్యష్టిస్థూలశరీరమందును, దీని తేజస్సగు జాగ్రదవస్థయందును అభిమానము గలజీవునకు విశ్వుడు, చిదాభాసుడు వ్యావహారికు డని పేర్లుగలవు. వ్యష్టి

సూక్ష్మశరీరమందును, దీని తేజస్సగు స్వప్నావస్థయందును అభిమానముగల జీవునకు తైజసుడు, ప్రాతిభాసికుడు, స్వప్నకల్పితుడు అని పేర్లు గలవు. అటులనే వ్యష్టికారణశరీరమందును, దీని తేజస్సగు సుషుప్త్యవస్థయందును అభిమానముగల జీవునకు ప్రాజ్ఞుడు, పారమార్థికుడు, అవచ్ఛిన్నుడనియు పేర్లు కలవు. ఈ విధముగ నొకే ఆత్మకు సమష్టిశరీరత్రయముచేత నీశ్వరత్వమును, వ్యష్టిశరీరత్రయముచేత జీవత్వమును వచ్చెను. మఱియు, మహదుపాధిచేత సర్వజ్ఞత్వమును, కించిదుపాధిచే కించిద్జ్ఞత్వమును వచ్చినవి.

ఇట్లు ఈశ్వరత్వ జీవత్వములు ఆత్మకు ఉపాధివలన వచ్చినవేకాని పరమార్థమునందు జీవేశ్వరులకు భేదము లేదు. చెరువులోనుండు జలమునకును, కుండలోనుండు జలమునకును భేద మెట్లులేదో అట్లే జీవేశ్వరులకును భేదము లేదు. ఈ దృష్టాంతమందు విరుద్ధాంశములైన చెరువు, ఘటములనెడి యుపాధుల విడిచి అవిరుద్ధాంశము అగు జలత్వముచేత ఏకత్వజ్ఞానము కలిగినచందంబున విరుద్ధాంశములైన సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాదుల విడిచినచో అవిరుద్ధమైన చైతన్యమునకు ఏకత్వజ్ఞానము కూడును. ఇంతవరకు ఆత్మానాత్మవిచారమునందు అనాత్మనుగూర్చి చర్చింపబడినది. మరియు "అనృతజడదుఃఖాత్మకం సమష్టివ్యష్ట్యాత్మకం శరీరత్రయం అనాత్మ" అని ఋజువు చేయబడినది. ఇకను ఆత్మయనగ నేమో తెలియవలసియున్నది.

## B. ఆత్మ.

ఆత్మయనగ,

(1) శరీరత్రయ విలక్షణః
(2) అవస్థాత్రయసాక్షీ
(3) పంచకోశ వ్యతిరిక్తః
(4) సచ్చిదానందరూపః

అని ఆత్మకు నిర్వాచనము కలదు. వీనిలో మొదటి యంశమైన శరీరత్రయ విలక్షణత్వమును గూర్చి యిప్పుడు తెలుపవలసి యున్నాము.

ఆత్మలక్షణములు శరీరమునకు లేవు. శరీరలక్షణము లాత్మకును లేవు. సత్, చిత్, ఆనందములు ఆత్మలక్షణములును అనృత, జడ దుఃఖములు శరీరలక్షణములును నై యున్నవి. కాన నీ రెండుతెరగతుల లక్షణములకును పరస్పర వైరుధ్యము ఋజువుకావలసియున్నది. సత్ అనగ ఉండు నట్టిది యని యర్థము. కాన ఉండువస్తువు లేనివస్తువు కాదు. ఇకను చిత్తనగ మఱియొకసాధనము లేక తనంతట తానే ప్రకాశించువస్తువు. అట్లు ప్రకాశించు వస్తువు - ప్రకాశింపని వస్తువు కానేరదు ఆనంద అనగ సుఖరూపమైన వస్తువు. ఇట్టి సుఖరూపమైన వస్తువు దుఃఖరూపమైన దెన్నటికిని కాజాలదు.

1. సత్ : పురుషుని లక్షణము స్త్రీయందును, స్త్రీలక్షణము పురుషునియందును లేవు. అట్లనే సల్లక్షణము అసత్తునందును, అసల్లక్షణము సత్తునందును లేవు.

2. చిత్ : ప్రకాశలక్షణము అంధకారమందున, అంధకార లక్షణము ప్రకాశమందును లేవు. అట్లనే చిల్లక్షణము జడమందును, జడలక్షణము చిత్తునందును లేదు.

3. ఆనంద : చంద్రికాలక్షణము ఆతపమునందును, ఆతప లక్షణము చంద్రికయందును లేవు. అట్లనే, ఆనందలక్షణము దుఃఖమునందును, దుఃఖ లక్షణము ఆనందమునందును లేవు.

ఈ ప్రకారము సచ్చిదానందములగు ఆత్మకును, అనృత జడదుఃఖములగు అనాత్మకును పరస్పరవైరుధ్యము గలదు.

## 1. సదసత్తులు.

ఒకదానిచేతను బాధింపబడక త్రికాలములందును ఏకరూపముగ నుండునది సత్తు. కాలత్రయముల యందును లేనిదై యున్నట్లుతోచుచు, ఒకదానిచే బాధింపబడి నశించెడి వస్తువు అసత్తు. ఇందులకు దృష్టాంతము: రజ్జుసర్పభ్రాంతి. ఇచ్చట సత్యమైన రజ్జువునందు అసత్యమైన సర్ప మారోపింపబడినది. కాన రజ్జువునందు సల్లక్షణము కలదు. ఎట్లన, రజ్జువునం దారోపింపబడిన సర్పముచే ఆ రజ్జువు త్రికాలములందు బాధింపబడలేదు. భ్రాంతికాలమందును, తత్పూర్వమును, తదనంతరమును రజ్జువు ఏకరూపముగనే యున్నది. కాని ఆ సర్పము భ్రాంతికాలముననను, తత్పూర్వమునను, తదనంతరముననను, తాను లేకున్నను, ఉన్నట్లు తోచి

బాధింపబడుచున్నదిగాన సర్పమునందు అసల్లక్షణము గలదు. కాన రజ్జులక్షణము సర్పమునందును, సర్పలక్షణము రజ్జువు నందును లేదు. ఈ రెంటికిని శబ్దముచేతను, అర్థము చేతను, ప్రతీతిచేతను, విలక్షణత్వము గలదు. ఎట్లన సచ్ఛబ్దము అసచ్ఛబ్దముగాదు. చిచ్ఛబ్దము జడశబ్దముగాదు. ఆనందశబ్దము దుఃఖశబ్దముగాదు. సదర్థము అసదర్థముగాదు. చిదర్థము జడార్థముగాదు. ఆనందార్థము దుఃఖార్థముగాదు. ఇకను సత్ప్రతీతి అసత్ప్రతీతిగాదు. చిత్ప్రతీతి జడప్రతీతిగాదు. ఆనంద ప్రతీతి దుఃఖప్రతీతి గాదు. ఇట్లు శబ్దతః, అర్థతః, ప్రతీతితః సచ్చిదానందములు అనృతజడదుఃఖములు కానేరవు. కాన సద్రూపమైన ఆత్మకును, అసద్రూపమైన దేహేంద్రియాది ప్రపంచమునకును, రజ్జుసర్పంబులకువలె కాలత్రయమునందును అన్యోన్యవైలక్షణ్యము కలదు.

## 2. చిజ్జడములు.

ఏ సాధనము నపేక్షింపక తానే తోచుచు తనయందారోపింపబడిన సకలపదార్థములను తోపింపజేయునది చిత్తు; తాను తోచక, అన్యవస్తువును తోపింపజేయక యుండునది జడము. సూర్యుడును, సూర్యప్రకాశముచే కాన్పించు ఘటమును నిందులకు దృష్టాంతములు. ఎట్లన, సూర్యుడితరవస్తువుల నపేక్షింపకయే, స్వయముగ ప్రకాశించుచు తనను సంబంధించుకొనియెడిఘటమును ప్రకాశింపచేయుచున్నాడు. కాన సూర్యునియందు చిల్లక్షణము కలదు. ఘటము తాను తోచక, అన్యవస్తువును తోపింపక యున్నది గాన దీనియందు జడలక్ష

ణము గలదు. ఆదిత్యలక్షణము ఘటమునందును, ఘటలక్షణము ఆదిత్యుని యందును లేదు. కాన ఆదిత్యునకును, ఘటమునకును శబ్దార్థ ప్రతీతులచేత ఎట్లు వైలక్షణ్యము గలదో అట్లనే చిల్లక్షణము దేహమునందును, జడలక్షణము ఆత్మ యందును లేదు. గనుక చిజ్జడంబులకు శబ్దార్థ ప్రతీతులచే వైలక్షణ్యము గలదు.

### 3. ఆనందదుఃఖములు.

నిరుపాధికమై, నిత్యమైన సుఖస్వరూపత్వము ఆనంద లక్షణము. తాపత్రయాత్మకమైన క్లేశత్వము దుఃఖలక్షణము. ఇందుకు క్రొత్తకుండలోని శీతలోదకమును, కంచుకుండలోని చింతనిప్పులును దృష్టాంతములు. ఎండలో తిరిగి వేసారివచ్చిన వాడు ఆశీతలభాండమును నేత్రములకు అద్దుకొనినమాత్రమున, వాని తాపము అణగిపోవుచున్నది. శీతలము, జలము యొక్క ఆవేశమేగాని సాక్షాజ్జలముగాదు. జలావేశమునకే తాపనివర్తకత్వము కనబడుచుండగ, సాక్షాజ్జలము సకల తాపములను పోగొట్టుననుట నిర్వివాదము. కాన జలమునందానందలక్షణము గలదు. మఱియు, తాపము లేనివాడు, చింతనిప్పులుగల యాకంచుకుండను తాకినట్లైన కంచు కుండ యందలి నిప్పుయొక్క ఆవేశము వానికి తాపమును గలుగజేసి చేతులకు బొబ్బలు పుట్టించును. అది చింతనిప్పుయొక్క ఆవేశమేగాని సాక్షాదగ్నికాదు. ఆవేశమువలననే యింత తాపముగలుగుచుండ అసలు నిప్పు ప్రాణమునుగూడ హరించు ననుట అనుభవసిద్ధము. కాన చింతనిప్పునందు దుఃఖలక్షు

ణము గలదు. ఈ దృష్టాంతములోని జలలక్షణము అగ్నియందును, అగ్నిలక్షణము జలమందును లేదు. కాన జలాగ్నులగు శబ్దార్థప్రతీతులచే అన్యోన్యవైలక్షణ్యము గలదు. అట్లనే, ఆనందలక్షణము దుఃఖాత్మకమైన దేహాది ప్రపంచమునందు లేదు. దుఃఖలక్షణము సుఖస్వరూపుడగు ఆత్మయందులేదు. కాన ఆనందదుఃఖములకు శబ్దార్థప్రతీతులచేత అన్యోన్యవైలక్షణ్యము గలదు. పైనదెల్పిన మూడు దృష్టాంతములలో రజ్జువువలె సద్రూపుడైన ఆదిత్యునివలె చిద్రూపుడై, జలమునవలె నానందరూపుడైన ఆత్మ (తాను) సర్పమువలె అనృతమై, ఘటమువలె జడమై, అగ్నివలె దుఃఖస్వరూపమైన అనాత్మ (దేహేంద్రియాదిప్రపంచము) కంటె విలక్షణుం డని యెఱుంగవలయు. ఇంతవరకు ఆత్మ శరీరత్రయ విలక్షణు డని నిరూపింపబడెను. ఇకను అవస్థాత్రయ సాక్షిత్వమునుగూర్చి తెలుపవలసియున్నాము.

## 2. అవస్థాత్రయ సాక్షిత్వము.

జాగ్రత్తు, స్వప్న, సుషుప్తి అని అవస్థలు మూడుకలవు.

"ఇంద్రియై రర్థోపలబ్ధి ర్జాగరః

అనగ, యింద్రియములచేత విషయములను గ్రహించుట అనగ, మేలుకొనియుండుసమయమునకు జాగ్రత్తుయని పేరు.

"జాగ్రత్స్వప్నసంస్కారజన్యవిషయ స్స్వప్నః"

అనగ మేలుకొనుటవలన కలిగిన సంస్కారమునుండి పుట్టిన విషయము స్వప్నము.

"సర్వవిషయజ్ఞానాభావః సుషుప్తిః"

అనగ, ఏ విషయముయొక్క జ్ఞానమును లేకపోవుట సుషుప్తి యనబడును. జాగ్రదవస్థ రాగలదు. జాగ్రదవస్థ వచ్చుచున్నది. అట్లనే స్వప్నసుషుప్త్యవస్థలు రెండును పుట్టి నవి, పుట్టుచున్నవి, పుట్టగలవు. ఈ ప్రకారముగ తాను వికారము చెందకుండ ఆత్మ యీ మూడవస్థలను చూచు చున్నాడు. మఱియు యీ గోవు నాగి, యీ దూడ నాది. యీతడు నా కుమారుడు, యిది నాచొక్కా, అను నప్పుడు యీ పదార్థములను కలిగియున్న పురుషుడు యీ పదార్థ ములు నేను కాను; వీనికి నేను విలక్షణుడను, సాక్షిని యని యెట్లు నిశ్చయజ్ఞానముతో కూడియున్నాడో, అట్లనే యిది నా జాగ్రదవస్థ, యిది నా స్వప్నావస్థ, యిది నా సుషుప్త్య వస్థయును అవస్థాత్రయములుగల యాత్మ, యీ యవస్థలు నేను కాను, విలక్షణుడను, సాక్షిని యని తలంచుచున్నాడు. జాగ్ర దాద్యవస్థలు మనకు ప్రతిదినము వచ్చుచు పోవుచున్నవి. నిన్నటి జాగ్రదవస్థయు, అందుచేయబడిన వ్యాపారములును, ఆయవస్థావాసుడును, అట్లనే నిన్నటిదినమున కలిగిన స్వప్న సుషుప్తులును అందలి వ్యాపారములును, అవస్థావాసులును, యవియన్నియు నేడు తిరిగి తోచుచున్నవి. ఇవి యీనాడు స్మరణమాత్రముగ నున్నవి. నిన్నను అనుభవింపబడినవి గనుకనే నేడు స్మరణకు వచ్చినవి. అనుభూతముగాకుండ స్మరింపబడుచున్నవనినచో ప్రపంచవ్యాపార మంతయు మన స్సుచే స్మరింపబడవలెనుగదా! అట్లు స్మరింపబడుటలేదు గాన,

స్మరణము అనుభూతవిషయ మనియే చెప్పవలెను. అయితే యీ అవస్థలతో కూడియుండి అనుభవించితిమా? లేక కూడియుండక అనుభవించితిమా? అను ప్రశ్న యుదయించుచున్నది. కూడియుండక అనుభవించితిమని చెప్పితిమా, స్వర్గాదిలోకములోని విషయముల నిప్పుడే మన మనుభవింపవలయును. అట్లు జరుగుటలేదు గాన అట్లు చెప్పరాదు. మఱియు కూడుకొని అనుభవించితిమని చెప్పినచో మరియొక యిబ్బంది కలుగును. ఎట్లన, నిన్నటిజాగ్రత్స్వప్నసుషుప్తులును, అందలి వ్యాపారములును, అవస్థావాసులును, నశించిపోయి మనము మాత్రము నిలచియున్నాము గనుక అట్లు చెప్పరాదు. కూడినట్లైన ఆయవస్థాదులు నశించిపోయినట్లు మనముకూడ నశించిపోవలెనుగదా. ఏలనన, వస్త్రముతో కూడుకొనియుండెడి రంగులు ఆ వస్త్రములు నశించినప్పుడు అవి వానితో గూడ ఎటుల నశించిపోవుచున్నవో, అటులనే, అవస్థాత్రయములతో మనము కూడియున్నట్లు చెప్పితిమా, అవి నశించగనే, మనము గూడ నశించిపోవలెను. అటుల మనము నశించుట లేదు గాన అవస్థాత్రయములతో కూడక ఆ యవస్థలను, వాని వ్యాపారములను, అవస్థావాసులను, మనము అంటకుండ చూచుచున్నాము. అంటకుండ చూచువానికి సాక్షియని పేరు. కాన సాక్షిలక్షణత్వము మనయందున్నది. ఇందువలన ఆత్మకు అవస్థాత్రయసాక్షియని పేరు వచ్చినది. అయితే, అవస్థావాసునికంటె వ్యతిరిక్తుడైనవానికిగదా సాక్షిత్వము చెప్పవలెను. అవస్థావాసుడు సుఖదుఃఖములచే, తపింపబడి వికారి

యగుచున్నాడు. ఆత్మ నిర్వికారి. అయితే ఆ సాక్షిత్వ మెందు చేత తోచుటలేదు అనిన, విచారించలేదు గనుక తోచుటలేదు. విచారించిన పక్షమున మనకే ఆ సాక్షిత్వము నిత్యము సిద్ధమై యున్నది. ఇంతవరకు ఆత్మకు అవస్థాత్రియసాక్షిత్వము నిరూపింపబడినది. ఇకను పంచకోశవ్యతిరిక్తమన నేమో తెలియవలసి యున్నది.

3 పంచకోశవ్యతిరిక్తత్వము.

పంచకోశము లనగా, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. అన్నవికారమైనది అన్నమయకోశము. ఈ కోశమే స్థూలశరీరమై యున్నది. ఎట్లన, "మాతాపితృభ్యా మన్నే భుక్తేసతి శుక్లశోణితాకారేణపరిణామః, తయో స్సంగా దేవదేహాకారేణపరిణామః కోశవ దాచ్ఛాదకత్వాత్ కోశఇత్యుచ్యతే. అన్న వికారత్వే స త్యాత్మాన మాచ్ఛాదయతి" అనగ, అన్నమయకోశ మనునది ఎట్లు యేర్పడుచున్న దనగ, తల్లిదండ్రులచేత అన్నము భుజింపబడి అది శుక్లరూపముగాను, నెత్తురురూపముగాను పరిణమించును. వానికూడిక దేహాకారముగ మారును. కోశము అనగా ఒఱ. ఒఱవలె కప్పియుండునది గనుక కోశమని చెప్పబడుచున్నది. అన్నవికారమై యుండి ఆత్మ కిది ఆచ్ఛాదముగా నుండును అని యర్థము. ఇది ఆత్మనెట్లు ఆచ్ఛాదించును? అనగా, పరిమితిలేని ఆత్మను పరిమితి గలదాని వలెను, జన్మాది వికారములు లేని ఆత్మను, జన్మాదివికార

వములు కలదాని వలెను, తాపత్రయాదులులేని ఆత్మను తాపత్రియాదులు గలదానివలెను ఆచ్ఛాదించు చున్నది. ప్రాణమయ కోశమనగా నేమి? ఇది ఆత్మ నెట్లు ఆచ్ఛాదించు చున్నది అను ప్రశ్న నిక విచారించవలసియున్నాము.

"కర్మేంద్రియాణి పంచ, ప్రాణాది పంచవాయవః, ఏత త్సర్వం విదితం ప్రాణమయకోశ ఇత్యుచ్యతే."

అనగ, కర్మేంద్రియములు అయిదు, ప్రాణవాయువులు అయిదుకూడి ప్రాణమయకోశ మగుచున్నది అని యర్థము. ఇది ఆత్మ నెట్లాచ్ఛాదించుచున్నదనగ, మాట్లాడుట మొదలగునవిలేని ఆత్మను మాటలాడు దానివలెన, గమనాగమనములు లేని ఆత్మను గమనాదికము గలదాని వలెను, క్షుత్పిపాసలులేని ఆత్మను, క్షుత్పిపాసలుకల దాని వలెను, యీకోశము కప్పివేయుచున్నది. మనోమయకోశము అనగ, "జ్ఞానేంద్రియాణి పంచ, మనశ్చ ఏతత్సర్వం మిళిత్వా మనోమయకోశ ఇత్యుచ్యతే" అనగా, జ్ఞానేంద్రియములు, మనస్సును కూడి మనోమయ కోశమగుచున్నది యని అర్థము. ఇది ఆత్మను యెట్లు ఆచ్ఛాదించుచున్నది అనిన సంశయాదులు లేనిఆత్మను సంశయాదులు కలదానివలెను శోకమోహములు లేనిఆత్మనుశోకమోహములు కలదానివలెను చూచుట వినుట మొదలగునవిలేని ఆత్మను చూచుట వినుట మొదలగునవి కల దానివలెను కప్పుచున్నది. ఇకనువిజ్ఞానమయకోశమనగానేమి?

"జ్ఞానేంద్రియాణి పంచ బుద్ధిః ఏతత్సర్వం మిళిత్వా, విజ్ఞాన

మయకోశ ఇత్యుచ్యతే.” అనగ, జ్ఞానేంద్రియములును బుద్ధియు కూడి విజ్ఞానమయ కోశమగుచున్నది ఇది ఆత్మ, నెట్లు ఆచ్ఛాదించుచున్నదనిన కర్తగాని యాత్మను కర్తగను, తెలిసికొనని ఆత్మను తెలిసికొనువానివలెను, నిశ్చయములేని ఆత్మను నిశ్చయముగలవానివలెను మాంద్యము జాడ్యము మున్నగునవి లేని ఆత్మను మాంద్యజాడ్యాదులు గలవాని వలెను కప్పుచున్నది. ఆనందమయకోశమనగా నేమి? “ప్రియ మోదప్రమోదవృత్తిమత్ అజ్ఞానప్రధాన మంతఃకరణం ఆనందమయకోశ ఇత్యుచ్యతే.” అనగా ప్రియము, సంతోషము, అతిసంతోషము వీనియందు ప్రవర్తించు అజ్ఞానము ప్రధానముగా గల అంతఃకరణము అని యర్థము. ఇది ఆత్మ నెట్లు కప్పుచున్నది యనిన ప్రియము, సంతోషము, అతి సంతోషము లేని ఆత్మను ప్రియము, సంతోషము, అతిసం తోషము కలవానివలెను, అనుభవించునదిగాని ఆత్మను అను భవించుదానివలెను, అపరిమితసుఖము గల ఆత్మను పరి మితసుఖము గలవానివలెను ఆచ్ఛాదించుచున్నది. ఇక్కడ నొక సందేహము కలుగనున్నది. ఆత్మసత్తను ఉపజీవించు కొని తోచెడి పంచకోశములు ఆత్మను కప్పుటకెట్లు సమర్థము లగును. అను ప్రశ్న రావచ్చును. ఇందులకు సమాధాన మేమన సూర్యకిరణములవలన గలిగిన మేఘములు సూర్యునియొక్క సత్తనుపజీవించుకొనియున్నను ఆ మేఘములు సూర్యునే కప్పు చున్నవి. అటులనే, అగ్నిసత్తనుపజీవించుకొని తోచెడి ధూమము అగ్నినే కప్పుచున్నది. మఱియు రజ్జుసత్తనుప

జీవించుకొని తోచెడి సర్పము ఆ రజ్జువునే కప్పుచున్నది. ఇదియునుగాక మృత్సత్తనుపజీవించుకొని తోచెడి ఘటము ఆ మృత్తునే కప్పుచున్నది. తుదకు స్వర్ణసత్తనుపజీవించుకొని తోచెడి కుండలములు ఆ స్వర్ణమునే కప్పుచున్నవి. అటులనే ఆత్మసత్తనుపజీవించుకొని తోచెడి పంచకోశములు ఆత్మను కప్పుచున్నవి.

ఇట్టిస్థితిలో ఆత్మకు పంచకోశవ్యతిరిక్తత్వ మెట్లు సిద్ధించును? ఖడ్గమును దీనిని కప్పియుండు ఒఱయును ఏకముగ వ్యవహరింపబడునవిగా తోచినప్పటికిని ఆ ఖడ్గము ఒఱ కంటె భిన్నమై యెటుల తోచుచున్నదో అటులనే ఆత్మయును, పంచకోశములును ఏకముగా వ్యవహరింపబడినవై తోచినప్పటికిని, కాలత్రయమునందు ఆత్మ పంచకోశముల కంటె భిన్నుడై తోచుటే పంచకోశ వ్యతిరిక్త మనబడును. అయితే ఆత్మకు పంచకోశములతోడి యిట్టి కలయిక ఎట్లు సంభవించినది అనిన అన్యోన్యాధ్యాసమువలన కలిగినదని చెప్పవలెను. అనగా, ఒకవస్తువునందలి ధర్మములు మఱియొక వస్తువునందు తోచుట అన్యోన్యాధ్యాసము. దీనికి తాదాత్మ్యము అనికూడా పేరు కలదు. ఇట్టి తాదాత్మ్యము ఆత్మకు పదివిధములుగ కలుగుచున్నది. జీవ, సామాన్యజాతి, వికార, లింగ, వర్ణ, విశేషజాతి, ఆశ్రమ, నామ రూప, సంస్కార, వేష, క్రియాదిద్వారా ఆత్మకు పంచకోశములతోడి తాదాత్మ్యము కలుగుచున్నది.

(a) 1. నేను జీవుడ ననుకొనుట జీవాధ్యాసము.

2. నేను మనుష్యుడ ననుకొనుట సామాన్యజాతి అధ్యాసము.

3. నేను పుట్టి, పెరిగి, నశించుచున్నాను అని అను కొనుట వికారాధ్యాసము.

4. నేను పురుషుడను, స్త్రీని అనుకొనుట లింగాధ్యాసము.

5. నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను అను కొనుట వర్ణాధ్యాసము.

6. నేను తెలుగువాడను, అరవవాడను, ఆపస్తంబ సూత్రుడను, భారద్వాజసగోత్రుడను అనుకొనుట విశేష జాత్యధ్యాసము.

7. నేను బ్రహ్మచారిని, గృహస్థుడను అనుకొనుట ఆశ్రమాధ్యాసము.

8. నేను రామదాసును, గాంధిదాసుడను, ఎర్ర వాడను, నల్లవాడను అనుకొనుట నామరూపాధ్యాసము.

9. నేను సోమయాజిని, అద్వైతిని, యోగీశ్వరుడను, అనుకొనుట వేషాధ్యాసము.

10. నేను ఉపాధ్యాయుడను, కుమ్మరిని, చాకలిని అనుకొనుట క్రియాధ్యాసము.

ఈ ధర్మము లన్నియు అన్నమయకోశసంబంధములై యున్నవి. ఈ కోశధర్మములను తనయందును, తన ధర్మము లైన సచ్చిదానందలక్షణములను అన్నమయకోశమునందును ఆరోపించుచున్నాడు. ఈ అన్యోన్యాధ్యాసముచేత అన్నమయ కోశమునకును, ఆత్మకును తాదాత్మ్యము కలిగినది.

(b) నేను క్షుత్పిపాసలు కలవాడను, వక్తను, దాతను, యోగను అనుకొనుట ప్రాణమయకోశధర్మములు. వీనిని ఆత్మనిష్ఠములుగ దలంచుటయు, ఆత్మధర్మములైన సచ్చిదా నందములు ప్రాణనిష్ఠములుగ తోచుటయు వీనివలన ప్రాణ మయకోశమునకును, ఆత్మకును అన్యోన్యాధ్యాసము వచ్చు చున్నది.

(c) నేను శోకిని, మోహిని, క్రోధిని, ద్వేషిని, బధిరు డను అను మనోమయకోశధర్మములు ఆత్మయందును, ఆత్మ ధర్మములైన సచ్చిదానందములు మనోమయకోశమునందును తోచుచున్నవి. కాన ఈ రెంటికిని అన్యోన్యాధ్యాసము ద్వారా కూటమి వచ్చినది.

(d) నేను కర్తను, విరక్తుడను, పండితుడను, అను విజ్ఞాన మయకోశధర్మములు ఆత్మయందును, ఆత్మధర్మములైన సచ్చిదానందములు విజ్ఞానమయకోశమునందును తోచు చున్నవి గాన, నీ రెంటికిని అన్యోన్యాధ్యాసమువలన కూటమి వచ్చినది.

(e) నేను భోక్తను, అజ్ఞుడను, సుఖిని, భ్రాంతుడను అను ఆనందమయకోశధర్మములు ఆత్మయందును, ఆత్మధర్మము

లగు సచ్చిదానందములు ఆనందమయకోశమునందును తోచుచున్నవి. కాన నీ రెంటికిని అన్యోన్యాధ్యాసమువలన కూటమి వచ్చినది.

నా యావు, నా దూడ. నా వస్త్రము అని తన్ను సంబంధించుకొని తోచు నీ యావు, దూడ యనునవి, తా నెటులకాడో, అటులనే నా శరీరము, నా ప్రాణము, నా మనస్సు, నా బుద్ధి, నా యజ్ఞానము అని తన్ను సంబంధించుకొని తోచు పంచకోశములును తాను గాదు. అనగ, తాను పంచకోశవ్యతిరిక్తు డని తేలినది.

అయితే యీ పంచకోశముల యథార్థ మేమి? రజ్జువునం దారోపింపబడిన సర్పము రజ్జువునకంటె వ్యతిరిక్త మెట్లు కాదో అట్లనే ఆత్మయం దారోపింపబడిన యీ పంచకోశములు అధిష్ఠానమగు నాత్మకంటె వ్యతిరిక్తము కా వని తెలియతగియున్నవి. అయితే రజ్జుజ్ఞానము కలిగిన తర్వాత సర్పప్రతీతి పోయినదిగదా, ఆత్మజ్ఞానము వచ్చిన తర్వాత కూడ పంచకోశప్రతీతి యేల రావలెను అని అడుగుచున్నారు. ఇందులకు సమాధాన మేమన, మరుమరీచికలయందు జలభ్రాంతి పోయినపిమ్మటకూడ తిరిగి జలప్రతీతి ఎటుల వచ్చుచున్నదో, అటులనే పంచకోశములు ఆత్మకంటె వేరు గావను జ్ఞానము కలిగినపిమ్మటకూడ పంచకోశప్రతీతి రావచ్చును. అయితే యీ దృష్టాంతమందు జలప్రతీతిమాత్రమే కలదు. గాని, ఆజలమునందు జనులు స్నానపానాది క్రియలుచేయుట లేదుగదా. కాని దార్ష్టాంతికమందు ఆత్మకంటె పంచకోశ

ములు భిన్నము కావని తెలిసిన పిమ్మటకూడ పంచకోశంబుల ప్రతీతియు, నేను భుజించుచున్నాను నేను నిద్రించుచున్నాను. అను వ్యవహారములు వచ్చుచునే యున్నవి యనిన, రావచ్చును. ఏలయన మృత్తికయం దారోపింపబడిన ఘటశరావాదులు మృద్వ్యతిరిక్తములుగ లేవని యెరిగినప్పటికిని, ఆ ఘటశరావాదుల ప్రతీతియును, ఆ ఘటశరావాదులను వంట కుపయోగించులయు, శుద్ధిపరచుకొనుటయు మున్నగు వ్యవహారములు ఎటుల వచ్చుచున్నవో, అటులనే ఆత్మయం దారోపింపబడిన పంచకోశములు అధిష్ఠానమైన ఆత్మకంటె వ్యతిరిక్తముగ లేవని తెలిసినపిమ్మటకూడ పంచకోశములయొక్క ప్రతీతియు, వ్యవహారములును రావచ్చును. అయినను, సూక్ష్మబుద్ధి గలవానికి మృద్వ్యతిరిక్తముగ ఘటాదులు లేవని యెటుల దృఢనమ్మకము కలుగుచున్నదో అటులనే సూక్ష్మబుద్ధిచేత ఆత్మవ్యతిరిక్తముగ పంచకోశములు లేవని దృఢనమ్మకము కలుగును. ఇట్లు తెలిసికొనుటయే పంచకోశవ్యతిరిక్తజ్ఞానమనబడును

ఇకను ఆత్మకు సచ్చిదానందలక్షణత్వము నిరూపింపబడవలసి యున్నది.

## 4 సచ్చిదానందలక్షణత్వము.

సచ్చిదానందము అనగ, సత్, చిత్, ఆనందము. ఈ మూడును కూడి సచ్చిదానంద మగుచున్నది. వీనిలో సత్ అనగ నేమి?

"కేనా ప్యబాధ్యమానత్వేన, కాలత్రియే ప్యేకరూ పేణ విద్యమానత్వ ముచ్యతే."

అనగ దేనిచేతను బాధింపబడక కాలత్రియంబునందు నేకరూప మైయుండునది సత్ అనబడును. అయితే సద్రూప మైన ఆత్మ భూతభవిష్యద్వర్తమానకాలములయందు ఉన్నా డనుటకు ప్రమాణ మేమి? ఈ విషయమున సర్వజనుల యొక్క అనభవమే ప్రమాణము. ఎట్లన దరిద్రుడు, ధన వంతుడు, కర్మి, భక్తుడు, ముముక్షువు, వీరల అందరి అనుభవ మునుబట్టి వీరు ఈ జన్మమునందును, గతజన్మములయందును, రాబోవు జన్మములయందును ఉన్నా రని తెలియగలదు. దరిద్రు డేమి చెప్పుచున్నాడు? అయ్యా, నే నీజన్మమునందు దారిద్ర్య మనుభవించుచున్నాను. అని ఆతడు పలుకుచున్నాడు. గనుక ఆత డీవర్తమానజన్మమునం దున్నట్లు తేలినది. మఱియు, "అయ్యా నేను పూర్వజన్మమునం దెవరికిని దానధర్మములను చేసియుండనందున నా కిప్పు డీదారిద్ర్యము ప్రాప్తించినది అని ఆత డనుచున్నాడు. దీనినిబట్టి తాను పుట్టుటకుపూర్వముకూడ నీత డున్నటు తెలియుచున్నది. అనగ, గతజన్మమునందును నీత డు కలడని అర్థము. ఇంతియేగాక "అయ్యా! నే నీజన్మములో నేమియు దానము చేయ శక్తిలేకయున్నాను. ఇందువలన రా బోవుజన్మమునందు నే నింతకన్న దరిద్రుడనై పుట్టవలసి యుండు నని భయపడుచున్నాను" అని యాత డనుచుండుట చేత నీతనికి ముందుజన్మముకూడ కలదని తేలినది. కాన, దరిద్రుని సాక్ష్యమునుబట్టి యాతడు భూత, భవిష్య

ర్వర్తమానకాలములయం దున్నట్లు ఋజువైనది. ఇటులనే ధనవంతుడు, కర్మి, భక్తుడు, ముముక్షువు మున్నగువారు తమతమ పూర్వాపరజన్మ వృత్తాంతములను చెప్పుటచేత సర్వజనులయొక్క అనుభవమును బట్టి ఆత్మ త్రికాలముల యం దున్నాడని తెలియుచున్నది

అయితే, పూర్వ మొక్కజన్మముతోనే యీ వాద మును సరిపుచ్చినా రని ఆక్షేపణ రావచ్చును. ఇందులకు సమాధానము వినతగియున్నది. తాను పూర్వజన్మములో చేసిన కర్మమువలన నీ జన్మ వచ్చినది గదా! అట్లైనచో పూర్వజన్మ మెట్లు వచ్చినది? అంతకు పూర్వజన్మలో చేసిన కర్మమువలన వచ్చిన దని చెప్పవలయును. ఆ జన్మ మెట్లు కలిగిన దనిన, దానికి పూర్వపు కర్మ వలన వచ్చినదని చెప్పవలసియుండును. ఈ ప్రకారము అనేకకోటి పూర్వ జన్మములయందును, అనేకకోటి భావిజన్మముల యందును తాను జన్మల నెత్తి కర్మములను చేయుచు ఆ కర్మములవలన తిరిగి జన్మముల నెత్తుచు, ఆ జన్మముల వలన తిరిగి కర్మ ముల చేయుచు సుఖదుఃఖముల ననుభవించుచున్నాడుగదా! కాన కాలత్రయములయందును ఆత్మ యున్నాడని యుక్తి చేతను, అనుభవముచేతను సాధింపబడినది.

**2.** చిత్ అనగానేమి?

సాధనాంతరనిరపేక్షయా స్వయంప్రకాశమానం సత్ స్వస్మిన్నారోపిత సర్వపదార్థావభాసకత్వం వస్తుత్వం చిద్రూపత్వ ముచ్యతే.

అనగ, మఱియొక సాధనముయొక్క అపేక్షలేక తనంతట తానే ప్రకాశించుచున్నదియై తనయందారోపింపబడిన సమస్తపదార్థములను ప్రకాశింపచేయుచు, తాను సత్యమై యుండుట చిద్రూపత్వ మనబడును. ఈ ధర్మము ఆత్మయందున్నదో లేదో తెలియవలసియున్నది. ఏ వస్తువునైనను మనకు కాన్పింపచేయునది సూర్యచంద్ర నక్షత్ర అగ్ని విద్యుచ్ఛక్తులై యున్నవి. ఇట్టి సాధనములు లేని గాఢాంధకారమునందు కండ్లు మూసికొనియున్నప్పుడు మనము బాల్యమునందు చేసిన వ్యాపారములు మనకు తోచుచుండును. అటులనే బాహ్యాంభ్యంతర ప్రపంచ మంతయును మనకు తోచుచునే యుండును. అయితే మనము సర్వమును తెలిసికొనుచున్నది మనస్సుచేత గదా. సాధనాంతరము లేదని యెట్లు చెప్పవచ్చును? అని అడిగెద రేమో! మనస్సునకు జడత్వమే గాని చైతన్యత్వములేదు. జడమైన మనస్సు ఏ పదార్థమును తోపింపజాలదు. ఆత్మచేత తోపింపబడిన మనస్సు సర్వమును తోపింపచేయుచున్నదని చెప్పవలసియున్నది. ఇటుల తోపింపచేయుటయందు మనస్సు ఒక ఉపాధి మాత్రమే అయియున్నది. ఒకదృష్టాంతమును చూతుము. ఒక ప్రమిదలో చమురుపోసి అందు ఒకవత్తిని తడిపిపెట్టుదుము. ఈ వత్తి తానును ప్రకాశింపక ప్రమిదను, చమురును సయితము ప్రకాశింపచేయ జాలదు. కాని అగ్నితేజస్సును ఈ వత్తికి తగిలింపుదుము. ఈ అగ్నితేజస్సు వత్తియను ఉపాధితో కూడుకొని తానును తోచును. మఱియు తైలాదులును, సమీపపదార్థ

ములను తోఁపింపజేయును. ప్రమిదస్థానమున స్థూలశరీరమును, తైలస్థానమున కర్మమును కర్మముచేత నుత్థాపితమైన మనస్సు, తైలముచేత తడుపబడిన వత్తిస్థానమున కలవు. ఇట్టి మనస్సు తాను తోఁచుటగాని, అన్యపదార్థముల తోఁపింపజేయుట గాని జరుపగలదా? లేదు ఈ దృష్టాంతమునందు ఆత్మ అగ్ని తేజమువంటివాఁడు. ఈ ఆత్మ మనస్సుతోఁ కూడి తాను మఱి యొక సాధనము నపేక్షింపక తోఁచుచు, మనస్సును, దీని వృత్తులను, ఇంద్రియాదులను, సర్వబాహ్యప్రపంచమును తోఁపింపజేయుచున్నది. ఆత్మ నిరుపాధికుఁడు. ఈ ఆత్మస్వరూపము లమే మనము. కాన సాధనాంతరము లేకయే స్వయంప్రకాశమానమైన సర్వపదార్థావభాసకత్వము ఆత్మ కిప్పుడు సిద్ధించినది.

3. ఆనంద మనగా నేమి?

"పరమప్రేమాస్పదత్వం నిత్యనిరుపాధికనిరతిశయత్వం ఆనందరూపత్వ ముచ్యతే.

అనగ, నిత్యమై నిరుపాధికమై నిరతిశయమైన సుఖస్వరూపత్వమని అర్థము. ఈ ధర్మము ఆత్మలమైన మనయం దున్నదో లేదో విచారించెదము.

సామాన్యముగా ప్రపంచములో సర్వుల అనుభవమును బట్టి సర్వోత్కృష్టమై, సర్వదుఃఖనివర్తకమైన ఆనందము నిచ్చునవి స్రక్చందనాదులని తెలియును. సుషుప్తి యనగా గాఢనిద్రయందు సర్వోత్కృష్టమైన యిట్టిసుఖము సర్వులచే ననుభవింపబడుచున్నది. అయితే సుషుప్తియందు దుఃఖాభావమేగాని

సుఖము లేదని కొందరనియెదరు. ఇట్టిస్థితిలో సుషుప్తిసుఖమునకు (a) నిరుపాధికత్వము, (b) నిరతిశయత్వము, (c) నిత్యత్వములను ఎట్లు సాధింపవచ్చు ననగా గాఢనిద్రలో మన మట్టి సుఖమునే అనుభవింపక యుండినచో నిద్ర లేచిన తర్వాత "హాయిగా నిద్రపోతిమి" అని మన పూర్వానుభవమును జ్ఞాపకమునకు తెచ్చుకొని యెట్లు చెప్పగలుగుచున్నాము? నిద్రలో సుఖము ననుభవించితిమి గనుకనే నిద్రానంతరము దానిని గూర్చి చెప్పగలుగుచున్నాము. కాన సుషుప్తియందు ఆనందము కల దని తేలినది. అయితే యీ సుఖమునకు నిరుపాధికత్వ మెట్లు? సుఖమునకు కారణములైన స్రక్చందనాదివిషయములు నిద్రలో లేకున్నను, అందరి చేతను సుఖ మనుభవింపబడుచునే యున్నది. కనుక నీ సుఖమునకు నిరుపాధికత్వ మున్నది. అన్నిసుఖములలోను స్త్రీసంభోగసుఖమే అధిక మైనదిగదా! అట్టి సుఖమును కూడ త్యజించి సమస్తప్రాణులును నిద్రనే కోరుచు నిద్రాసుఖమునకే పెనుగులాడుచున్నారు. మరియు నీ నిద్రకు భంగమును కలిగించిన వారిపై నాగ్రహముకూడ కనుపరచుచున్నారు. ఇదియునుంగాక జాగ్రత్స్వప్నములయందు తోచునట్టి తాపత్రయములు నిద్రలో నమసిపోవుచున్నవి. ఈ హేతువు వలన నిద్రాసుఖమునకు మించిన సుఖము మఱియొకటి లేదు. ఇందువలన ఆనందమునకు నిరతిశయత్వము కలదని తేలినది.

ఇకను ఆనందమునకు నిత్యత్వమును సాధించవలసి యున్నాము. జాగ్రత్స్వప్నములయందు అనుభవింపబడు

విషయ సుఖములు ఏకరూపముగ లేక నానారూపములుగ కాన్పించుచున్నవి. ఎట్లన, శీతకాలములో మనకు సుఖము నిచ్చు వేడినీళ్లు వేసవికాలములో మనకు దుఃఖము నిచ్చుచున్నవి. కాన విషయసుఖములకు నిత్యత్వము లేదు. అటులనే జాగ్రత్స్వప్నములలో మనము అనుభవించు సర్వసుఖములు దేశకాలనిమిత్తములనుబట్టి భేదించుచుండును. కాని సుషుప్తిసుఖ మట్లు భేదించక అందరిచేతను ఏకరూపముగా ననుభవింపబడుచున్నది. కాన ఆనందమునకు నిత్యత్వము కలదు.

ఇట్లు సుషుప్తిసుఖము నిత్యమైనయెడల జాగ్రత్స్వప్నములయందు అయ్యది మనకేల తోచుటలేదు? అను ప్రశ్న రావచ్చును. ఇందులకు సమాధాన మేమన, జాగ్రత్స్వప్నములయందు దుఃఖరూపమైన దేహేంద్రియాదిసంపర్క ముండుటవలన అప్పుడు సుషుప్తిసుఖము మరుగుపడియున్నది. ఇచట మఱియొక ప్రశ్న రాగలదు ఆత్మ కారణ మనియు, దేహేంద్రియాదులు కార్యము లనియు చెప్పుచున్నారుగదా. కార్యములైన దేహేంద్రియాదులవలన, కారణమైన ఆత్మకు తిరోధానత్వ మెట్లు వచ్చును. అనగ, రావచ్చును. ఎట్లన, సూర్యునకు ప్రకాశము నిత్యమై స్వతస్సిద్ధమైనప్పటికిని, ఆ సూర్యకిరణములవలన కలిగిన మేఘసముదాయముచే సూర్యప్రకాశమునకు తిరోధానము వచ్చుట కలదు. అటులనే అగ్నికి ప్రకాశము స్వతస్సిద్ధమైనను, స్వకార్యమైన ధూమ సంపర్కముచే ఆ ప్రకాశమునకు అడ్డు కలుగుట సంభవించుచున్నది.

తద్వత్తుగా, ఆత్మకు సుఖస్వరూపత్వము స్వతస్సిద్ధమై యున్నను, ఆత్మకార్యంబులైన దేహేంద్రియాదుల సంపర్కమువలన జాగ్రత్స్వప్నములయందు ఆ సుఖమునకు తిరోధానత్వముకూడును. బాహ్యదృష్టికలవాని కియ్యది తోచకున్నను, అంతర్ముఖుడైనవానికి సర్వదా తోచగలదు. కాన సుషుప్తిసుఖము కాలత్రయమునందును గలదు. ఈ కారణము లన్నింటినిబట్టి సుషుప్తిసుఖమునకు నిత్యత్వ, నిరుపాధికత్వ నిరతిశయత్వములు సిద్ధించుచున్నవి. ఈ విచారణవలన తేలిన సారాంశ మే మనగా, ఆత్మకు సచ్చిదానందత్వము కలదని నిశ్చయమైనది. ఇంతటితో ఆత్మానాత్మవిచారము పూర్తియైనది. ఆత్మ సచ్చిదానందస్వరూపుడనియు, అనాత్మ అనృతజడదుఃఖాత్మక మనియు తేలినది ఈ అనాత్మ విజృంభణము వలన కలుగు నీ జగదాకారము లన్నింటిని ఆత్మ సాక్షియై చూచుచున్నాడు. కాన ఆత్మకు సాక్షిత్వ మేర్పడుచున్నది.

## ఆత్మకు సాక్షిత్వము.

ఆత్మసాక్షిత్వము పిండాండమైన వ్యష్టిదేహమందును బ్రహ్మాండమైన సమష్టిదేహమందును నిరూపింప వలసియున్నాము. ప్రప్రథమమున వ్యష్టిదేహమున ఆత్మకుగల సాక్షిత్వము తెలుపబడుచున్నది. ఎట్లన, నేను దేహమును కాను. దేహమును చూచుచున్న సాక్షిని. నేను దేహమే అయినయెడల దేహలక్షణములైన జననమరణములు నాకుండవలయును. కాని నేను జన్మమృత్యువులు లేని ఆత్మస్వరూపుడనని వేదాంతము బోధించుచున్నది. ఎట్లన.

దేహో నాऽహ మహం దేహీ దేహసాక్షీతి నిశ్చయాత్,
జన్మమృత్యు ప్రహీణోऽసౌ వితి వేదాంతడిండిమః.

అనగ, నేను దేహమును కాను, దేహమునుకల దేహిని అనగ సాక్షిని అయి యున్నాను. కాన జన్మమృత్యు రహితుడను అని అర్థము. అట్లనే ప్రాణము నేనుగాను, ప్రాణమును చూచుచున్న సాక్షిని. ప్రాణమే నేను అయియున్నచో ప్రాణధర్మములైన క్షుత్పిపాసలు నా కుండియుండవలెను. కాని నేను క్షుత్పిపాసలు లేని ఆత్మను అని ఉపనిషన్మతమై యున్నది. మఱియు నేను మనస్సును కాను. మనస్సును చూచుచున్న సాక్షిని మనస్సే నేనై యున్నయెడల మనోధర్మములగు శోకమోహములు నా కుండియుండవలెను. కాని నేను శోకమోహరహితుడైన ఆత్మ నని జ్ఞానకాండ బోధించుచున్నది. మఱియు నేను బుద్ధిని కాను, బుద్ధిని చూచుచున్న సాక్షిని. బుద్ధియే నేనైనచో బుద్ధిధర్మమగు కర్తృత్వము నా కుండవలెను. కాని కర్తృత్వశూన్యుడగు ఆత్మను నే నని శ్రుతిశిరంబులు ఘోషించుచున్నవి. మఱియు నేను అజ్ఞానమును కాను. అజ్ఞానమును చూచుచున్న సాక్షిని. అజ్ఞానమే నేనైనచో అజ్ఞానధర్మమైన సర్వానర్థము నా కుండి యుండవలెను. కాని సర్వానర్థ రహితుడైన ఆత్మ నేనని బ్రహ్మజ్ఞానము తెలుపుచున్నది. ఈ ప్రకారముగ మరల మరల విమర్శించి నేను సాక్షినని యెవరు తెలుసుకొనుచున్నాడో ఆతడే ముక్తుడు, ఆతడే విద్వాంసు డని తత్త్వశాస్త్రము ప్రమాణము చూపుచున్నది. మఱియు నేను మాయను కాను, మాయా

కార్యమును కాను, సాక్షినికాను. నేను వీని కన్నింటికిని అతీతుడను అని నిస్సంశయముగ నెఱుంగుటవలన ముక్తి కలుగు నని వేదాంతము ప్రతిపాదించుచున్నది. ఎట్లన,
నాహం మ్మాయా న తత్కార్యం న సాక్షీ పరమోఽస్మ్యహం,
ఇతి నిస్సంశయజ్ఞానా న్ముక్తి ర్వేదాంతడిండిమః.

ఈ ప్రమాణవాక్యము పై అర్థమును స్పష్టపరచుచున్నది. నేను ప్రపంచమును కాను. నాయందు ప్రపంచము కల్పితమై యున్నది. అని స్పష్టముగ తత్త్వము తెలిసిన తరువాత దుఃఖ మెక్కడ? పిండాండమున గల దేహ, ప్రాణ, మనో, బుద్ధి, అవిద్యా, మాయలు ఆత్మ కా వనియు వీని నన్నింటిని చూచుచున్న సాక్షియే ఆత్మయనియు తేలినది. ప్రపంచము నంగల సర్వవస్తువులందును సచ్చిదానందస్వరూపు డగు ఆత్మ కలదు.

"సత్తాస్ఫురణసౌఖ్యాని భాసన్తే సర్వవస్తుషు" అని శ్రుతి తెలుపుచున్నది. అనగ, సకలవస్తువులయందును సత్తాస్ఫురణసౌఖ్యములు భాసిల్లుచున్నవి. ఇవి ఆత్మలక్షణములు. ఇంతవరకు పిండాండమైన జీవునియందు ఆత్మకలదని నిరూపింపబడినది. ఇకను బ్రహ్మాండమైన ఈశ్వరుని యందు బ్రహ్మము కల దని తెలుపబడవలసియున్నది. పిండాండమునందు అన్నమయాదిపంచకోశములున్నట్లు బ్రహ్మాండమునందు ఆకాశాదిపంచభూతము లున్నవి. ఈ పంచకోశములయందుగల సత్తు, చిత్తు, ఆనందములు ఆత్మ యని తెలుపబడుచున్నవి. దేహాదిపంచకోశములయందు ఏ సత్తా తోచుచున్నదో, ఆసత్తయే ఆత్మ

యగును. మఱియు దేహాదిపంచకోశములయందు ఏ చిత్తు కనబడుచున్నదో, ఆచిత్తు ఆత్మయే. దేహాదిపంచకోశముల యందు ఏ యానందము కలదో, ఆ యానందము కూటస్థుడగు ఆత్మయే అగును. ఇకను ఆకాశాదిపంచభూతములయందు ఏ సత్తా తోచుచున్నదో, అసత్తయే బ్రహ్మము. మఱియు ఆకాశాదిపంచభూతములయందు ఏచిత్తు కనబడుచున్నదో ఆ చిత్తే బ్రహ్మము. ఈ పంచభూతములయందు ఏ ప్రీతి కనబడుచున్నదో ఆ ప్రీతియే బ్రహ్మము. ఇకను దేహాది పంచకోశములందుగల సత్త యేది గలదో ఆకాశాదిపంచ భూతములందును ఆసత్తయే కలదు. ఎందువలన అనగా, సత్తలో భేదములు కల వని ప్రమాణము లెక్కడను లేవు. అటులనే దేహాదిపంచకోశములందుగల చిత్తు ఏది గలదో ఆకాశాది పంచభూతములందును ఆచిత్తే కలదు. చిత్తులో భేదము లున్నట్లు ప్రమాణములేదు గనుక అటులనే దేహాదిపంచకోశములందుగల ఆనంద మేది గలదో ఆకా శాదిపంచభూతములందును ఆ యానందమే కలదు. ఆనం దమునందు భేదము లున్నట్లు ప్రమాణములు లేవు గనుక ఈ విచారణవలన ఆత్మ సచ్చిదానందు డనియు, బ్రహ్మము సచ్చిదానందు డనియు ఋజువైనది. సచ్చిదానందములకు భేదము లేదు. గనుక జీవునియందు గల ఆత్మయే ఈశ్వరుని యందుగల బ్రహ్మమని తేలినది. ఇందువలన జీవబ్రహ్మైక్యము నిరూపింపబడినది.

సచ్చిదానందరూపత్వా ద్బ్రహ్మైవాత్మా న సంశయః
ఈ ప్రమాణము పైనదెల్పిన యథార్థమును బోధించుచున్నది.

మహావాక్యార్థవిచారము.

పైన దెల్పిన జీవబ్రహ్మైక్యము మహావాక్యార్థవిచారణవలనకూడ ఋజువుచేయబడుచున్నది. ఉపనిషత్తులయందు మహావాక్యము లనేకములు గలవు వీనిలో నాల్గు మహావాక్యములుమాత్రమే ప్రధానములుగ నెంచబడుచున్నవి. ఈనాలుగు మహావాక్యములును నాలుగువేదములనుండి గ్రహింపబడియున్నవి. (1) ఋగ్వేదమునుండి "ప్రజ్ఞానం బ్రహ్మ" యనియు, (2) యజుర్వేదమునుండి, "అహం బ్రహ్మాఽస్మి" యనియు, (3) సామవేదమునుండి, " తత్త్వమసి " యనియు, (4) అథర్వణవేదమునుండి, "అయ మాత్మా బ్రహ్మ" యనియు నాల్గు మహావాక్యములు ఆత్మయొక్క అఖండార్థమును బోధించుటకై యేర్పరుపఁబడినవి ఒకవాక్యము కొన్ని పదములు కలిసి అగుచున్నది. వాక్యముయొక్క అర్థమును తెలిసికొనదలచినయెడల ఆ వాక్యములో గల పదములయొక్క అర్థమును ప్రప్రథమమున తెలిసికొనవలసియుండును. పదములయొక్క అర్థమే వాక్యము యొక్క అర్థ మగును. ఈ సిద్ధాంతమును పైన దెల్పిన నాలుగు మహావాక్యములందును కనబరచుచున్నాము.

తత్త్వమసి.

ఈ మహావాక్యముయొక్క అర్థము తెలియవలెనన్న దీనిలోని అన్నిపదములయొక్క అర్థమును ముందుగ తెలియ

వలసిన అవసరము కలదు. కాన నీ వాక్యమును విభజించి అందలి పదములను, వాని అర్థమును తెలిసికొనెదము. ఈ వాక్యములో

1. తత్,
2. త్వమ్,
3. అసి

అని మూడు పదములు కలవు.

త్వమ్ అనగ జీవాత్మ. తత్ అనగా పరమాత్మ, అసి అనగా యీ జీవాత్మ పరమాత్మలు ఒక్కటియే అని అర్థము. ఇకను త్వంపదవాచ్యమైన జీవునియొక్క స్వరూప మేది? అవిద్యయు, అవిద్యాధిష్ఠానచైతన్యము, ఈ చైతన్యము అవిద్యలో ప్రతిబింబించుటచే కలిగిన చిదాభాసుడు. ఈ చిదాభాసుని ధర్మములు కించిద్జ్ఞత్వ కర్తృత్వ భోక్తృత్వాదులు. ఈ నాలుగును కలిసి జీవునిస్వరూప మగుచున్నది. ఇకను తత్పదవాచ్యార్థమైన యీశ్వరుని స్వరూప మేది? మాయ, మాయాధిష్ఠానచైతన్యము. ఈ చైతన్యము మాయలో ప్రతిబింబించుటవలన కలిగిన చిదాభాసుడు, ఈ చిదాభాసుని ధర్మములైన సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది గుణములు- ఈ నాల్గును కూడి ఈశ్వరుని స్వరూపమగుచున్నది. ఇకను అసి యనగ, ఈ జీవుడే ఆ యీశ్వరుడు అని ఐక్యార్థము. కాన జీవేశ్వరైక్యము తత్త్వమసియను సామవేదాంతర్గతమైన యీ మహావాక్యమువలన ఋజువైనది.

అయితే యిక్కడ ఒక సందేహము కలుగుచున్నది. కించిజ్జ్ఞత్వాదిగుణములు గల జీవుడు సర్వజ్ఞత్వాదిగుణములుగల

యీశ్వరు డెట్లు కాగలడు? ఇయ్యది విరుద్ధార్థముగదా! ఇట్లు చెప్పుట ప్రత్యక్షవిరోధము కాదా? ఈ సంశయము నివారింపబడగలదు. ఎట్లన, ప్రతివాక్యమునకును రెండర్థములు గలవు. (1) వాచ్యార్థము. (2) లక్ష్యార్థము, వాచ్యార్థము నంగీకరించినచోట ప్రత్యక్షవిరోధము తటస్థించినచో అక్కడ లక్ష్యార్థ మంగీకరింపదగినదని లక్షణ బోధించుచున్నది.

లక్షణ మూడు విధములు: (1) జహల్లక్షణ (2) అజహల్లక్షణ (3) జహదజహల్లక్షణ. జహత్ అనగా 'విడిచిన' అని అర్థము. కాన జహల్లక్షణ అనగా, విడిచిన లక్షణ యనియు, అజహల్లక్షణ యనగా విడువని లక్షణయనియు, జహదజహల్లక్షణ యనగా విడిచి విడువని లక్షణయని అర్థము. దేనిని విడుచుట అనినప్పుడు వాక్యముయొక్క వాచ్యార్థమును విడుచుట యని తెలియవలెను. ఇకను ఈ మూడులక్షణలను సామాన్యవాక్యములం దన్వయించి చూచెదము.

"గంగాయాం ఘోషః" అని సాధారణముగా నొక వాక్యమును చెప్పెదరు. దీనియర్థమేమి? గంగాయాం = నీటియందు, ఘోషః = గొల్లపల్లె అని యర్థము. నీటియందుండు గొల్లపల్లె. నీటిలో గొల్లపల్లె యుండుట ప్రత్యక్షమునకు విరోధము. ఇట్టి విరోధము తటస్థించినప్పుడు గంగ = నీరు యనువాచ్యార్థమును విడిచి లక్ష్యార్థమైన గట్టు అనుదానిని గ్రహించవలెనని జహల్లక్షణ బోధించుచున్నది. గంగాయాం ఘోషః అనునప్పుడు నీటియందలి గొల్లపల్లెయను వాచ్యార్థము పొసగదు. కనుక లక్ష్యార్థమైన గట్టుమీది గొల్లపల్లె అను యర్థమును

గ్రహించవలెను. ఈ విధముగ తత్త్వమసియను మహావాక్యము నందు యీ జహల్లక్షణ పట్టునా ? అని విచారించవలసియున్నా ము. కాని యిక్కడ జహల్లక్షణ చెల్లుబడికాదు. త్వంపదార్థ మైన అవిద్య మొదలు అధిష్ఠానచైతన్యమువరకు విడిచిపెట్టి నచో ముముక్షువులయొక్క స్వరూపమే లేకపోవును.

ఇకను అజహల్లక్షణ పొసగునేమో విచారించెదము "మంచాః క్రోశంతి." అను సాధారణవాక్యము కలదు. మంచ ములు కూయుచున్నవి, అని దీనియర్థము. ఇది వాచ్యార్థము కాని యీ వాచ్యార్థమునే గ్రహించినయెడల మంచములు కూయుట అసంభవము గనుక మంచములమీది మనుష్యులని అర్థము చెప్పవలసియుండును. అట్లయినచో వాచ్యార్థమైన మంచములను విడువక మంచములమీదనున్న మనుష్యులని అర్థము చెప్పినచో వాక్యమునకు అన్వయము పొసగును. అన గా, ఇచ్చట అజహల్లక్షణ చెల్లును. ఈ ప్రకారము 'తత్త్వమసి' అను మహావాక్యమునందు అజహల్లక్షణకు స్థానము కలదా యనిన లేదు. ఏలనన కించిజ్జ్ఞత్వాదిగుణములనువిడువక అట్టిగుణ ములతో కూడుకొనిన జీవునకు అట్టిగుణములు లేని యీశ్వరు నితో ఐక్యము చెప్పరాదు.

ఇకను జహదజహల్లక్షణ చెల్లునేమో చూడవలెను. "సోఽయందేవదత్త" అను సాధారణవాక్యము కలదు. అనగా, ఆ దేవదత్తుడే యీ దేవదత్తుడని యర్థము. దేవదత్తుడనువాడు తన అయిదవయేట కృష్ణాతీరమందుండి తన ఏబదవయేట

కావేరీతీరమునకు వెళ్లగా ఈతని మిత్రులు వీనిని చూచి 'సోఽయం దేవదత్తః'' అని పలికిరి. అనగ, ఆ తీరమున ఆకాలమునందుండినవాడే యీతీరమున ఈకాలమునందున్నాడు అని దీని అర్థము. అయితే కృష్ణాతీరము కావేరీతీర మెట్లగును? అయిదు సంవత్సరముల నాటి యాకాలము యేబదిసంవత్సరముల నాటి యీకాల మెట్లగును? ఇది ప్రత్యక్షమునకు విరుద్ధమై యున్నది. కాన యిచ్చట జహదజహల్లక్షణ అనగా విడిచి విడువని వాచ్యార్థము చెప్పవలసియుండును. వాచ్యార్థమైన తద్దేశతత్కాలములును, నేతద్దేశ యేతత్కాలములను విడిచి లక్ష్యభూతుడైన దేవదత్తుని విడువక గ్రహించవలసి యున్నాము. ఇకను 'తత్త్వమసి'యను మహావాక్యమునందు కూడ యీ జహదజహల్లక్షణ చెల్లునేమో చూడవలసి యున్నాము. తత్పదంబునకు వాచ్యార్థమైన మాయా ప్రతిబింబసర్వజ్ఞత్వాదిగుణంబులకును, త్వంపదార్థమునకు వాచ్యార్థమైన అవిద్యాప్రతిబింబ కించిద్జ్ఞత్వాది గుణములకును ఐక్యము నంగీకరించినపక్షమున ప్రత్యక్షవిరోధ మగును. అయినను మాయా సర్వజ్ఞత్వాదిగుణంబులును అవిద్యాకించిజ్జ్ఞత్వాది గుణంబులును త్రోసివేసి లక్ష్యభూతమైన చైతన్యమునే గ్రహించినచో ఆ సచ్చిదానందబ్రహ్మమే నీవు. నీవే ఆ సచ్చిదానంద బ్రహ్మము. అని తేలును. కాన జహదజహల్లక్షణ యిక్కడ పొసగుచున్నది.

ఏకమేవాఽద్వితీయం స న్నామరూపవివర్జితం,
సృష్టేః పురాఽధునా ప్యస్య తాదృక్త్వం తదితీర్యతే.

అనగా, సృష్టికి పూర్వమందు ఏకమై నామరూప రహితమై ఏ ఆత్మయుండెనో ఆ యాత్మ కిప్పుడు (ఉపదేశకాల మందు) తత్ అను పదముచేతను, నామరూపరహితమైన లక్ష్యార్థచైతన్యమే చెప్పబడుచున్నది.

శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్తు చ త్వంపదేరితం,
ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్య మనుభూయతాం.

అనగ, ఉపదేశ మొందునట్టి అధికారియొక్క దేహేంద్రియాదుల కతీతమై సాక్షిభూతమైన చైతన్యమే త్వం పదముచేత చెప్పబడుచున్నది. ఇకను అసి అనుపదముచేత ఐక్యము బోధింపబడుచున్నది. ఆ తత్పద లక్ష్యార్థమైన చైతన్యమే నీవు. త్వంపదలక్ష్యార్థమైన నీవే ఆతత్పద లక్ష్యార్థము, అని ఐక్యము ప్రతిపాదింపబడుచున్నది.

ఇంతవరకు సామవేదాంతర్గతమైన తత్త్వమసి యను మహావాక్యమే విచారింపబడినది. పిమ్మట,

'ప్రజ్ఞానం బ్రహ్మ'.

అను ఋగ్వేద వాక్యముయొక్క తాత్పర్యము తెలియ వలసియున్నది. ప్రజ్ఞానం బ్రహ్మ అను వాక్యమునందలి ప్రజ్ఞాన శబ్దమునకు అర్థమేమి?

యేనేక్షతే శృణోతీదంజిఘ్రతి వ్యాకరోతి చ,
సాధ్వసాధు విజానాతి తత్ప్రజ్ఞాన మితీర్యతే.

అనగ, ఏ జీవుడు బయలుదెలిసిన అంతఃకరణవృత్తితో గూడుకొని నేత్రములద్వారా యే జ్ఞానమువలన రూపమును

చూచుచున్నాడో అట్లనే చెవులవలన శబ్దమును వినుచున్నాడో ఘ్రాణేంద్రియమువలన గంధమును గ్రహించుచున్నాడో వాక్కులవలన మాట్లాడుచున్నాడో, నాలుకవలన రుచిని తెలుసుకొనుచున్నాడో, మఱియు సకలేంద్రియములవలన సకల బాహ్యపదార్థముల నెఱుగుచున్నాడో ఆ జ్ఞానము ప్రజ్ఞానమనెడి పదమునకు లక్ష్యార్థము.

ప్రజ్ఞానం బ్రహ్మ అనెడి వాక్యమందలి ప్రజ్ఞానమనెడి పదమున కిప్పుడు అర్థము తేలినది. ఇకను రెండవపదమైన బ్రహ్మశబ్దమున కేమి అర్థము?

చతుర్ముఖేంద్ర దేవేషు మనుజాశ్వగజాదిషు,
చైతన్య మేకం బ్రహ్మాత్మా ప్రజ్ఞానం బ్రహ్మమేద్యపి.

అనగ చతుర్ముఖుడు మొదలైన దేవతలయందును, మనుష్యులయందును, జంతువుల యందును, సర్వభూతముల యందును అనుశ్రుతమైయే చైతన్యము కలదో ఆ చైతన్యమే బ్రహ్మ మనుపదమునకు లక్ష్యార్థము. ఇకను బ్రహ్మపదమునకు వాచ్యార్థ మేమి? చతుర్ముఖుడు మొదలు సర్వభూతముల వరకు గల సర్వదేహములును వాచ్యార్థము గనుక నివి మాయాకార్యము లని త్రోసివేసి అంతటనుండెడి ప్రజ్ఞానమున కేలక్షణము కలదో, నా దేహమునం దుండెడి ప్రజ్ఞానమునకును అట్టి లక్షణమే కలిగియుండుటచేత ఆ బ్రహ్మమే నే నని నిశ్చయించుకొనవలెను.

ఇకను యజుర్వేదాంతర్గతమగు మహావాక్యము.

## 'అహం బ్రహ్మాస్మి'.

అను వాక్యమును విచారించెదము. దీనిలో మొదటి పదమగు అహం అను దాని అర్థమేమి?

పరిపూర్ణాత్మాస్మి చాహం దేహీ విద్యాధికారిణా
బుద్ధిసాక్షితయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే.

అనగ, సర్వత్ర పరిపూర్ణమైన పరమాత్మ బ్రహ్మ విద్యకు యోగ్యమైన యే శరీరమందు బుద్ధికి సాక్షిగా నుండి అహం అని స్ఫురించుచున్నదో అట్టిదానికి 'అహం' అని అర్థము. ఈ 'అహం' అనునది చైతన్యమని అంటిమేని చైతన్యము నిర్వికారము గనుక 'అహం' అనరాదు. పోనిండు, అహంకారమే యని చెప్పెదమా, అహంకారము జడము గనుక 'అహం' అని తోచనేరదు. కాన చైతన్యమే 'అహం' కారముతో గూడుకొని 'అహం' అని స్ఫురించుచున్నది. కాన జడమై అహంకారమైన వాచ్యమును త్రోసివేసి చైతన్యమాత్రమే 'అహం' పదమునకు అర్థమని తెలియవలెను.

ఇకను బ్రహ్మశబ్దమునకు తాత్పర్యమేమి?

స్వతః పూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దే వినిర్మితః,
అస్మీత్యైక్యం పరామృశ్య తేన బ్రహ్మాత్మనాఽస్మ్యహం.

అనగ స్వతః తానై పరిపూర్ణమై 'పరాత్మయని' బ్రహ్మశబ్దమునకు లక్ష్యార్థము. ఏ కారణమువలన సర్వపరిపూర్ణుడైన ఆత్మ బ్రహ్మమో ఆ కారణమువలన బుద్ధికి

సాక్షియైన నేను బ్రహ్మమునైతిని. ఇకను 'అస్మి'యను పదము ఐక్యమును ప్రతిపాదించుచున్నది.

ఇకను అధర్వణవేదాంతర్గతమైన-

'అయమాత్మా బ్రహ్మ'.

అను మహావాక్యము విచారణకు మిగిలియున్నది. దీనిలో అయం శబ్దమునకు అర్థమేమి? అయంశబ్దమున కర్థము స్వయంప్రకాశమై నిత్యాపరోక్షమై యుండు ఆత్మ అయం శబ్దముచే తెలియబడుచున్నది.

స్వప్రకాశాపరోక్షత్వం అయ మిత్యుక్తితో మతం,
అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతి గీయతే.

అనగ, నహంకారము మొదలు స్థూలదేహపర్యంతము నా యహంకారము, నా దేహము అని యెఱుగుచుండెడి చైతన్యమే ప్రత్యగాత్మ యనబడును. జగదధిష్ఠానభూత మైన బ్రహ్మమే స్వప్రకాశమైన ఆత్మ. ఈ ఆత్మస్వరూపమే తాను. పైనదెల్పిన నాలుగు మహావాక్యములందును "నేనే బ్రహ్మమును, నీవే ఆత్మవు" అని ఋజువు చేయబడినది.

ఆత్మకు అఖండార్థము.

ఆత్మ అఖండస్వరూపుడు, పరిపూర్ణుడును దేశకాలవస్తు పరిచ్ఛేదము లేనివాడును నయియున్నాడు. అయితే ఆత్మకు ఒక్క దేశముచేతనే యపరిచ్ఛిన్నత్వము చెప్పినచో అఖండత్వ మేర్పడదా? కాలముచేతగూడ అపరిచ్ఛిన్నత్వ మొందులకు

చెప్పవలె నను ప్రశ్న వచ్చుచున్నది. ఇందులకుసమాధానమును వినుడు. దేశీయపరిచ్ఛిన్నత్వముచేతనే అఖండత్వ మేర్పడునని చెప్పినచో ఆకాశమునకు దేశముచేత పరిచ్ఛేదము లేదు. గనుక దానికి కూడా అఖండత్వము చెప్పవలసియుండును. ఆకాశము ఉత్పత్తినాశవంతమైయున్నది గనుక నియ్యది కాలముచేత పరిచ్ఛేదము. ఈ కారణముచేత ఆత్మకు దేశము చేతనేగాక కాలముచేతగూడ అపరిచ్ఛిన్నత్వము చెప్పఁబడి నది. అయితే యీ దేశకాలములు రెండును చాలవా? వస్తు పరిచ్ఛేద రాహిత్య మను మూడవది కూడ ఏల అవసరము? అని ప్రశ్న వచ్చుచున్నది. తనచేత తనకు పరిచ్ఛేదము కూడకుండుటచేత, కాలమునకు కాలముచే అపరిచ్ఛిన్నత్వ మున్నది. ఇందువలన కాలమునకు గూడ అఖండత్వము వచ్చి పడును. కాలమున కిట్టి యఖండత్వము నివర్తించుటకై వస్తువుచేత కూడ అపరిచ్ఛిన్నత్వ మనెడి మూడవవిశేషణము ఆత్మకు చెప్పవలసి వచ్చెను. అయితే కాలమునకు వస్తువు చేత అపరిచ్ఛిన్నత్వము లేదా యనిన లేదు. కనుక ఆత్మ యొక్కదానికితప్ప దేశకాలములకు త్రివిధపరిచ్ఛేద శూన్య రూపమగు అఖండత్వము కూడదు. అయితే (1) నేను ఈ భారతదేశమం దున్నాను. అని దేశముచేతను, (2) నేను ఈ ప్రభవసంవత్సరమున పుట్టితిని, అని కాలముచేతను, (3) నేను పృథివిని కాను- అను వస్తువుచేతను ఆత్మ పరిచ్ఛిన్నుడై తోచు చుండగా అతడు త్రివిధపరిచ్ఛేదశూన్యు డని యేల అనవ చ్చును? అయితే పైనదెల్పిన త్రివిధపరిచ్ఛేదములు అధ్యాస

ముచేత వచ్చుచున్నవి. గాని వాస్తవముగ లేవు. కనుక దేహ వ్యతిరిక్తుడైన ఆత్మకు దేశకాలవస్తువులచేత అపరిచ్ఛిన్న త్వము కూడును.

ఇందులకు దృష్టాంతములు కనబరచుచున్నాము.

ఆత్మకు దేశముచేత నపరిచ్ఛిన్నత్వ మెట్లన,

(1) ఘటస్సన్, పటస్సన్, కుడ్యంసత్, పృథివీ సతీ అని భూతభౌతికమైన సమస్థల (దేశ) ములయందును ఆత్మకు అనువృత్తి యున్నది. కనుక ఆత్మ అన్నింట వ్యాపకుడై యున్నాడు. ఈ సర్వవ్యాపకుడైన ఆత్మకు దేశముచేత యపరిచ్ఛిన్నత్వమున్నది. (2) ఇకను కాలముచేత నపరిచ్ఛిన్న త్వ మెట్లన, ఆత్మ యనాదియై యున్నాడు గనుక భూతకాలము చేత నిత్యుడై యున్నాడు. భవిష్యత్కాలముచేతను దేహ వ్యతిరిక్తుడైయున్నాడు. వర్తమానకాలముచేతను ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదు. (3) మఱియు వస్తువుచేత ఆత్మ కపరి చ్ఛిన్నత్వ మెట్లనిన ఆత్మ సర్వాత్మకుడై సర్వవస్తువులయం దున్నాడు గనుక నే వస్తువుచేతను ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదు.

ఖండభేదములు.

ప్రతివస్తువు (a) సజాతీయ,

(b) విజాతీయ,

(c) స్వగత.

భేదములతో గూడియున్నది. ఇందులకు దృష్టాంతము.

a. వృక్షమునకు మఱియొకవృక్షము సజాతీయము.

b. వృక్షమునకు రాయి విజాతీయము.

c. వృక్షమునకు ఆకులు, పువ్వులు, కాయలు, కొమ్మలు స్వగతములు. ఇట్టి సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు ఆత్మకు లేవు. అయితే దేవదత్తాత్మ, చైత్రాత్మ, మైత్రాత్మ అని సజాతీయ భేదంబును, ఘట, పట, కుడ్య కుసూలంబు లని విజాతీయభేదంబులును, ఇచ్ఛా, ద్వేష, సుఖ,దుఃఖ సత్త్వరజస్తమంబు లని స్వగతభేదంబులును ఆత్మకు ఉండగ, సజాతీయ, విజాతీయ, స్వగత భేదంబులు లేవని యెటుల చెప్పవచ్చును - అని ప్రశ్న రావచ్చును. అయితే ఆత్మకు నిట్టి భేదములు ఉపాధిచే వచ్చినవి గాని పరమార్థతః యీ భేదములు లేవని నుడువవచ్చును. ఎట్లన, (a) సజాతీయ భేదము: ఆకాశ మొక్కటియైనను, ఘట,మఠ, కుడ్య,కుసూల, వన, వృక్షాద్యుపాధులచేత ఘటాకాశమనియు, మఠాకాశమనియు, కుడ్యాకాశమనియు, కుసూలాకాశ మనియు అనేకములుగ నెటుల వ్యవహరింపబడుచున్నవో అటులనే ఆత్మ శరీరోపాధులచేత దేవదత్తు డనియు, కృష్ణు డనియు, రాము డనియు అనేకాత్మలుగ తోచుచున్నాడు.

(b) విజాతీయ భేదము.

ఆత్మ సత్తు. ప్రపంచము అసత్తు. కాన ఆత్మకు విజాతీయము ప్రపంచము అయియున్నది. అసత్తైన యీ ప్రపంచమువలన ఆత్మకు శశ విషాణ వంధ్యాపుత్ర గగనారవింద ములవలె విజాతీయభేదము లేదు.

(c) స్వ గ త భే ద ము.

ఇచ్ఛాద్వేషసుఖదుఃఖములు అంతఃకరణవిషయములు కాని ఆత్మగుణములు కావు. ఇందువలన నా యిచ్ఛాద్వేషాది గుణములవలన ఆత్మకు స్వగతభేదమును లేదు. అయితే సత్తు, చిత్తు, ఆనందస్వరూపు డని తెలిపితిరిగదా, సత్తు అనియు, చిత్తనియు, ఆనందమనియు మూడు స్వగతభేదములు కాన్పించుచుండగా, ఆత్మకి భేదములు లేవని యెట్లనియెదరు? అను సంశయము కలుగవచ్చును. అయితే సత్, చిత్, ఆనందములు అన్యోన్యభిన్నములైన పక్షమున నీ వాదము నిలువవచ్చును కాని యీ,

సత్తు, చిత్తు, ఆనందములు అభిన్నములు

అగుటచే, వీనివలన ఆత్మకు భేదము లేదు. అయితే హస్తము, కరము, పాణి అను శబ్దములవలె సత్తు, చిత్తు, ఆనంద మనునవి పర్యాయపదములు కావు. పైగా అయ్యవి శబ్దభేదమును, అర్థభేదమును కలిగియున్నందున వీనికి భేదము లేదని యెట్లు నుడువనగును? ఇందులకు సమాధాన మేమన, ఒక దీపమును జాగ్రత్తగా పరిశీలించి చూడుడు. ఇందులో నేమి యున్నవి? ఎఱుపు, ఉష్ణము, వెలుతురు, ఈ మూడును కలిసి దీప మగుచున్నది. వీనికి లోహితోష్ణప్రకాశము లని పేరు. శబ్దమునందును, అర్థమునందును నియ్యవి భిన్నములుగ కాన్పించుచున్నను, ఈ లోహితోష్ణప్రకాశములు దీపమునకు స్వరూపములై యున్నవి. కనుక నివి పరస్పరభిన్నములు కావు. అట్లనే సత్తు, చిత్తు, ఆనందములు, శబ్దముచేతను, అర్థముచేతను

భిన్నములుగ వ్యవహరింపబడినను, ఆత్మ కయ్యవి స్వరూపము లైయున్నవి గనుక సచ్చిదానందమునకు పరస్పరభేదము లేదు. ఈ సత్తు చిత్తు ఆనందములకు భేదము లేనిసంగతి సత్యమేయైన చో శాస్త్రమునందు ఆత్మ సద్రూపుడని మాత్రమే చెప్పబడి యుండును. అట్లుగాక సత్తు చిత్తు ఆనందస్వరూపుడని మూడు శబ్దము లేల ప్రయోగింపబడవలెను? ఈ మూడిటికిని భేదమే లేకున్న చో అట్లు ప్రయోగింపబడునా? అను శంక కలుగవచ్చును. దీనికి ప్రత్యుత్తరమేమన, ఆత్మనిష్ఠయగు నానందము దుఃఖ రూపమైన పుత్రాదినిష్ఠముగా తోచి జగన్నిష్ఠంబగు అసద్రూపమును, బుద్ధ్యాదినిష్ఠంబగు జడరూపత్వమును, పుత్రభార్యాది నిష్ఠంబగు దుఃఖరూపత్వంబును ఆత్మనిష్ఠమై తోచుచున్నది. అట్టి విపరీతభ్రాంతిని పోగొట్టుటకై ఆత్మ సద్రూపుడు, చిద్రూపుడు, ఆనందస్వరూపుడని చెప్పవలసివచ్చెను. కాని ఆత్మ రూపములగు సత్తు, చిత్తు ఆనందములకు అన్యోన్యభేద ములు చెప్పుటయందు శ్రుతికి తాత్పర్యము లేదు. మఱియు పైన దెల్పిన విపరీతవాదులు మఱియొకవాదంబునకు గడంగు చున్నారు. వారు, ఆత్మ జడస్వరూపుడని యంగీకరించి ఆతనికి సత్తు ధర్మమనియు, చిత్తు ఆనందములు గుణము లనియు వాదించుచున్నారు. కాన తన్నివారణార్థముకూడ ఆత్మ సత్తు చిత్తు ఆనందస్వరూపుడని శ్రుతి చెప్పవలసివచ్చినది. ఆత్మయ నగా నేమో నాఅత్మయనగా నేమో యింతవరకు తెలుపబడి నది. ఇది ఆత్మానాత్మ విచారము. ఈ విచారమువలన సర్వ

దుఃఖనివారణహేతు వగు వివేక ముదయించవలసియున్నది. ఇదియే ఆత్మానాత్మవివేకము.

ఆత్మకు పురుషు డనియు, అనాత్మకు ప్రకృతియనియు పేరు గలదు. ఈ ప్రకృతిపురుషులు అనాదులు. వీరి తాదాత్మ్య సంబంధమును అనాదియే. అనగా ఒకరి ధర్మమును మఱియొకరిమీద నారోపించుకొనుట. దీనికే అధ్యారోపము లేక అధ్యాసము అని పేర్లు. శుక్తియందు రజతాధ్యారోపము, రజ్జువునందు సర్పాధ్యారోపము స్థాణువునందు పురుషాధ్యారోపము, మరుమరీచికలందు జలాధ్యారోపము, ఆకాశమునందు నీలత్వపీతత్వాధ్యారోపము- ఇవి అధ్యారోపమునకు దృష్టాంతములు. అటులనే నిష్ప్రపంచస్వరూపుడైన ఆత్మయందు అనాత్మయగు ప్రపంచముయొక్క ఆరోపము అధ్యారోప మనబడును. ఆత్మ క్షేత్రజ్ఞుడును, అనాత్మ క్షేత్రమును అయియున్నారు. ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే ఆత్మానాత్మవివేక మని చెప్పబడుచున్నది. ఇదియే ఉత్తమమైన జ్ఞానము. ఎట్లన,

క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్త ద్జ్ఞానం మతం మమ

అనగ, యీ శరీరముయొక్కయు, యీ శరీరమందున్న ఆత్మయొక్కయు, ఈ యుభయులయొక్క సంబంధమును తెల్పునట్టి జ్ఞాన మేదిగలదో అదియే జ్ఞానమని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించియున్నారు. ప్రకృతిసంబంధమైన క్షేత్రము భోగ్యము, అనగా అనుభవింపబడునది. పురుషసంబంధమైన క్షేత్రజ్ఞుడు భోక్త అనగ అనుభవించువాడు. కార్య

కారణ హేతుఫల స్వరూపములుగ పరిణమించినదియు, భోగ్యము అయిన యీ ప్రకృతితో భోక్తయైన యీ పురుషునకు అవిద్యారూపమగు సంపర్కము (అభిమానము) ఎప్పుడు కలుగునో అప్పుడే సంసార మేర్పడును. సంసార మనగా సుఖదుఃఖానుభవము. అయితే ప్రకృతి జడము గాన దీనికి కర్తృత్వము తటస్థింపదు. పురుషుడు నిర్వికారియు అసంగుడును, కాన వీనికి భోక్తృత్వము తటస్థింపదు. కాని పురుషుని సన్నిధానమున ప్రకృతికి కర్తృత్వమును, ప్రకృతియొక్క సంయోగమువలన పురుషునకు భోక్తృత్వమును కలుగ గలదు. ఎట్లన,

యథాహి కేవలో రక్త స్స్ఫటికో లక్ష్యతే జనైః,
రంజకాద్యుపధానేన తథాఽసౌ పురుషోపిచ.

అనగా, జపాకుసుమాది రక్తద్రవ్య సంపర్కమువలన స్వచ్ఛమైన స్ఫటికమణి రక్తత నొందినట్లు, నిర్మలుడగు ఆత్మ మలినప్రకృతిసంస్కారమువలన తచ్ఛాయాపన్నమై అందలి సుఖదుఃఖములకు తానే భోక్తననియు, దానిచే చేయబడు కార్యములకు తానే కర్తననియు తలంచుచుండును. ఇట్లు తలంచుటయే అజ్ఞాన మనబడును. ప్రకృతిపురుషులయొక్క యథార్థజ్ఞానము తెలియనిదే అనాదియైన యీ అజ్ఞానము నశింపదు. ప్రకృతి పురుషుల సంబంధము పంగ్వంధ సంబంధమువంటి దని చెప్పబడుచున్నది. ఎట్లన,

పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య,
పంగ్వంధవ దుభయోరపి సంబంధ స్తత్కృత స్సర్గః.

అనగ, గుడ్డివానికి కుంటివాడు తోడై ఉభయులును తమతమ కార్యములు నెఱవేర్చుకొనినట్లు, పురుషుని మోక్షమునకై ప్రధానము (ప్రకృతి) సహాయపడుచున్నది. ప్రకృతి పురుష మోక్షముకొఱకు ప్రవర్తించుట న్యాయమేకాని తుదకు ఈ ప్రకృతి తొలగిపోవు టెట్లు అని శంక కలుగుచున్నది. ఇందులకు సమాధాన మేమన, భర్తృదృష్టదోషయగు స్వైరిణి మరల భర్తృసన్నిధికి రాజాలనిభంగి, మఱియు సభయందు నాట్యము చేసిన నర్తకి కృతార్థురాలై సభను విడిచి పోవుచందమునను, ప్రకృతియు పురుషునిచే చూడబడినదై నివర్తించును. ఎట్లన,

రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథానృత్యాత్,
పురుషస్య తథాఽఽత్మానం ప్రకాశ్య నివర్తతే ప్రకృతిః.

ఈ ప్రమాణము పై అర్థమును స్పష్టపరచుచున్నది. అయితే అచేతనమగు ప్రధానము మహదాదికార్యముల నెట్లు చేయ సమర్థ మగును అను ప్రశ్నకు సమాధానమును వినుడు.

వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తి రజ్ఞస్య,
పురుషవిమోక్షనిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య.

అనగ జడపదార్థమగు క్షీరము శిశువృద్ధికొఱకు ఎట్లు మాతృస్తనమందు యుక్తకాలములో ప్రవర్తించునో అట్లే అచేతనమగు ప్రకృతి చేతనాధిష్ఠితమై పురుషునియొక్క మోక్షముకొఱకు ప్రవర్తించుచున్నది. ప్రకృతిస్థత్వము అనెడి అవిద్యాగుణములయందు సంగమమే సంసారము, అనగా

సదసద్యోనిజన్మములకు కారణము. కాన అట్టి సంగమును నివర్తింపచేసికొనవలసియున్నారు.

ఉపద్రష్టానుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః.

అనగ, పురుషుడీశరీరమునం దుండినను, ఆతడు శరీరమునకంటె అన్యుడును, సాక్షియు, తటస్థుడును, భర్తవలెను భోక్తవలెను తోచువాడును, ఆత్మయును పరమాత్మయునుగా చెప్పబడుచున్నాడు అని అర్థము. ఇట్లు తెలుసుకొనుటయే సంసారవిముక్తి. ఎట్లన,

య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ
సర్వథా వర్తమానోపి నస భూయోపి జాయతే.

అనగ, పైన దెల్పిన ప్రకారము పురుషుని, గుణములతో గూడిన ప్రకృతిని ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడు ఎట్లున్నను వానికి తిరిగి సంసారము లేదు. మఱియు,

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మంతరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాంతి తే పరం.

అనగ, స్వానుభవజ్ఞానదృష్టితో ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క పరస్పరభేదమును, మూలావిద్యనుండి నివృత్తియగు సదుపాయమును ఎవరు తెలిసికొనుచున్నారో, వారు మోక్షము నొందుచున్నారు. ఇదియే క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానము. ఇదియే ప్రకృతిపురుషుల జ్ఞానము. ఇదియే ఆత్మానాత్మవిచారమువలన కలిగిన వివేకము. ఇదియే తత్త్వబోధ. ఈ తత్త్వబోధవలన సంసారమూలాజ్ఞానము నశించి

మోక్షము కలుగుట నిశ్చయమైనను, దీనికి వైరాగ్యమును ఉపరతియు మిక్కిలి సహాయపడును.

వైరాగ్యబోధోపరతులు.

"వైరాగ్యబోధో పరమా స్సహాయా స్తే పరస్పరం

అనగ, వైరాగ్యము, బోధ, ఉపరతి యీ మూడును ఒకటి కొకటి సహాయభూతముగా నొప్పుచున్నవి. అని యర్థము.

వైరాగ్యమనగానేమి?

ఇహాస్మి న్లోకే దేహధారణవ్యతిరిక్తవిషయేషు సక్చందనవనితాదిషు వాంతాశనమూత్రపురీషాదౌ యథా ఇచ్ఛా నాస్తి, తథా ఇచ్ఛారాహిత్యం ఇహలోకఫలభోగవిరాగః. అముత్ర స్వర్గలోకాన్తర్వర్తిషు రంభాసంభోగాదివిషయేషు తద్వదిచ్ఛారాహిత్యం.

అనగ ఈ లోకమందు దేహమును నిలుపుకొనుటకంటె అన్యమైన విషయభోగములయందు, తక్కిన అన్నము నందును, మూత్రపురీషములందును కోరిక లేనట్లు కోరిక లేకయుండుట. ఇది యీ లోకభోగములయందలి విరాగము. ఇకను రంభాసంభోగాది స్వర్గలోకభోగములయందు సైతము పైన దెల్పినప్రకారము కోరిక లేకయుండుట పరలోకభోగములయందలి వైరాగ్యము అనబడును.

ఇకను ఉపరతి అనగా నేమి? మనస్సును ఇంద్రియములను విషయములనుండిమరలించి నిర్విషయమునందుంచుట. శమ, దమ, ఉపరతి, సమాధానము, ఈ నాలుగును చేరి

ఉపరతి యగుచున్నవి. వీనిలో శమ మనగ అంతరింద్రియ నిగ్రహము. అంతరింద్రియ మనగ మనస్సు. దీనిని శ్రవణాది వ్యతిరిక్తవిషయములనుండి నివృత్తిచేయుట. దమ మనగ బాహ్యేంద్రియములను శ్రవణాదులయందు వర్తింపజేయుట. ఉపరతి అనగ, అంతరింద్రియ బాహ్యేంద్రియములను శ్రవణాదులయందే వర్తింపజేయుట. ఇకను సమాధాన మనగ,

> శ్రవణాదిషు వర్తమానం మనః వాసనావశాత్ విషయేషుగచ్ఛతి యదా యదా తదా తదా దోషదృష్ట్యా తేషు తేషు మనః ప్రత్యావర్తనమ్.

అనగ, శ్రవణాదులయందు వర్తించుచున్న మనస్సు వాసనాబలముచేత విషయములయందు సంచరించుటకు పోయినపు డెల్ల విషయములయందలి దోషమును దానికి చూపి, ఆమనస్సును తిరిగి శ్రవణాదులయందు ప్రవర్తింపజేయుట సమాధాన మనబడును. కాన శమ, దమ, ఉపరతి, సమాధానములు మనస్సును నిర్విషయము చేయుటనుగూర్చి బోధించుచున్నవి.

ప్రప్రథమమున "నేను ఆత్మ స్వరూపుడను" అను తత్త్వబోధ కలుగుటకు హేతు వేమి? ఇందుకు శ్రవణ మనన నిదిధ్యాసలే కారణము. శ్రవణమనగా, సమస్తవేదాంతములకును ఆత్మయందే తాత్పర్య మని బుద్ధియొక్క నిశ్చయము. శ్రుత్యర్థమును విని, ఆ యర్థమును యుక్తులచేతను, ఏక వాక్యముచేతను చింతించుట మనన మనబడును. విజాతీయములైన కామక్రోధాదులను విడిచి,సజాతీయమైన అహం బ్రహ్మాస్మి

యని నిరంతరము చింతించుట నిదిధ్యాస మనబడును. శ్రవణమువలన సంశయము నశించును. మననము అసంభావమును పోగొట్టును నిదిధ్యాసమువలన విపరీతభావము పోవును. ఇట్టి శ్రవణమనననిదిధ్యాసలు తత్త్వబోధకు హేతువు లగుచున్నవి. ఈ బోధయొక్క స్వరూప మేమి? కూటస్థుడగు తనకును, మిధ్యలగు అహంకారాది దేహాంతమువరకు గల భేదమును గ్రహించుట బోధయొక్క స్వరూపము. ఇకను బోధయొక్కకార్యము (ఫలితము) ఏమి? ఆత్మకును, దేహమునకును తిరిగి అన్యోన్యాధ్యాస కలుగకుండుటయే బోధయొక్క కార్యము.

ఇట్లు తత్త్వబోధయొక్క (1) హేతువు, (2) స్వరూపము, (3) కార్యము అను విషయములను గూర్చి విచారించితిమి. అటులనే వైరాగ్యమురొయొక్క హేతు స్వరూప కార్యములను గూర్చి విచారించెదము. (1) సమస్త విషయములను వాంత్యశనమువలె వదలవలయు నని తోచుట వైరాగ్యమునకు హేతువు. (2) ఈ విషయాదులయందు వృత్తి కలుగక యుండుట వైరాగ్యముయొక్క స్వరూపము. (3) వదలి వేసిన ఆ విషయములయందు తిరిగి ఆసక్తి పుట్టకయుండుట వైరాగ్యము యొక్క కార్యము. ఇకను ఉపరతి యొక్క హేతు స్వరూపకార్యము లేవియన, (1) యమనియమాదులు ఉపరతియొక్క హేతువు. (2) చిత్తవృత్తినిరోధము ఉపరతి యొక్క స్వరూపము. (3) సర్వవ్యవహారనాశము ఉపరతి యొక్క కార్యము.

ఈ విధముగ వైరాగ్యబోధోపరతులకు హేతుస్వరూప కార్యములు తెలుప బడినవి. వైరాగ్య బోధోపరతులు మూడును కలిసి మోక్షమునకు కారణంబు లయ్యెను, వీనిలో తత్త్వబోధయే ప్రధానమై యున్నది. ఎట్లన,

తత్త్వబోధః ప్రధానం స్యాత్ సాక్షాన్మోక్షప్రదత్వతః,
బోధోపకారిణా వేతౌ వైరాగ్యోపరమౌ శుభౌ.

అనగ, మోక్షమునకు తత్త్వబోధ ప్రధానకారణము. వైరాగ్యోపరతులు రెండును బోధకు సాధనంబులును సహకారులును అయి యున్నవి. ఈ మూడును ఎవరికి గలవో అట్టి పురుషునకు మహత్తైన తపఃఫలము కలుగును. కాని వైరాగ్యోపరతులు పూర్ణముగ నుండియు, బోధలేని వానికి పుణ్యలోకప్రాప్తి కలుగునేకాని ముక్తి రానేరదు. అయితే బోధమాత్రము కలిగి వైరాగ్యోపరతులు లేనివానికి ముక్తి కలుగును గాని ప్రత్యక్షదుఃఖము పోనేరదు.

ఇకను యీవైరాగ్యబోధోపరతులకు అవధి యేది యని విచారింపవలసియున్నాము. (1) బ్రహ్మలోక తృణీకారము వచ్చు పర్యంతము వైరాగ్యమునకు అవధియని చెప్పబడుచున్నది. (2) అజ్ఞాన కాలమందు దేహేంద్రియాగిసంఘాతము నేను అని నిశ్చయమెట్లు కలుగుచున్నదో అట్లు అవి తోచకయే ఆత్మస్వరూపంబు నేను అను దృఢనిశ్చయము వచ్చు పర్యంతము బోధకు అవధి అని చెప్పబడుచున్నది. (3) సుషుప్తి యందువలె జాగ్రత్తయందును సమస్తవిషయములను మరచి

యుండుట యెప్పుడు సిద్ధించునో అంతపర్యంతము ఉపరతికి అవధి యని చెప్పబడును. ఎట్లన.

బ్రహ్మలోక తృణీకారో వైరాగ్యస్యావధి ర్మతః,
దేహాత్మత్వ వత్పరాత్మత్వదార్ఢ్యే బోధ స్సమాప్యతే,
సుప్తివ ద్విస్మృతి స్సీమా భవే దుపరమస్య హి.

అనగ, బ్రహ్మలోకమును గడ్డిపరకవలె నిష్ప్రయోజనముగ తలచుట వైరాగ్యమునకు హద్దు. నేను దేహము అనెడి జ్ఞానమువలె నేను పరమాత్మను అనెడి స్థిరజ్ఞానము కల్గునప్పుడే బోధ పరిపూర్తత్వము నొందును. మరియు సుషుప్తియందువలె సర్వవ్యవహారసంక్షయమును బొందియుండుట ఉపరతికి అవధి యగును. ఈ విచారణవలన ఫలమేమి తేలినది?

జగ చ్చిత్రం స్వచైతన్యే పటే చిత్ర మి వార్పితం,
మాయయా తదుపేక్ష్యైవ చైతన్యే పరిశేష్యతాం.

అనగ వస్త్రమునందు రంగులతో బొమ్మలు కల్పించబడినట్లు పరమాత్మయగు తనయందు చిత్రరూపమువంటి జగంబు మాయచే కల్పింపబడియున్నది. కనుక ఆ మాయామయమైన జగంబును మిథ్యయని యుపేక్షచేసిన యెడల అద్వితీయమగు పరమాత్మ చైతన్యమైన తా నొక్కడే సత్యమై మిగులుచున్నాడు అని అర్థము. ఇట్లు సత్యమైన బ్రహ్మము తానై యుండగ ఆ సంగతిని మరచి జన్మమృత్యుజరావ్యాధులకు లోనై యున్న యీ పాంచభౌతిక దేహమే తానని భ్రమ చెందుటవలన ప్రతివానికిని,

మరణభయము

కలుగుట తటస్థించుచున్నది. ఆత్మయగుతాను నాశములేనివాడు. అట్లైనయెడల తన్ను నాశ మొనర్చువా డెవడుండును?

అవినాశి తు త ద్విద్ధి యేన సర్వ మిదం తతం।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హసి॥

అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించియుండెను. దీని యర్థమేమి? ప్రపంచ మంతటను నిండియున్నట్టి యీ ఆత్మ తనకు తాను నశించుస్వభావము కలది కాదు. అన్యులచే నశింప చేయబడదగినదియు కాదు అని అర్థము. మఱియు నీ ఆత్మ ఒకరిని చంపునదికాదు. ఒకరిచే చంపబడునది కాదు ఎట్లన,

య ఏనం వేత్తి హన్తారం య శ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే.

అనగ, ఎవడు ఈ ఆత్మను చంపునట్టివానినిగ తెలుసుకొనునో, ఎవడు ఈ ఆత్మ చంపబడినవానినిగ తలంచునో వారిరువురును వాస్తవ మెరిగినవారు కారు అని అర్థము. ఏలయన, పుట్టిన వస్తువునకు చావును, చచ్చినవస్తువునకు పుట్టుకయు కలవుగాని, చావుపుట్టుకలు లేని యీ ఆత్మ నిత్యుడై స్థిరముగ నున్నాడు.

"న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః

అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

అనగ పైనదెల్పిన ఆత్మ ఎప్పుడును పుట్టినవాడు కాడు. ఎప్పుడును చచ్చునట్టివాడును కాడు. ఇదివరకు లేకుండి, యిక ముందు లేకుండువాడు కాడు. ఆతడు పుట్టుక, నాశము లేని స్థిరరూపుడు. అనాదియైనవాడు. దేహము అనేకవిధములుగ మారుచున్నను, ఆతడు మార్పబడడు అని అర్థము. మఱియు నీ ఆత్మను అస్త్ర శస్త్రములు మొదలగు మారణ సామగ్రి యేమియు చేయజాలవు. ఎట్లన,

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః.

అనగ, ఆయుధము లీతనిని ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. ఉదకములు తడుపజాలవు. వాయువు ఎండింపజాలదు అని యర్థము. ఏల ననగా ఈతడు ఆద్యంతములు లేనివాడు అయితే ప్రపంచమునందు మనుష్యులు చనిపోవుచుండుటయు, వీరికై బంధుమిత్రాదులు దుఃఖపడుటయు మనము కనులార కనుచున్నాముగదా. ఇందుకు వ్యతిరేకముగ మనుష్యుడు మరణించుట లేదని చెప్పువాక్యము లెట్లు విశ్వాసార్హములగును ? అను ప్రశ్న రావచ్చును. దీనికి సమాధాన మేమన, మరణము అనునది ఆత్మను కప్పియుండు శరీరమునకేగాని, ఆత్మకు గాదని తెలుసుకొనవలసియున్నాము. ఎట్లన,

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశనో ౽ప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత.

అని అర్జునునకు శ్రీకృష్ణస్వామి కావించిన యుపదేశమును గమనింపవలసియున్నాము. అనగ నిత్యుడును, నాశరహితుడునైన యీ ఆత్మయొక్క శరీరములు నశించిపోవునట్టివని యర్థము. దేహమునకు బాల్యము, యౌవనము, ముదిమియు ఎట్లు సహజమో అట్లే మరణముకూడ సహజము. ఎట్లన,

దేహినో౽స్మి న్యధా దేహే కౌమారం యౌవనం జరా
తధా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.

అనగ దేహాభిమానియగు జీవునకు బాల్యము, యౌవనము, ముదిమి, యీమూడును ఏలాగున క్రమముగ వచ్చుచున్నవో అట్లనే ఆతడు మరియొక శరీరము పొందుటయును తటస్థించుచున్నది. కాన నీ విషయమై జ్ఞానియైనవాడు మోహము చెందడు అని అర్థము. ఇటిస్థితిలో మరణకాలమునందు శరీరమును విడుచుట కెవ్వరైన వెనుకాడుదురా? శరీరము మన కొక పనిముట్టువంటిది. పనిముట్టు చెడిపోయినట్లయిన దానితో పనిచేయబూనుట నిరర్థకమేగదా! పైగా అట్టి దానితో చేయబడిన కార్యమంతయు ఖరాబుగానే యుండును. వ్రాతవ్రాయు గుమాస్తా చిట్లిపోయిన పాళీగల కలముతో ఎంతకాలము వ్రాయగలడు? ఒకవేళ మొండివేసి వ్రాసినను, ఆ వ్రాత రమణీయముగ నుండజాలదు. అట్లనే వార్ధక్యముచేతను, రోగములచేతను, శిధిలమైపోయిన అంగములు గల

శరీరముతో జీవయాత్ర చేయుట దుర్లభము. ఆ స్థితియందు ఆశరీరము వానికి ప్రతిబంధకముగ నుండునే కాని ప్రయోజనకారి గాదు. అప్పు డా దేహధారి యేమి చేయును? శిథిలమై, నిష్ప్రయోజనమైన యా ప్రాతశరీరమును విడిచి, నూతనమై ప్రయోజనకారియైన మరియొకశరీరమును ధరించుటకు ఇష్టపడుచుండును గదా! దేహికి మరణము సంభవించుట యనగ నిదియే అర్థము. ఈభావమునే శ్రీకృష్ణభగవానుడు తన శిష్యున కిట్లు బోధించియుండెను.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ.

అనగ, మనుష్యుడు ఏలాగున చినిగిపోయిన వస్త్రములను విడిచి క్రొత్తవి అన్యములునగు వస్త్రములను స్వీకరించుచున్నాడో, ఆ లాగుననే ఆత్మ శిథిలమైనదేహములను విడచి క్రొత్తవియు, ఇతరములు నగు దేహములను బొందుచున్నాడు. మరణకాలమునందు మనమీద జరుగుమార్పు ఇంతకంటె వేరు లేదని మనకు నిశ్చయజ్ఞానము కలిగినయెడల మరణమొకదుఃఖకారణ మగుటకు బదులు సంతోషహేతువే కాగలదని నుడువవచ్చును. జన్మమెత్తిన ప్రతివారికిని దేహమును విడుచుట స్వభావసిద్ధమైనకార్యమై యున్నది. ఎట్లన,

మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహజాయతే,
అద్య వాఽబ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః.
దేహే పంచత్వ మాపన్నే దేహీ కర్మానుగోఽవశః,
దేహాన్తర మనుప్రాప్య ప్రాక్తనం త్యజతే వపుః.

అనగ, జన్మము నెత్తినవానికి మృత్యువు దేహముతో కూడ పుట్టుచున్నది. అట్టివానికి నేడుగాని లేక నూరుసంవత్సరములకు పిమ్మటగాని మృత్యువు తటస్థించుట నిశ్చయము. జీవుడు తా నిదివరకు చేసియుండిన కర్మము ననుసరించి మరణము సంప్రాప్తముకాగా, ఆతడు అప్పుడు నూతనదేహము నొందగోరి తన ప్రాతదేహమును వదలుచున్నాడు అని దీని యర్థము. నీడ దేహము ననుసరించియుండునట్లు, మృత్యువు జన్మమువెంట తిరుగాడుచుండును.

ప్రపంచమునందు ఆశ్చర్యమైన విషయ మేదియని యక్షుడు ధర్మరాజును ప్రశ్నింపగ ఆయన యిట్లు బదులు చెప్పెను.

అహ న్యహని భూతాని గచ్ఛంతీహ యమాలయే,
శేషాః స్థిరత్వ మిచ్ఛన్తి కి మాశ్చర్య మతఃపరమ్.

అనగ ప్రతిదినము తన కండ్లయెదుట అనేకులు మృతి నొందుచుండుట చూచియు, ఇంకను శేషించియుండిన తాను మాత్రము మృతినొందక స్థిరముగ నుండెదనని ప్రతివాడును భావించుచున్నాడు. ఇంతకన్న లోకములో ఆశ్చర్య మేమియున్నది అని దీని యర్థము. దేహము నిత్యము కాదు. దేహమును ధరించియున్న దేహియే నిత్యుడై యున్నాడు. ఇట్టి స్థితిలో నశించిపోవునట్టి యీ దేహమును గూర్చి దుఃఖపడరాదని భగవద్గీత బహుభంగుల బోధించుచున్నది. ఇట్టి మరణభయమును శోకమోహములును అర్జునునివంటి భక్తునే బాధించియుండగ, అజ్ఞానులమైన మనలను

అయ్యవి బాధింపజాలవనుట విపరీతము. మహాభారతయుద్ధారంభమున అర్జునుడు యుద్ధసన్నద్ధుడై ఉభయసేనల మధ్యను నిలిచియుండగ యుద్ధములో తన పక్షమువారును, ఎదుటి పక్షమువారును అనేకులు మృతినొందెదరుగదా యను చిత్తవృత్తియందు ఆతడు తగుల్కొని తన కర్తవ్యమును మరచిపోయినవాడయ్యెను. ఎట్లన,

ఏవముక్త్వా ఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః.

అనగ, అర్జునుడు దుఃఖముచే చలించిన మనస్సు గలవాడై బాణముతో కూడిన ధనుస్సును క్రింద బడవైచి రథముపై చదికిలబడెను అనియర్థము. చూచితిరా! మరణభయము తటస్థించినప్పుడు ప్రతివానికిని నిట్టి స్థితియే కలుగునుగదా! చనిపోయిన తమబిడ్డలను గూర్చియు, భార్యాభర్తలను గూర్చియు, బంధుమిత్ర ఆప్తజనులను గూర్చియు ప్రతివారును విచారగ్రస్తులై యుండుటేగాక ఆవిచారమువలన అన్నపానాదులను వర్జించి వ్యాధిగ్రస్తులై తుదకు వీరిలో కొందరకు పిచ్చియెత్తి మరణము పాలగుచుండుట లోకములో నెన్ని తావుల సంభవించుచున్నదో మనకు తెలియనిదికాదు. తుదకు చక్రవర్తులకు మాత్రము చావు తప్పినదా? ధనవంతులు గానిండు, దరిద్రులుగానిండు, సుందరశరీరులుగానిండు, అందవిహీనులుగానిండు, బలవంతులు గానిండు, బలహీనులుగానిండు, ధైర్యవంతులు గానిండు పిఱికిపందలు కానిండు, తుదకుజ్ఞానులు కానిండు, అజ్ఞానులు గానిండు, వారి వారికి ఇహలోక కర్మబంధములు

తీరిపోగానే మృత్యువు సిద్ధమేగదా! తుదకు ఔషధముల నిచ్చి అన్యులను బ్రతికింపదలంచు డాక్టర్లుగూడ కాల మాసన్న మగుసరికి యమపురికి ప్రయాణము కట్టవలసినదేకదా! అలనాడు పరీక్షున్మహారాజు తనకు ఏడు దినములలో మృత్యువు రానున్నదని తెలిసి దానిని తప్పించుకొనుటకు వాని మంత్రులును ప్రజలును సర్వప్రయత్నములు చేసియు, తుదకు మృత్యువును వారింపగలిగియుండిరా?

ఇట్లు సర్వభూతములను నాశమొనర్చు మృత్యువు కాలస్వరూపుడైన పరమాత్మయేగాక మఱియెవరు?

కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో,
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః...

అని భగవానుడు లోకముల నన్నింటిని నాశముచేయు కాలుడు తానే నని పలికి యున్నాడు. ఇట్టి కాలకర్మమునకు లోబడనివా రెవ రుందురు? తుదకు బ్రహ్మ, విష్ణు, రుద్రులగు త్రిమూర్తులకుకూడ చావు తప్పినది కాదు అని తెలిసినప్పుడు ఇకను అవతారపురుషుల మాటయేమి? జీవుల మాట యేమి? అని వితర్కించి ప్రయోజనము లేదు. ఇట్టి స్థితిలో అల్పులైన మానవులు తమకు మృత్యువాసన్న మైనప్పుడు, తాము గాని, తమ బంధువులు గాని యేదేని చేయగలిగిన దేమైన నుండునా?

సీ॥ బహువిధముల రేయిఁ బవలు దుఃఖించిన
వత్తురే మృతులైనవారు మగిడి

తలక్రిందుగా నిల్చి తపము చేసినగాని
వత్తురే మృతులైనవారు మగిడి
భ్రాంతిఁ దెలియలేక పడి పల్వరించిన
వత్తురే మృతులైనవారు మగిడి
చిరకాలమున నాత్మఁ జింతింపుచుండిన
వత్తురే మృతులైనవారు మగిడి

గీ॥ యేల శోకింపఁ బ్రాణంబు లెవ్వరికిని
నిత్యములు గావు, ధర్మంబు నిత్య మరయ,
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ!

అని యొక భక్తుడు భగవంతునితో మొఱబెట్టుకొని యున్నాడు. ఇయ్యది సత్యము-ముమ్మాటికిని సత్యము. అనిత్యమైన యీ శరీరమును గూర్చి మోహపడి నిత్యవస్తువును గూర్చి జనులు తమ ప్రయత్నమును మానుచున్నారు.

"శీర్యతే ఇతి శరీరం"

అనగ, చినిగిపోవునది గనుక దీనికి శరీర మని పేరు వచ్చినది. చినిగిపోవు నీ శరీరములోపల నేమి యున్నదో ఒకపర్యాయము తెలిసిన దీనిపైగల భ్రాంతి వదలగలడు.

సీ॥ మలమూత్రముల కెల్ల నిలయంబు దేహంబు
కలశంబు రక్తశుక్లముల కెల్ల
శల్యకేశోద్భవస్థానంబు దేహంబు
పిశితమేదస్సుల పెంటపట్టు

వాతపైత్య శ్లేష్మవాసంబు దేహంబు
బహురోగవితతికిఁ బట్టుకొమ్మ
మొగి రోఁతలకు నెల్ల మూలంబు దేహంబు
అతికష్టవితతికి నాలయంబు
గీ॥ నైన తమమేను సత మని యాత్మ నమ్మి
నిన్ను సేవింపనేరక నీచు లైరి
ప్రణుతధవళాంగ! మానిహృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ!

అయితే చినిగిపోవునది గనుక శరీర మని పేరుపెట్టుట యుక్తమేగాని దీనిని దేహమనికూడ వాడుకలో చెప్పుచుండి రిగదా! అప్పు డిది అనిత్యమైనదని యెట్లు చెప్పగలము? అని కొందరు ప్రశ్నించెదరు. ఇందులకు సమాధాన మేమన,

"దహ్యతే ఇతిదేహః"

అనగ నిది కాలిపోవునది గనుక దేహము అని అర్థము. కాన ఇది యెందులకును పనికిరానివస్తు వని తేలినది. ఇట్టి దానికై విలపించుట తగదు. ఏలయన,

సీ॥ పచ్చిచర్మపుతిత్తి పసలేదు దేహంబు
లోపల నంతట రోఁత ఘనము
నరములు శల్యముల్ నవరంధ్రములు రక్త
మాంసంబు కండలు మైలతిత్తి
బలువైన యెండవానల కోర్వ దింతైనఁ
దాళలే దాకలిదాహములకు

సకలరోగావస్థలకు స్థానమై యుండు
నిలువ దస్థిరమైన నీటిబుగ్గ
గీ॥ బొందిలోనుండి ప్రాణముల్ పోయినంతఁ
గాటికేగాని కొఱగాదు గవ్వకైన
భూమణవికాస! శ్రీధర్మపురనివాస!
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

కాన చినిగిపోవునట్టియు, కాలిపోవునట్టియు ఈదేహమునకై శోకింపవల దని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించి ఆతని దుఃఖమును శాంతింపజేయగలిగెను. కాన మరణశోకమునందు తగుల్కొని కృశించుచున్న మన మందరము అట్టి బోధను గ్రహించి శాంతచిత్తుల మగుదుముగాక!

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః.

అనగ, 'ఓ అర్జునా! నీవు దుఃఖింప తగనివారిని గూర్చి దుఃఖించుచున్నావు. పైగా పండితులు వచించు పలుకులను మాట్లాడుచున్నావు. మృతినొందినవారినిగూర్చియు, జీవించి యున్నవారినిగూర్చియు తెలిసినవా రిట్లు దుఃఖింపరు' అని అర్థము. ఎవరినిగూర్చి మానవు లిట్లు దుఃఖపడుచున్నారో, వారు జన్మమృత్యువికారములు లేనివారు. ఎట్లన,

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

అనగ, 'ఆత్మ ఇంద్రియములకును, మనస్సునకును అగోచరుడు. వికారములు లేనివాడు. ఇట్టి ఆత్మ నెఱిగి దుఃఖించుటకు తగవు' అని యర్థము. కాని యీ ఆత్మ నిత్యుడుగాక ఎల్లప్పుడు పుట్టుచును, ఎల్లప్పుడు నశించుచున్నవానిగా కొందరు తలంచవచ్చును. అట్లైన,

అథ చైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతం,
తథాపి త్వం మహాబాహో! నైనం శోచితు మర్హసి.

అనగ, 'ఒకప్పుడు ఈ ఆత్మను ఎల్లప్పుడు పుట్టుచున్నవానిగను, ఎల్లప్పుడు నశించుచున్నవానిగను తలంతువేమో, అట్లైనను ఓ అర్జునా! ఇక నీవు దీనినిగూర్చి దుఃఖించుటకు తగవు' అని అర్థము. తప్పింప శక్యముగానిదానిని గూర్చి చింతించుట తగదుగదా!

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

అనగ, 'ఏ కారణమువలన పుట్టినవానికి చావు నిశ్చయమో, చచ్చినవానికి పుట్టుక నిశ్చయమో, ఆ కారణము వలన తప్పింప శక్యముకానిదానినిగూర్చి నీవు దుఃఖించుటకు తగవు' అని అర్థము. మఱియు నీ శరీరములు జన్మమునకుపూర్వము లేవు. మరణానంతరమును లేవు. ఇకను మధ్యలో మాత్ర మెట్లుండును?

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరివేదనా.

అనగ, 'ఓ యర్జునా! శరీరములు జన్మమునకు ముందు అవ్యక్తమైన మాయనుండి వచ్చినవి. చనిపోయిన పిమ్మట అయ్యవి ఆ మాయలోనికే పోయినవి. అయితే యీ మధ్య కాలములో మాత్రము పుత్రమిత్రాదినామరూపములుగల విగా కాన్పించుచున్నవి. ఇట్టి శరీరములవిషయమై నీవు దుఃఖింప తగవు.' ఏలయన,

యన్నాదౌ యచ్చ నాన్త్యంతే తన్మధ్యే భాత మప్యసత్,
అతో మిథ్యా జగత్సర్వ మితి వేదాన్త డిండిమః.

అనగ 'ఏది ఆదియందు లేదో, ఏది అంతమందును లేదో అది మధ్యమందు కాన్పించినను, లేనిదానితో సమానమే. కావున ని దేహాదు లన్నియు మిథ్య' యని అర్థము. మఱియు శరీరములు ఋణసంబంధములై యున్నవి. ఈ లోకమున ఋణము తీరగనే అయ్యవి నశించిపోవును.

ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాదయః,
ఋణక్షయే క్షయం యాన్తి కా తత్ర పరివేదనా.

అనగ. 'లోకములో భార్యాభర్తృ సంబంధములును, పశుపుత్రాదిసంబంధములును, ఋణ సంబంధమువలన కలుగుచున్నవి. అట్టికర్మ ఋణము తీరగనే భార్యాపుత్రాది సంబంధములు తెగిపోవుచున్నవి' అని అర్థము. మఱియు,

హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే.

అనగ, 'ఆత్మ ఇంద్రియములకును, మనస్సునకును అగోచరుడు. వికారములు లేనివాడు. ఇట్టి ఆత్మ నెఱిగి దుఃఖించుటకు తగవు' అని యర్థము. కాని యీ ఆత్మ నిత్యుడుగాక ఎల్లప్పుడు పుట్టుచును, ఎల్లప్పుడు నశించుచున్నవానిగా కొందరు తలంచవచ్చును. అట్లైన,

అథ చైనం నిత్యజాతం నిత్యంవా మన్యసే మృతం,
తథాపి త్వం మహాబాహో! నైనం శోచితు మర్హసి.

అనగ, 'ఒకప్పుడు ఈ ఆత్మను ఎల్లప్పుడు పుట్టుచున్నవానిగను, ఎల్లప్పుడు నశించుచున్నవానిగను తలంతువేమో, అట్లైనను ఓ అర్జునా! ఇక నీవు దీనినిగూర్చి దుఃఖించుటకు తగవు' అని అర్థము. తప్పింప శక్యముగానిదానిని గూర్చి చింతించుట తగదుగదా!

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

అనగ, 'ఏ కారణమువలన పుట్టినవానికి చావు నిశ్చయమో, చచ్చినవానికి పుట్టుక నిశ్చయమో, ఆ కారణమువలన తప్పింప శక్యముకానిదానినిగూర్చి నీవు దుఃఖించుటకు తగవు' అని అర్థము. మఱియు నీ శరీరములు జన్మమునకుపూర్వము లేవు. మరణానంతరమును లేవు. ఇకను మధ్యలో మాత్ర మెట్లుండును?

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

అనగ, 'ఓ యర్జునా! శరీరములు జన్మమునకు ముందు అవ్యక్తమైన మాయనుండి వచ్చినవి. చనిపోయిన పిమ్మట అయ్యవి ఆ మాయలోనికే పోయినవి. అయితే యీ మధ్య కాలములో మాత్రము పుత్రమిత్రాదినామరూపములుగల విగా కాన్పించుచున్నవి. ఇట్టి శరీరములవిషయమై నీవు దుఃఖింప తగవు.' ఏలయన,

యన్నాదౌ యచ్చ నాన్త్యం తే తన్మధ్యే భాత మప్యసత్,
అతో మిథ్యా జగ త్సర్వ మితి వేదాన్త డిండిమః.

అనగ 'ఏది ఆదియందు లేదో, ఏది అంతమందును లేదో అది మధ్యమందు కాన్పించినను, లేనిదానితో సమానమే. కావున ని దేహాదు లన్నియు మిథ్య' యని అర్థము. మఱియు శరీరములు ఋణసంబంధములై యున్నవి. ఈ లోకమున ఋణము తీరగనే అయ్యవి నశించిపోవును.

ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాదయః,
ఋణక్షయే క్షయం యాన్తి కా తత్ర పరివేదనా.

అనగ. 'లోకములో భార్యాభర్తృ సంబంధములును, పశుపుత్రాదిసంబంధములును, ఋణ సంబంధమువలన కలుగుచున్నవి. అట్టికర్మ ఋణము తీరగనే భార్యాపుత్రాది సంబంధములు తెగిపోవుచున్నవి' అని అర్థము. మఱియు,

హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే.

అనగ, 'జన్మకాలమునందు కర్మదేవతలచే నొసటను గీయబడిన గీతను తుడిచివేయుటకు బ్రహ్మవిష్ణురుద్రులకు గాని దేవాదిదేవతలకుగాని శక్యముకాదు, అని అర్థము. ఒకడు ఈ లోకమున నెంతకాలము జీవింపవలయునో ఆవిష యము జన్మకాలమునందే వాని లలాటమునందు లిఖింపబడి యుండును. ఆగీత ననుసరించియే మరణము సంప్రాప్త మగు చుండును. ఇదియే ప్రారబ్ధకర్మానుభవము. ప్రారబ్ధకర్మమే జన్మకు కారణము.

ఆగామి సంచిత ప్రారబ్ధములు.

జన్మమును బుట్టించు కర్మ యనిన కామ్యకర్మ యగును. కాని యీశ్వరార్పణబుద్ధితో ఫలాభిసంధిరహితముగ కర్తృత్వాద్యభిమాన రహితముగ చేయబడు నిష్కామకర్మ గాదు. తనయొక్కగాని, తనవారియొక్కగాని లాభము నపేక్షించి అభిమానముతో చేయుకర్మ కామ్యకర్మ యనబడును. ఇతరులకు నష్టము చేయ నుద్దేశించు కర్మ నిషిద్ధకర్మ, లేక, పాపకర్మ యనబడును. జీవుడు అనాదిగ ఇట్టి పుణ్యపాప కర్మలను చేయుచుండును. ఒక్క దినమందు చేయు పుణ్యపాప కర్మమే పెక్కుజన్మములను కలిగించునంతటిదై యుండును. ఇకను జన్మాంతమువరకు చేయబడు కర్మ అనంతమైన జన్మములను కలిగించు ననుట తథ్యము. మరణకాలమున జీవుడు తా నాజన్మలో చేసిన పుణ్యపాపకర్మముల నన్నింటిని వాసనా రూపముగ తనవెంట గైకొనిపోయి కర్మరాశి యగు కారణశరీరమందు చేర్చును. ఈ కర్మరాశికి సంచితమని

పేరు. జీవుడు మరణము నొందినపిమ్మట కొంతకాలమునకు పునర్జన్మము నెత్తుటకై యీ సంచితమునుండి కొంత కర్మమును గైకొనివచ్చును. ఈ కర్మముచేత నే యితనిజన్మ ప్రారంభమగునుగాన దీనికి ప్రారబ్ధకర్మ మని పేరు.

ఇట్లు సంగ్రహింపబడిన కర్మము ఈతని జన్మమునకు నిమిత్తకారణం బగును. ఈతని శరీరంబునకు ఉపాదాన కారణంబైన పంచభూతములలో నిమిత్తకారణమైన యీ ప్రారబ్ధకర్మ చేరి జీవునకు శరీరమును కలిగించుచున్నది. జీవుడు ఈ శరీరముచేత ప్రారబ్ధము ననుభవించుచు మఱికొన్ని నూతనకర్మలను చేయును. మరణపర్యంతము చేయు ఈ నూతనపుణ్యపాపకర్మములకు ఆగామికర్మమని పేరు. ఇది కూడ సంచితములో చేరిపోవును. పైన దెల్పబడిన సంచితాగామి ప్రారబ్ధకర్మములలో ప్రారబ్ధకర్మ మూడు విధములు. (1) ఇచ్ఛాప్రారబ్ధము, (2) అనిచ్ఛాప్రారబ్ధము. (3) పరేచ్ఛా ప్రారబ్ధము. ఈ మూడును జ్ఞానులకును అజ్ఞానులకును సమానమే కాని, అజ్ఞానియొక్క ప్రారబ్ధము శరత్కాలపు మేఘమువంటిది. ఈ మేఘము స్వల్పముగా నుండినను సర్వత్ర వ్యాపించి, కుంభద్రోణముగ వర్షించి పైర్లను, ఇండ్లను నాశముచేయును. అటులనే అజ్ఞానియొక్క ప్రారబ్ధము స్వల్పముగ నుండినను, ఇయ్యది సర్వత్ర వ్యాపించి పరుల కనేక దుఃఖములను కలిగించును. జ్ఞానియొక్క ఇచ్ఛ మకరమాసమునందలి మేఘమువంటిది. ఇది సర్వవ్యాపియై యున్నను, స్వల్పముగ వర్షించి సస్యాదులకును, ప్రాణులకును నష్టమును కలుగజే

యక, తానును వెంటనే నశించిపోవును. జ్ఞానియొక్క యిచ్ఛ యీమకరమాసపు మేఘమువలె విస్తారముగ నున్నను, ఈ తని వివేకమువలన అయ్యది పరులను కష్టపెట్టకయు, తన పరలోకసౌఖ్యమునకు హాని కలిగించుకొనకయు, తన దేహ ధారణనిమిత్తమందే వర్తించును. (1) ఇచ్ఛాప్రారబ్ధము:— ఇతరులు అధర్మకార్యములను, పాపములను చేసి దుఃఖితు లగుచున్నారు. కాని వారసమర్థు లగుటచే నట్లు దుఃఖములపాలైరి. మేము సమర్థులమగుటచే అట్టిదుఃఖములను చెందనేర మని అవివేకులు తలంచి సమస్తవిషయములయందును ఆసక్తిని వదలక అధర్మముగ ప్రవర్తించి తుదకు తామును వారివలెనే, వెతల పాలగుచున్నారు. ఇది అవివేకుల ఇచ్ఛాప్రారబ్ధము. కాని వివేకులైనవారు ఇతరులు అధర్మములు చేయుట వలన పొందుదుఃఖములను చూచి సమస్తవిషయములందును ఆసక్తిని వదలి ప్రాప్తించినదానితో సంతుష్టులై యుందురు వీరి యిచ్ఛ దేహధారణవిషయములందు మాత్రమే ప్రవర్తించును. ఇది వివేకులయొక్క ఇచ్ఛాప్రారబ్ధము. (2) అనిచ్ఛాప్రారబ్ధము:— ఇది వివేకులకును, అవివేకులకును సమానమై యుండును. శరీరవ్యాధులు, ఎండవానలు, పిడుగులు, ఉరుములు, మున్నగు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము వలన కలుగు సుఖదుఃఖములు వివేకులకును, అవివేకులకును సమానమైయుండును. వీని యనుభవమే అనిచ్ఛాప్రారబ్ధము. (3) పరేచ్ఛాప్రారబ్ధము:— ఒక పురుషుడు తటస్థుడుగ కూర్చుండియుండగా, మఱియొకడు వచ్చి వానికి వంద

నము లొనర్చి, అయ్యా, నీ వీకార్యమును తప్పక చేయవలె నని దయాదాక్షిణ్యములతో ప్రార్థించగ, ఆత డాకార్యమును చేసి అందువలన కొన్ని సుఖదుఃఖములకు పాల్పడును. ఈసుఖ దుఃఖానుభవమే పరేచ్ఛాప్రారబ్ధము. ఇది వివేకులకును, అవివేకులకును సమానమే.

జీవు డిట్లు ప్రారబ్ధము ననుభవించుచు, అనేక జన్మము లలో కర్మములను చేయుచురాగా సంచితము వృద్ధినొందుచుం డును. ఇట్టిస్థితిలో జీవునియొక్క జన్మపరంపరలకు హద్దు ఎక్కడ? కాని ఒకానొకజన్మములో నీతని పుణ్యకర్మ ఫలించి యికను జన్మము కలుగకుండ చేసికొనవలెనని యీతనికి సంకల్ప ముద్భవించును. కామ్యకర్మములు చేయుటవలన సంసారము నశించదని తెలిసికొని యీతడు నిష్కామకర్మములు చేయ నారంభించును. ఇందువలన భక్తి ఉదయించును. ఈ భక్తివలన చిత్తశుద్ధియు, చిత్తశుద్ధివలన సద్గురుప్రాప్తియు లభించును.

## సద్గురు లాభము.

అంతట జీవుడు సద్గురుని దర్శించి యిట్లు ప్రార్థించును.

కార్పణ్యదోషోపహతస్వభావః,
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే,
శిష్య స్తేఽహం శాధి మామ్ త్వాం ప్రపన్నం.

అనగ, 'ఓ సద్గురుమూర్తీ! వ్యసనములచేతను, దోష ములచేతను, నశించిన స్వభావము గల నేను ధర్మసందేహము కలవాడనై మిమ్మును ప్రార్థించున దేమనగా, ఏది నిశ్చితముగ ,నాకు మేలొనఁగూర్చునో, అద్దానిని నాకు సెలవిండు. నేను తమ శిష్యుడను, తమ్మును శరణము నొందుచున్నాను. అనుగ్రహింపుడు అని దీని అర్థము. మఱియు,

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్,
అవాప్య భూమా వసపత్న మృద్ధమ్
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్.

అనగ, 'భూమియందు అసమానమైనట్టియు, వృద్ధి నొందుచున్నట్టియు రాజ్యమున దేవేంద్రపదవిని బొందియు నింద్రియముల నెండింప జేయుచున్న నా వ్యసనము నేది పోగొట్టునో, నాకు తెలియుట లే' దని దీని అర్థము.

శిష్యుడు గురువు నిట్లు ప్రార్థించుటవలన లోకములో జీవులకు సమస్తైశ్వర్యము లుండియు, వీని మనస్సునకు సుఖమును, శాంతిని కలుగజేయు వస్తువు లభింపక వీరు పరితప్తులగుచుందు రని తేలినది. ఇట్టి ముముక్షువులు సద్గురువు నాశ్రయించుట అదృష్టవిషయము. జీవుల పరితాపంబుల పోగొట్టునది బ్రహ్మజ్ఞానమే గాని అన్యముగాదు. శిష్యుని ప్రార్థనను సద్గురుమూర్తి గ్రహించినవాడై శిష్యునియందు ప్రసన్నుడై యిట్లు నుడువుచున్నాడు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.
యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి.

అనగ, 'జ్ఞానులు ఏ బ్రహ్మజ్ఞానము నీకొఱకు ఉపదేశింపగలరో, యేజ్ఞానము నొంది తిరిగి నీవు ఈ సంసారము నొందవో, దేనిచేత సమస్తప్రాణులు నీయందును ఆలాగుననే నాయందును చూడగలవో, అట్టి జ్ఞానమును, గురువునకు సాష్టాంగనమస్కారము చేసియు, శుశ్రూష చేసియు తెలిసికొనుము, అని అర్థము. కాన జీవుడు తన సద్గుణమూర్తికి ప్రేమ కలుగునట్లు శుశ్రూషాదిపరిచర్యలను ఆనందోత్సాహముతో జరుపుచుండును. ఈ ప్రకారము జరిపి గురువుయొక్క అనుగ్రహమును సంపాదించును.

అనామరూపం సకలం సన్మయం చిన్మయం పరం,
కుతో భేదః కుతో బంధః ఇతి వేదాన్తడిండిమః.

మఱియు,

పఞ్చానామపి కోశానాం మాయయాఽనర్థతోచితా
తత్సాక్షీ బ్రహ్మవిజ్ఞానం ఇతి వేదాన్తడిండిమః.

ఈ ప్రకారము గురుమూర్తి శిష్యునకు తత్త్వము నుపదేశించును. దీనియర్థ మేమన, ఈ జగత్తునుండి నామరూపములను విడదీసినచో అంతయు సచ్చిదానందస్వరూపమగుబ్రహ్మమే యగును. కాన నిక భేద మెక్కడ? బంధ

మెక్కడ? మఱియు దేహమందలి అన్నమయాదికోశములు మాయాసంబంధము లగుటచే అనర్థదాయకము లగుచున్నవి. వానికి సాక్షియగు ఆత్మయే బ్రహ్మము. అనగా జీవేశ్వర జగత్తులు బ్రహ్మమగు తనకంటె వేరుకారు అని అర్థము. సర్వోప నిషత్సారభూతమైన యీ యభేదజ్ఞానమును శిష్యుడు గురువు వలన పొందుచున్నాడు. ఈ జ్ఞానము కలుగుటతోడనే యీతని సంచితాగామికర్మ మంతయు నశించిపోవుచున్నది.

కర్మక్షయము.

యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.

అనగ, 'ఓ అర్జునా! లెస్సగా మండుచున్న అగ్ని కట్టెల నేలాగున భస్మము చేయునో ఆలాగుననే జ్ఞాన మనెడు అగ్ని ప్రారబ్ధము వినా, తక్కిన సమస్త కర్మములను భస్మము చేయును.' అని అర్థము. అయితే సంచితము జ్ఞానముచేత దగ్ధ మగును. ప్రారబ్ధము అనుభవించుటచేత నశించును. ఇకను మిగిలిన యీతని జీవితకాలములో నీతనిచే చేయబడు పుణ్యపాప ఆగామికర్మ మేమగును? అను ప్రశ్నకు సమాధానము రావలసియున్నది.

ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్త్వజ్ఞానేన సంచితం,
ఆగామి ద్వివిధం కర్మ తద్ద్వేషిప్రియవాదినః.

అనగ, 'జ్ఞానము కలిగినతరువాత చేయబడు పుణ్య పాపములు అకర్తయైన యీ జ్ఞాని నంటనేరవు. అయితే

యివి యెట్లు హరించును? ఈ జ్ఞానిని గూర్చి ప్రియముగ మాట్లాడువారు ఈతని పుణ్యమును గ్రహించెదరు. ఈతనిని గూర్చి ద్వేషించువారు ఈతని పాపములను కొనిపోయెదరు.' అని అర్థము కాని ప్రారబ్ధకర్మమును మాత్రము జ్ఞాని యనుభవింపక తప్పదు.

అయితే ప్రారబ్ధము ననుభవించుట అజ్ఞానికి వలె, జ్ఞానికి గూడ తప్పక పోవునెడల నింత శ్రమపడి సంపాదించిన జ్ఞానమువలన జ్ఞాని కేమి ప్రయోజన మని శంకించువారికి సమాధానము కలదు. ఎట్లన అజ్ఞానితోపాటు జ్ఞానికిని ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక తాపత్రయములు కలుగుననుట సత్యము. అనగ శరీరము ననుసరించి వచ్చు శీతజ్వరము, శూలనొప్పి, మూలవ్యాధి మున్నగు రోగములవలని దుఃఖములును, తేలు, పాము, పులి, నల్లి, పేను మున్నగు జంతువులవలన కలిగెడి దుఃఖమును ఎండ, వాన, పిడుగు, వాయువు, కుడ్యము, గోపురము మున్నగు నచేతనములవలన కలిగెడి దుఃఖములును, అజ్ఞానితో సమముగ జ్ఞానియు ననుభవించును. అయితే వీ రిరువురకు భేదము కలదు. జ్ఞానియైనవాడు సర్వ దుఃఖములును తన దేహేంద్రియాదిసంఘాతమే యనుభవించుచున్నది గాని సాక్షియైన తనకు లేవని యెఱిగి యుండును. అనగ, దుఃఖములు అంతఃకరణనిష్ఠంబు లని దృఢనిశ్చయుండై తాటస్థ్యమున వహించియుండును. అజ్ఞాని యన్ననో యీ దుఃఖముల నన్నిటిని మఱియు అన్యనిష్ఠములైన దుఃఖములనుసయితము తనయం దారోపించుకొని తన

పుత్రుడు సుఖముగ నుండిన, తాను సుఖముగ నున్నట్లును, తన భార్య బాధపడుచుండిన తాను బాధ నొందుచున్నట్లును, తనమానుమడు ఉద్యోగముచేయుచున్న తానే యుద్యోగము చేయుచున్నట్లును భావించి సుఖదుఃఖముల ననుభవించును. ఎట్లన,

స్వకర్మపాశవశగః ప్రాజ్ఞో అన్యోపా ధ్రువం।
ప్రాజ్ఞస్సుఖం నయే త్కాల మితి వేదాన్తడిండిమః.

అనగ, 'జ్ఞానిగాని అజ్ఞానిగాని ప్రారబ్ధమగు స్వకర్మ పాశమునకు వశుడే యగును. కాని జ్ఞాని తనకాలమును సుఖముగ గడుపును. అజ్ఞాని దుఃఖములను బొందును.' అని తాత్పర్యము.

అహంభావము, సోహంభావము.

దేహముతోడి ఆత్మకుగల తాదాత్మ్యబుద్ధియే అహంభావ మనబడును. ఈ అహంభావమే సర్వసంసారమునకు కారణ మగుచున్నది. అనగ, యీ దేహమే నేనని భావించుట వలన సంసారబంధము కలుగుచున్నది. నేను ఈ దేహమును కాను, యీదేహ మనుభవించు సుఖదుఃఖములు నావికావు. వీని నన్నింటిని చూచుచున్న సాక్షిని నేను. అని తెలుసుకొనుటవలన సంసారవిముక్తి కలుగుచున్నది. సాక్షియైన బ్రహ్మమే తా నని గ్రహించుటయే సోహంభావము. సోహంభావమువలన ముక్తియు, అహంభావమువలన బంధనమును కలుగును. ఎట్లన,

అహం బ్రహ్మేతి నియతం మోక్షహేతుర్మహాత్మనాం,
ద్వే పదే బంధమోక్షాయ న మమేతి మమేతిచ,
మమేతి బధ్యతే జంతు ర్న మమేతి విముచ్యతే.

అనగ 'మోక్షము నొందగోరు మహానుభావులు నేను బ్రహ్మమును అని నియమముగ ధ్యానించవలసియున్నారు. ఇది నాది. ఇది నాది కాదు. అను నీరెండుపదములే బంధ మోక్షములకు కారణము లగుచున్నవి. జీవుడు 'మమ' అను పదముచేత బద్ధుడును 'న మమ' యనుపదముచేత ముక్తుడును నగుచున్నాడు, అని యర్థము. ఇట్లు జరుపక యితరములగు నెన్ని క్రియల నాచరించినను, జీవుడు మోక్షమును బడయజాలడు.

హన్యా న్ముష్టిభి రాకాశం క్షుధార్తః ఖండయే త్తుషం,
నాహం బ్రహ్మేతి జానాతి తస్య ముక్తి ర్న జాయతే.

అనగ, ఆకలిచే పీడింపబడువాడు పిడికిళ్ళచేత ఆకాశమును కొట్టుటచేతను, ఊకను (పొట్టును) దంచుటవలనను, ఎట్లు ఆకలిని తీర్చుకొనజాలడో అట్లనే నేను దేహమును కాను, దేహసాక్షియైన బ్రహ్మమును. అని తెలియనంతవరకు జనన మరణప్రవాహరూపమైన యీసంసారమునుండి విముక్తి నొందజాలడు, అని తాత్పర్యము.

## అధ్యారోపము లేక అధ్యాసము.

పైనదెల్పిన వాక్యములో దేహసాక్షియనువా డెవడు?

కర్తారం చ క్రియాం తత్తద్వ్యాపృత్తవిషయా నపి,
స్ఫురయే దేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః.

అనఁగ, అహంకారరూపుఁడగు కర్తను, (2) మనోవృత్తిరూపమగు క్రియను, (3) ఇంద్రియములచే గ్రహింపబడు విషయములును ఒక్కసారిగ నేపరమాత్మ చిద్రూపుఁడగుచు ప్రకాశింపచేయుచున్నాఁడో ఆపరమాత్మకు సాక్షి యని పేరు.' ఈ సాక్షి నాటకశాలయం దుండెడి దీపమువలె నిర్వికారియై తాను ప్రకాశించుచు సర్వమును ఒక్కసారిగ ప్రకాశింప చేయుచున్నాఁడు.

నృత్యశాలాస్థితో దీపః ప్రభుం సభ్యాంశ్చ నర్తకీం,
దీపయే దవిశేషేణ తదభావేపి దీప్యతే.

అనఁగ, 'నాటకశాలయం దుండెడి దీపము అచ్చటగల వారిని ప్రకాశింపచేయు నిమిత్తము ఎట్టి వికారమును బొందకయే ప్రభువును, సభయందుగల వారిని నాట్యమాడు స్త్రీని, ప్రకాశింప జేయుచున్నది. మఱియు ఆ ప్రభువు మొదలగు జనము లేకపోయినను ఆ దీపము స్వయముగ ప్రకాశించుచునే యుండును' అట్లనే,

అహంకారం ధియం సాక్షీ విషయానపి భాసయేత్,
అహంకారాద్యభావేపి స్వయం భాత్యేవ పూర్వవత్.

అనఁగ, 'ఈ సాక్షియు వృద్ధ్యాదివికారములు లేకనే అహంకారమును, బుద్ధిని, శబ్దాదివిషయములను ప్రకాశింపజేయుచున్నాఁడు. మఱియు సుషుప్తియందు అహంకారాదికములు లేకపోయినను, ఆ సాక్షి పూర్వమువలెనే నిర్వికార

త్వముచేత స్వయముగ ప్రకాశించుచున్నాడు.' ఇచ్చట దేహమునందలి అహంకారాదు లెట్టివారు?

అహంకారః ప్రభు స్సభ్యా విషయా న ర్తకీ మతిః,
తాళాదిధారీ ణ్యక్షాణి దీప స్సాక్ష్యవభాసకః.

అనగ, 'అహంకారము ప్రభువువంటివాడు. విషయములు సభయందుగల పురుషులవంటివి. బుద్ధి నాట్యము చేసెడి స్త్రీ వంటిది. ఇంద్రియములు తాళము మున్నగు పనిముట్లను ధరించినజనులవంటివి. సాక్షి వీని నన్నింటిని ప్రకాశింప జేయు దీపమువంటివాడు.' ఇట్లు స్వస్థానమునందు నిశ్చలుడై నిర్వికారుడై యున్న సాక్షియగు నేను అను ఆత్మ బాహ్యాంతరగమనాగమనములను చేయనివా డయ్యును, బుద్ధిచే చేయబడెడి గమనాగమనములను తాను చేయుచున్న వానివలె తోచుచున్నాడేగాని యథార్థముగ సాక్షికి చలనము లేనేలేదు. ఎట్లన, కిటికీద్వారా గృహములోనికి వ్యాపించిన స్వల్పమగు ఎండకు చలనము లేనేలేదు. కాని ఆయెండయందు పురుషునిహస్తము అటునిటు చలింపబడుచుండగా చలనములేని ఆయెండ చలించుచున్నట్లు కాన్పించునే కాని, వాస్తవముగా నది చలించుటలేదు. అనగ ప్రకాశింపజేసెడి వస్తువునందు ప్రకాశింపబడు పదార్థముయొక్క చాంచల్యము ఆరోపింపబడునని యర్థము. అటులనే అంతఃకరణమగు బుద్ధియొక్కయు, ఇంద్రియాదుల యొక్కయు, దేహముయొక్కయు, వికారములు ఆత్మయగు తనమీద నారోపింపబడుటచే తనయందు కర్తృత్వ భోక్తృత్వములు కాన్పించుచున్నవే

కాని యథార్థముగ తాను అకర్తయు, అభోక్తయు, నిర్వికారుడును, నిత్యుడును, పరమసుఖస్వరూపుడును, కేవల జ్ఞానరూపుడును, ఆకాశమువలె సర్వవ్యాపకుడును, జగత్సాక్షియు, భావాతీతుడును, నిర్గుణుడును నయియున్నాడు. జగత్తునందలి క్రియాకలారూపమంతయు మాయచేతను, దాని గుణములచేతను చేయబడుచున్నది గాని, ఆత్మ యెంతమాత్రమును చేయుటలేదు. ఎట్లన,

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే.

అనగ, 'మాయవలన బుట్టిన యింద్రియములచేతను, వీని వికారముచేతను, నానావిధములుగ చేయబడుచున్న కర్మలను, దేహమే తా నను అహంకారము గల పురుషుడు నేను చేయుచున్నానని తలంచుచున్నాడు.' మఱియు,

పురుషప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజా న్గుణాన్
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు.

అనగా, 'ప్రకృతియే తానని తలంచెడి సుఖదుఃఖాదుల ననుభవించెడి జీవుడు ఆ ప్రకృతిగుణములను ననుభవించుచున్నాడు. సుఖదుఃఖాది గుణములవిషయమైన ఆసక్తియే యీ జీవునకు పుణ్యపాపయోనులందు పుట్టుకలను కలిగించుచున్నది' అని యర్థము. ఇది యంతయు అజ్ఞానవశముచే కలిగినదికాని జ్ఞానికి నీ ప్రకృతిగుణములయందు సంగము లేనే లేదు, ఎట్లన,

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః,
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే.

అనగ 'మాయాకార్యములగు నిందిర్రియములు, మాయావికారములగు శబ్దాదివిషయములయందు ప్రివర్తించుచున్న వని తెలిసికొని గుణకర్మవిభాగముల యథార్థము నెఱిగిన జ్ఞాని యీ దేహమునం దెంతమాత్రము నభిమానము నొందుట లేదు.

మరణ నివారణ ప్రయత్నములు.

ఇట్టి దేహాభిమానము లేని జ్ఞానికి మరణమువలన భయ మెంతమాత్రమును లేదు.

"ప్రిమాదం వై మృత్యుః."

అనగ 'దేహాత్మభావబుద్ధియే మృత్యువు. ఈ సత్యమును పూర్వము శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజునకు ప్రప్రథమమున బోధించియుండెను.

ఉ॥ ఏను మృతుండనౌదునని యింతభయంబు మనంబులోపలన్
మానుము,సంభవంబు గల మానవకోట్లకుఁజావునిత్యమౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాధ! పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్.

దేహమే తా నని భ్రిమించి భయము నొందువారికి ఈ జ్ఞానోపదేశము అమృతోపమాన మగుచున్నది. ఈ దేహము చనిపోకుండ ఔషధసేవచేసి నిలుపకూడదా యని కొందఱు తలంపవచ్చును. కాని అట్లు జరుపుట దుస్సాధ్యము.

ధన్వంతరివంటి వైద్యశిఖామణులు సయితము కాల మాసన్న మగుసరికి తమ శరీరములను కోల్పోవవలసి వచ్చెను. రోగమునకు ఔషధము కలదుగాని మరణమునకు మాత్రము మందులేదు. ఎట్లన,

కాయ మెంత భయానఁ • గాపాడినంగాని
ధాత్రిలో నది చూడఁ • దక్కఁబోదు
ఏవేళ నేరోగ మేమ•రించునొ సత్వ
మొందఁగఁజేయు నే•చందమునను
ఔషధంబులు మంచి • వనుభవించినఁగాని
కర్మ క్షీణంబైనఁ • గాని విడదు
కోటివైద్యులు గుంపు • గూడి వచ్చినఁగాని
మరణ మయ్యెడివ్యాధి • మాన్పలేదు
జీవుని ప్రయాణకాలంబు సి•ద్ధమైన
నిలుచునా దేహ మిం • దొక నిముసమైన
భూషణవికాస! శ్రీధర్మ•పురనివాస!
దుష్టసంహార! నరసింహ! • దురితదూర!

పోనిండు, మందులు పనికిరాకపోయినను, బలపరాక్రమ ములుగాని, భాగ్యభోగ్యములుగాని అడ్డుపడునా యనిన, అడ్డుపడనేర వని యొకభక్తు డిట్లు తెలుపుచున్నాడు.

ధరణిలో వెయ్యేండ్లు తనువు • నిల్వగబోదు
ధన మెప్పటికి శాశ్వ•తంబు గాదు
దారసుతాదులు తన•వెంట రాలేరు
భృత్యు లడ్డముగారు • మృత్యువునకు

బంధుజాలము తన్ను ♦ బ్రతికించుకోలేరు
బలపరాక్రమమేమి ♦ పనికిరాదు
ఘనమైన సకలభాగ్యం ♦ బెంతఁ గల్గియు
గోచి మాత్రంబైనఁ ♦ గొంచుఁబోఁడు
వెఱ్ఱికుక్కల భ్రమ లన్ని ♦ విడిచి నిన్ను
భజన చేసెడి వారికిఁ ♦ బరమసుఖము
భూషణవికాస! శ్రీధర్మ♦పురనివాస!
దుష్టసంహార! నరసింహా! ♦ దురితదూర!

అయితే, యీ మరణ మనునది నూరు సంవత్సరములు పిమ్మటగదా వచ్చు ననియు, స్వగృహమునందు సుఖముగా నుండియే గదా దేహమును విడువనగు ననియు, చావు వచ్చుటకు ముందుగ తనకు నోటీసు వచ్చు ననియు, అప్పుడు తా నన్నింటిని సర్దుకొని చక్కబెట్టుకొన వచ్చుననియు, చాలమంది దురభిప్రాయపడుచున్నారు. ఇట్లు భ్రాంతచిత్తులగువారు యీక్రింది యథార్థమును గ్రహించి మెలంగుదురుగాక!

పాంచభౌతికము దుర్బ♦లమైన యీ కాయ
మెప్పుడో విడుచుట ♦ యెఱుక లేదు
శతవర్షములదాక ♦ మితముఁ జెప్పిరిగాని
నమ్మరా దామాట ♦ నెమ్మనమున
బాల్యమందో, మంచి ♦ ప్రాయమందో లేక
ముదిమియందో లేక ♦ ముసలియందొ
ఊరనో యడవినో ♦ యుదకమధ్యంబునో
ఎప్పుడో విడుచుట ♦ యే క్షణంబొ

మరణమే నిశ్చయము బుద్ధిమంతుఁడైన
దేహ మున్నంతలో మిమ్ముఁ దెలియవలయు
భూషణవికాస! శ్రీధర్మపురనివాస
దుష్టసంహార! నరసింహ! దురితదూర!

ఈ విచారణవలన మన కేమి బోధయగుచున్న దనిన చావునుండి తప్పించుకొనుట కెట్టి యుపాయంబులు లేవనియు, ప్రతివానికిని వాని పూర్వకర్మఫలానుభవము ముగియనంత వరకే వాని దేహము నిలిచియుండుననియు, కర్మఫలానుభవము తీరగనే, యిహలోక దేహబంధములు తెగిపోవుననియు, ఇందులకు పురుషప్రయత్న మేమియు పనికిరాదనియు తెలియుచున్నది. పూర్వజన్మకర్మములకు దైవము అని పేరు గలదు. ఈ దైవము జీవులకు వెనుకనుండి కర్మసూత్రము నాడించుచుండును. ఆ సూత్రమును బట్టి జీవులు సుఖదుఃఖ ఫలముల ననుభవించుచుందురు.

## మరణముయొక్క నిమిత్తకారణములు.

ఈ లోకములోని ప్రతిసంఘటనమునకును దైవము కొన్ని నిమిత్తకారణములను చూపుచు, తాను మాత్రము తటస్థునివలె కాన్పించుచుండును. ఎట్లన, మరణము తటస్థించినప్పుడు ఆమరణమునకు మూలకారణము స్వకర్మసూత్రమైన దైవమను మాటను నెవరును తలపెట్టక, కొందరు జ్వరము తగిలి మరణించిరనియు, కొందరు పిడుగుపడి చచ్చిరనియు, కొందరు పాముకఱచి పోయిరనియు, కొందరు అన్నము లేక నశించిరనియు, కొందరు విషము త్రాగి విగతజీవులై

రనియు, కొందరు చిన్నబిడ్డగుణము పుట్టి గతించిరనియు, మందులు మంచివి లేక మరణించిరనియు, విరోధులు కొట్టిచంపి రనియు, ఇత్యాది బాహ్యకారణములను తెలుపుచున్నారు గాని,

"దైవం వినా తృణమపి న చలతి."

అనగ, శివునియాజ్ఞ లేనిదే చీమయైన కుట్టదు అను సత్యమును అందరును మరచిపోవుచున్నారు. పూర్వకర్మను బట్టి తా నొకఫలము ననుభవించవలసియుండినగాని అట్టి సంఘటనలు జరుగనేరవు. జీవులకు ఆ యాకర్మఫలముల ననుభ వించు సమయము వచ్చినప్పుడు దైవమే ఆపనులను వెనుక నుండి జరుపుచు తనకు సంబంధము లేనట్లు కొన్ని నిమిత్తకార ణములను మాత్రము లోకులకు చూపెట్టుచుండును. ఈ సత్య మును వెల్లడించు ఈక్రింది యితిహాసము వినతగియున్నది.

పూర్వ మొకనాడు బ్రాహ్మణదంపతు లిరువురు అరణ్యమార్గమున మఱియొకగ్రామమున కేగుచుండిరి. మార్గాయాసముచే బ్రాహ్మణునిభార్య దాహపీడితు రా లయ్యెను. అంతట ఆమె నొక వృక్షమూలమున జేర్చి జల మును దెచ్చుటకై భర్త కొంతదవ్వేగెను. ఇంతలో ఆవృ క్షాగ్రమున దాగియున్న నొక కఱకుబాణము గాలికి కదలి క్రిందనున్న బ్రాహ్మణి నెత్తిపై బడి ఆమెను హత మొన ర్చెను. భర్త జలమును గైకొనివచ్చి భార్య కందీయబోగా ఆమె మృతినొంది నిశ్చేష్టురాలై యున్నట్లు తెలిసికొనెను. ఆమె తలమీద బాణము గ్రుచ్చుకొని యుండుటకు, దగ్గ

రలో నొక బోయవాడు అంబు చేబూని యుండుటయు బ్రాహ్మణుడు కనిపెట్టి ఆ బోయవాడే తన భార్యను చంపినాడని నిశ్చయించుకొని వానిని బలాత్కారముగ పట్టుకొనియు, తన భార్య కళేబరమును వీపుమీద వేసికొనియు ఆ దేశపు రాజుగారియొద్దకేగి బోయవాడు బాణములేసి తన భార్యనుచంపెనని ఆతడు ఫిర్యాదుచేసెను. బోయవాడు నిర్ఘాంతపోయి తానేమియు నెఱుగనని వినయవిధేయలతో విన్నవించుకొనెను. రాజుగారికి యథార్థము బోధపడలేదు. బోయవానిని బహు భంగుల ప్రశ్నించెను. కాని బోయవాడు తన అమాయకత్వమును వెల్లడించుచుండెను. అంతట రాజు బోయవానిని కారాగృహమున బంధించెను. పిమ్మట రాజు తన యిష్టదేవతాలయంబునకుబోయి నిరాహారుడై ఆ దినమంతయు తపమొనర్చి యీవధకు కారకు లెవ్వరో తెలియగోరి ఆ దేవతను ప్రార్థించెను.

ఇంతలో రాజున కొక స్వప్నమువచ్చెను. ఆస్వప్నములో తన యిష్టదేవతామూర్తి "ఓ రాజా! రేపురాత్రి మీపురములో సాహుకారువీధిలో నొక వర్తకుని యింటిలో వివాహము జరుగనున్నది. నీవు సాహుకారువేషముతో ఈ బ్రాహ్మణుని గైకొని వివాహమునకేగి అక్కడ జరుగబోవు విచిత్రమునంతయు కనిపెట్టుము. అప్పుడు నీకుయథార్థము బోధపడగలదు" అని పలికెను. స్వప్నములో రాజు వినిన ప్రకారము రాజు మారువేషముతో నీ బ్రాహ్మణుని వెంటబెట్టుకొని సాహుకారి వివాహగృహమునకు వెళ్ళి ఒక మూలను కూర్చుండి వివాహక్రతువును చూచుచుండెను.

ఇంతలో కొందరు యమదూతలచ్చటికివచ్చి తమలో తా మిట్లు సంభాషింపజొచ్చిరి. "ఈ పెండ్లికొమరునకు నవసానకాలము వచ్చినది. ఈతనిని మన మెట్లు చంపి తీసుకొని పోయెదము?" అని వారిలో నొకరు పలుకగా, నిన్నటిదినము అడవిలో చెట్టుమీాద నున్న బాణమును కదల్చి చెట్టుక్రింద నున్న బ్రాహ్మణునిభార్యను మనము చంపినట్లే యీా దినము కూడ మన మొక యుపాయమును బన్ని యీా పెండ్లికొమా రుని ప్రాణములను హరింపవలయును" అని మరియొకడు బదులుచెప్పెను. ఈవివాహములో వధూవరులు తలబ్రాలు పోసికొను సుముహూర్తము వచ్చుచున్నది. అప్పుడు అన్ని మేళములును ఒక్కసారిగా వాయించెదరు. ఇంతలో నీదొడ్డిలో పశువులచావడిలో కట్టబడియున్న ఆవుదూడ పలుపును ఊడబెఱికి అది గంగిర్లెత్తి పెండ్లికుమారుని త్రొక్కి చంపునట్లు చేసెదము. మేళములధ్వనికి దూడ, గాబరాజెంది పలుపు త్రెంచుకొని వచ్చి పెండ్లికొడుకును త్రొక్కి చంపినదని అందరును ఆ దూడను నిందించెదరు. కాన ఈ యుపాయము బాగుగ నున్నదని యమదూతలలో నొకడు పలుకగా, తక్కినవారు 'సెబాస్' అనిరి. ఈ సంభాషణమును అక్కడ కూర్చొని యున్నరాజును, బ్రాహ్మణుడును, ఆలకించి బ్రాహ్మణుని భార్యయొక్క మరణమునకు నిజకారణంబును తెలిసికొనినవారై యీాశ్వరమాయకు నాశ్చర్యము నొందిరి. కాని అక్కడనుండి వారు వెంటనే వెడలిపోక ఆ పెండ్లికొమారుని విషయముకూడ కనిపెట్టి చూడవలెనని తలంచి కొంతసేపు వారు అచ్చట ఆగిరి.

ఇంతలో సుముహూర్తము సమీపించినది. మేళతాళ ములన్నింటిని ఒక్కపెట్టున వాయించిరి. పశువుల కొట్టము నుండి ఒక ఆవుదూడ పలుపు తెంచుకొనివచ్చి పెండ్లికొమా రునిపైబడి దొక్కిపోయెను. వెంటనే పెండ్లికుమారుడు నెత్తురు గ్రక్కి మరణించెను. అందరును గొల్లుమని యేడ్చిరి. వివాహగృహ మప్పుడు శ్రాద్ధమందిరముక్రింద మారిపోయెను. రాజుగారును, బ్రాహ్మణుడును యథార్థమును తెలిసికొనిన వారై వెడలిపోయిరి. నిర్దోషియైన బోయవానిని వెంటనే రాజు బందిఖానానుండి విడుదల చేసెను. రాజుగా రానాడు తనపురమునం దొక సభగావించి యీ బోయవాని వృత్తాంత మును, తన పౌరులకు వెల్లడించి తన యిష్టదైవముయొక్క అనుగ్రహమువలన తనకు సత్యము గోచరించె నని సభలో వెల్లడించి బ్రాహ్మణునకును, బోయవానికిని కొంత బహు మతి నిచ్చి పంపివేసెను.

ఈ కథవలన మన కేమి బోధయగుచున్నది? జీవు లకు పూర్వజన్మ కర్మమునుబట్టి యీ లోకములో ఋణము తీరగనే వారు తమ దేహములను పడువవలసియుందురు. అప్పుడు ఏదో యొకనిమిత్తకారణమువలన వారు మృతినొంది రని లోకములో వదంతులు కలుగును. కాని నిజమైన కారణ ములు ఇవి కానేరవు. జీవుల పూర్వకర్మమునుబట్టి జనన మరణంబులు తటస్థించును. వీరి కీ లోకంబున కర్మానుభవము పూర్తికాగానే దైవము అప్పటి కప్పుడు వరద, ఉప్పెన, కలరా, ప్లేగు, యుద్ధమున్నగు సంహారక్రియలను జరిగించి

తద్వారా జీవుల యిహలోకసంబంధమును తుంచివేయును. అయితే మృత్యువునకు కారణము దైవమేనా? యని కొందరు ప్రశ్నింపవచ్చును. ఇందుకు భగవానుని ప్రత్యుత్తరమును వినుడు.

మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.

అని శ్రీకృష్ణపరమాత్మ తెలిపి యున్నాడు. అనగ, 'ఓ అర్జునా! యీ యుద్ధములో చేరిన యిరుతెగలవారును నిదివరకే నాచే చంపబడియున్నారు. కాని నీవుమాత్రము ఇందులకు నిమిత్తకారణుడవై నిలువుము' అని అర్థము. భారతయుద్ధమునందు మృతినొందబోవు మహావీరులమరణముయొక్కయు యథార్థమును శ్రీ కృష్ణస్వామి అర్జునునకు గావించిన యీ బోధను మనము మరువరాదు. జీవులకీ లోకంబున ఋణసంబంధము తీరునప్పుడు వారిచే దేహములను విడిపించుటకై దైవము అనేకచిత్రములైన కార్యములను వారిచే చేయించి తద్వారా దేహత్యాగము చేయించును. ఇందలి సత్యమును నిరూపించుటకై యిటీవల మన కండ్లయెదుట జరిగిన కొన్ని సంభవములను గూర్చి తెలుపవలసియున్నది.

## మృత్యువుయొక్క విచిత్రచర్యలు.

(1) ఇప్పటికి ఆఱు సంవత్సరముల క్రిందట గోదావరి జిల్లాలో ; వర్షాధిక్యమైనందున నదులు పొంగి వెల్లువలై పాటి గ్రామాదులను, రైలుమార్గములను జలముతో నింపి

వేసి యుండెను. బెజవాడలో రైల్వే యింజనీరు లద్భుతమైన శక్తిసామర్థ్యములు కలవా రుండిరి. వరదలయొక్క ఉపద్రవము వీరికి తెలియగనే వీరు స్పెషల్ రైలును తీసికొనివెళ్ళి వరద లున్న ప్రదేశమును తనిఖీచేయ నారంభించిరి. అచ్చోట నొక రైలుబ్రిడ్జిమీాద రైలుపట్టాలపై నీరు పారుచుండెను. ఆ బ్రిడ్జిమీాదను తన ఇంజనును పోనీయవచ్చునా, లేదా? అను శంక ఆయనకు కలిగెను. రైలుపట్టామీాద తన బూటు కాలుతో తన్నిన యెడల అప్పుడు కలుగుశబ్దమును బట్టి రైలుమార్గము సురక్షితముగ నున్నదో లేదో తెలిసికొనగల సమర్థు డీతడు. ఇట్టి ప్రవీణు డీ తూరిగూడ తన బూటు కాలుతో రైలుపట్టాను తన్ని అందలి శబ్దమును బట్టి ఆరైలు మార్గము సక్రమముగ నుండెనని ఆయన తీర్మానించుకొనెను. కాని అక్కడనున్న క్రింది ఉద్యోగు లందరకున్ను ఆ శబ్దము ఓటిమోతగా నుండెనని గోచర మయ్యెను. ఇంజనీరుగారు ఇంజనును వంతెనమీాదుగ పోనీయుడని ఉత్తరువు చేసిరి. తక్కిన ఉద్యోగులు వలదని వారించిరి. పై అధికారియొక్క మాట చెలాయించును గాని, క్రింది ఆఫీసర్లకు పలుకుబడి యుండదు గదా!

వెంటనే ఇంజనీరుగారును, ఆఫీసర్లును, కొందరు నౌకర్లును ఇంజనులో ప్రవేశించి, వంతెనపైకి బండిని నడిపిరి. వంతెనమధ్యకు రైలు వెళ్ళగనే, ఫెళ ఫెళమను శబ్దముతో ఆ బండి పట్టాలను విరుచుకొని నీళ్ళలో మునిగిపోయెను. చాల మంది ఆఫీసర్లును, నౌకర్లును అదృష్టవశమున నీళ్ళలోనుండి

తప్పించుకొని బయటపడిరి. పాపము రైల్వే యింజనీరుగారి కొరకు వెదకిరి గాని ఆయన శరీర మెచ్చటను కాన్పించలేదు. ఆయన పాతాళగంగలోబడి హతు డాయెను. ఈ దుఃఖవార్త తంతిమూలమున బెజవాడకు చేరగానే ఇంజనీరుగారి భార్యా బిడ్డలును, బంధుమిత్రాదులును శోకసాగరంబున మునిగి పోయిరి. రైల్వే ఇంజనీరుగారి నైపుణ్యమును, తెలివితేటలును అవసానకాలమునందు ఆయనకు అక్కరకు వచ్చినవి కావు. ఆయుష్కాలము తీరిపోయినందున మృత్యువు ఆయన మనస్సులో ప్రవేశించి ఆయనను పొరపెట్టి ఆయనకు విరుద్ధ సంకల్పమును కలుగజేసి హతమొనర్చెను. ఇతరసమయము లలో అమోఘముగ పని చేయుచుండిన ఆయన మేధాశక్తి ఆ నాడేల వక్రగతికి నడువవలసివచ్చెను? తెరచాటునయున్న కర్మసూత్రమే దీనికి కారణము.

(2) బెజవాడలో ఒక గొప్ప పండితునికుమారుడు మదాసు హైకోర్టునందు వకీలుగ పని చేయుచుండెను. ఇప్ప టికి మూడుసంవత్సరముల క్రిందట ఒక నా డాయన తన జన కుని చూచుటకై బెజవాడ వచ్చియుండెను. బెజవాడలో నుండిన కొలదిదినములలో నొకనాడు పగలు పదిగంటలై నది. వేసవికాలము ఎండ తీవ్రముగ కాయుచుండెను. ఇంటి యొద్ద తల్లి విస్తరివేసి కుమారున కన్నము వడ్డించెను. ఎండ వేడిమివలన శరీరమునకు తాపమెక్కినందున "అమ్మా! నేను కృష్ణానదికి వెళ్ళి యిప్పుడే స్నానము చేసివచ్చెదను అని తల్లితో చెప్పి ఆయన వెళ్లెను. నదిలో అనకట్ట యినుప

తలుపుల సందులనుండి నీళ్ళు జారుచుండుట చూచి ఆ నీటి క్రింద ఆయన తనతలను వంచి స్నానముచేయ మొదలుపెట్ట గనే, ఆయినుపతలుపు నిష్కారణముగ ఆయనమీదబడి ఆయనను యమపురికి పంపివేసెను. ఈ వార్త యింటియొద్ద తల్లిదండ్రులకు తెలిసినది. మఱియు పురములో నాలుగు మూలలకు ప్రాకినది. జనులు తండోపతండములుగ వచ్చి యీ విచిత్రమరణమును చూచుచుండిరి. విస్తరిలో అన్న మును వడ్డించి కుమారుని రాకకై ఎదురుచూచుచుండిన ఆ ముదుసలి తల్లియొక్క గర్భనిర్భేదకమైన దుఃఖమును వర్ణింప నెవరితరము? మృత్యువా! ఆహా!! నీ వెంతచమత్కార మైన కార్యమును చేసి నీ విధిని నెరవేర్చుకొని యుంటివి! వడ్డించిన అన్నమును తినుటకుకూడ ఆజీవునకు ఋణము లేక పోవుటచేతనే నీవు వాని నోటికిని వాని అన్నమునకును ఎడ ముచేసితివి. ఈ వకీలు లేతప్రాయము కలవాడు. పట్టపరీక్షల యందు ప్రథమతరగతిని ఉత్తీర్ణుడైనవాడు. ఆంధ్రపత్రి కలో న్యాయస్థాన వార్తలను ప్రకటించుచుండెడివాడు. అద్భుతమైన ప్రతిభావిశేషము కలవాడు. ఇంత సూక్ష్మ గ్రాహి యయ్యు, ఆయన ఒక సామాన్యక్రియను చేసి తన మృత్యువును తాను సునాయాసముగ తెచ్చుకొనవలసివచ్చెను.

(3) మొన్న మొన్న జరిగిన శ్రీ పిఠాపురం మహారాణి గారి నిర్యాణవిషయము ఆశ్చర్యజనకము. మహారాణి గారు గొప్ప విదుషీమణి. సంఘసంస్కర్త్రి. దేవపూజాధురం ధురురాలు. ఒకనాడు మామూలుగ, నీమె దేవతాపూజ గావిం

చుచుండగ దీపారాధనములోని దీప మీామె కొక చెఱగున కంటుటచే దేహము కాలి ముహూర్తకాలములో యీామె మృత్యువాతబడెను. మహారాణిగారు నిత్యము ఉపాసనము చేయు అగ్నిదేవతయే తుదకు యీామెకు మృత్యుదేవ యైత పరిణమించు నని యెవ రూహింపగలిగిరి?

(4) ఇంతకన్న విచిత్రమైన విషయ మొకటి జరిగినది. వియన్నా దేశములో నొక స్త్రీ పిల్లిని పెంచుచుండెను. ఆ పిల్లి మీాద ఆమెకు ప్రేమ కలదు. ఇట్లుండ అకస్మాత్తుగ నా పిల్లి చనిపోయెను. ఈ దుఃఖమును భరింపజాలక ఆవనిత ఆత్మ హత్య గావించుకొనెను. ఈ సంగతి వార్తా పత్రికలయందు ప్రకటింపబడియుండెను.

(5) రసాయనశాస్త్రము పదార్థములయొక్క స్వరూపమును బోధించును. ప్రతిపదార్థమునకును, అణువుల బిగువు, తూనిక, రంగు, రుచి మొదలగు లక్షణములు కలవు. పదార్థము లన్నిటికిని వాని వాని ప్రత్యేకరుచినిగూర్చి అనుభవజ్ఞులు గ్రంథములలో దెలిపియుండిరి. కాని విషము యొక్క రుచి ఎట్లుండునో యింతవర కెవరును వ్రాసియుండలేదు. దీనికి కారణమేమని ఎవరైన ప్రశ్నించ గలరా? ఏలనన, విషమును నోటిలో వేసికొనినవాడు తప్పక మృతినొందును గదా! చేతులార తన నిండు ప్రాణములను కోల్పోవుటకు సంసిద్ధుడై యెవడు విషముయొక్క రుచిని తెల్పుటకు సంసిద్ధుడగును? కాని యీా సంవత్సరము జనవరి 11 తేదీన కలకత్తాలో నొకడు ఈ సాహసకార్యమును చేసి విషముయొక్క

రుచిని వెల్లడించియున్నాడు. ఈ క్రింది సమాచారము వార్తా పత్రికయందు ప్రచురింపబడి యుండెను.

"విషముయొక్క రుచిని తెలిసికొనుటకు ప్రయత్నము."

కలకత్తాలో నొకవిద్యార్థి విషమును రుచిచూచి మృతి నొందుట.

(కలకత్తా, జనవరి 11.)

పొటాసియమ్ సైనైడ్ అను విషముయొక్క రుచి కెమిస్ట్రీలో నిర్ధారణ చేయబడలే దనుకారణమున కలకత్తా స్కాటిష్ చర్చిను కాలేజిలో బి. యస్. సి పరీక్షకు చదువు చున్న యొక విద్యార్థి దీనిరుచిని చూడగోరెను. ఒక చిటిక గుండను నోటిలో వేసికొనెను. అప్పు డత డొక లేఖను వ్రాసి పెట్టెను. ఒక కాగితముమీద ఎఱ్ఱపెన్సిలుతో 'ఏ' అను ఇంగ్లీషు అక్షరమును వ్రాసి కవరులో పెట్టి తా నిటుల చేసితి నని ఆ యుత్తరములో వ్రాసెను. ఆ గుండను నోటిలో వేసి కొనుటవలన అతడు మృతినొందెను. ఈ గుండ ఉప్పగా నుండు నని తెలుపుటకే ఆతెడు 'ఏ' అను అక్షరమును వ్రాసెను. ఈ సంగతిగూడ నీతడే రెండవ యుత్తరములో వ్రాసెను. పొటాసియమ్ సైనైడ్ ఉప్పగా నుండునని యీతడు కను గొని లోకమునకు వెల్లడించెను. కాని యీ ప్రయత్నములో మరణమును కొని తెచ్చుకొనెను. (ఆ. ప్రె.)

(6) కృష్ణాజిల్లా, మచిలీపట్టణము, రాజుపేటలో ఒక గృహస్థుడు యుక్తవయస్సు జెందిన తనకుమార్తెకు వివాహము చేయ నిశ్చయించి పెండ్లికారికిని, బంధుమిత్రాదులకును

ఆహ్వానముల నంపియుండెను. ఆహ్వానింపబడినవారందరును వివాహమునకు వచ్చియుండిరి. మరుదినము ఉదయముననే సుముహూర్తము జరుగనున్నది. కాని ఆ రాత్రి ఏమి విచిత్రము జరిగెనో చూడుడు. పెండ్లికొమార్తె ఒక జ్ఞాని. సంసార సుఖములయందు ఆమెకు విరాగము కలదు. వివాహము చేసికొనుట కెంతమాత్రము వాంఛలేదు. ఆమె తన సంకల్పమును తల్లిదండ్రుల కనేకమారులు వెల్లడించినను పాపము! వారు లోకమునకు వెఱచి ఆమెకు వివాహముచేయ తలపెట్టిరి.

మఱునాడు ఉదయముననే మాంగల్యధారణ జరుగవలసియున్నది. ఆరాత్రి గడియారములోని, రెండుముల్లులును, ఏకమైయున్నవి. అప్పుడు దొడ్డి ఆవరణప్రదేశములో నొక అగ్నిజ్వాల మండుచుండెను. పెండ్లికుమార్తె స్నానము చేసి నూతనవస్త్రములను ధరించి నారాయణస్మరణము చేయుచు భగభగ మండుచున్న యా చితిపై పరుండి తదేకధ్యాననిమగ్నురాలై యుండెను. అప్పుడు రాత్రి రెండు ఝాములువేళ యైనందున అందరును గాఢనిద్రలో తగుల్కొని యుండిరి. కాని ప్రక్కయింటి యిల్లాలు బాహ్యశంక దీర్చుకొనుటకై దొడ్డిలోనికి వెళ్లగ, అంధకారముగ నుండవలసిన యా స్థలము దేదీప్యమానముగ వెలుగుచుండెను. నిశ్శబ్దముగ నుండతగిన యాతరుణమున 'నమో నారాయణాయ' అని ఒక స్త్రీనోటనుండి వాసుదేవతారకమంత్రము ధ్వనించుచుండెను. ప్రక్కయింటి ఆ యిల్లాలు దిగ్భ్రమ జెందుటచే అంతయు ఆమెకు అగమ్యగోచరముగ నుండెను. అయినను కొంచె

మోపికపట్టి మంటదగ్గరకు వెళ్ళిచూచెను. పెండ్లికూతురు మంటలలో కాలిపోవుచున్నది. దద్దరిల్లునట్లు ఆ యిల్లాలు కేక పెట్టగా, పెండ్లివా రందరును, చుట్టుప్రక్క జనులును ఆప్రదేశమునకు వచ్చి వాలిరి. పెండ్లికుమార్తెను వారు చితిపైనుండి లేవదీసిరి. ఇకను ప్రాణము లెంతసేపో నిలువలేదు. జీవాత్మ పరమాత్మలో లీనమైపోయెను. వధూవరుల వివాహము జీవబ్రహ్మల మైక్యముగ మారిపోయెను. పెండ్లికుమార్తెయైన ఆ విరాగిణి అగ్నిప్రవేశమునకు పూర్వమే యొక జాబును వ్రాసి యింటిలో పదిలపరచి యుంచెను. తా నొక సాధారణపురుషుని వివాహమాడుటకంటె పురుషోత్తముని పరిణయం బగుటయే తన అభీష్టమనియు, అగ్నిదేవుడే తనకట్టివివాహమును జరుపుననియు, ఆమె తనజాబులో తెలిపియుండెను.

చిత్తగించితిరా! కాలస్వరూపుడైన ఆ మృత్యువెట్టి అద్భుతచర్యను జరిపియుండెనో!

(7) మఱియొక చిత్రమును చూడుడు. ఇటీవల నొక బంగాలీస్త్రీ తన జాతకమును చూచుకొని ఆనాడు తనకు మరణము సంభవించు నని ఆజాతకమునం దుండుటచే వెంటనే ఆమె ఉరిపెట్టుకొని విగతప్రాణ యయ్యెను. ఆంధ్రపత్రికలోని యీ క్రింది అసోసియేటెడ్ ప్రెస్ వార్తను చిత్తగింపుడు.

"జ్యోతిషమును నమ్మి ఉరిపెట్టుకొనుట."

—రంగూను, జనవరి 18-1933.

డి. పి. డబ్ల్యు ఎకౌంటు గుమాస్తాగారి భార్య బెంగాలీస్త్రీ ఉఱిపెట్టుకొని యింటిలో చచ్చెను. ఆమె తనభర్తపేర

ఒక ఉత్తరము వ్రాసి మరణించెను. ఆ యుత్తరములో నిట్లు తెలిపెను. "నా జాతకములో నాకు బలవన్మరణము ప్రాప్తించు నని కలదు. అందువలన త్వరగ మరణించుట యుక్తమని యిట్లు చేసితిని. మీరు తిరిగి పెండ్లిచేసికొనవలెను. మన మిద్దరము వైకుంఠములో కలిసికొనెదము" (అ. ప్రె.)

(8) ఇంతియేగాక ప్రసిద్ధిపడసిన ఒక జడ్జీగారు జ్వర పీడితుడై తుదకు వ్యాధి నెమ్మదించి ఆరోగ్యమును బడసెను. కాని ఆతడు తన స్వగృహమున నొక పిస్తోలుతో కాల్చు కొని మరణించెను. జీవితకాలము సమాప్తి యైనప్పుడు మృత్యువు తన కార్యము నెట్లు నెరవేర్చుకొనునో యీ క్రింది విచిత్రసంభవము తెలుపకయే తెలుపుచున్నది.

"న్యాయమూర్తి ఆత్మహత్య చేసికొనుట."

లండన్, ఏప్రియల్ 26, 1933.

జస్టిస్ మెకార్డీగారు పెండ్లి చేసికొనలేదు. సంతాననిరో ధమును గూర్చియు, అనర్హులను వంధ్యులనుగా జేయుటను గూర్చియు నితడు పత్రికలకు చాల వ్యాసములను వ్రాయు చుండెను. ఈతడు దాపరికము లేక తన యభిప్రాయములను వెల్లడించుటచే ప్రపంచమునం దంతటను నీతనికి చాల విఖ్యాతి కలిగినది. ఇతనికి వారమురోజులక్రిందట ఇన్ఫ్లుయెంజా జ్వరము వచ్చి కుదిరినది. కాని దాని ఫలితము లింకను బాధిం చుచునే యుండెను. ఇతడు లండనులో తన స్వగృహమున పిస్తోలుతో కాల్చుకొని మృతినొందెను. ఈతని కాళ్ళమధ్య

నొక తుపాకి యున్నది. దానిమీటకు తగిలింపబడిన దారమును, అతడు పట్టుకొని యుండెను. అతని శరీరము రక్తములో మునిగి యుండెను. (ఆంధ్రపత్రిక 27-4-33)

(9) ఈ క్రింది సమాచారముకూడ వినతగియున్నది.

"నీటి ప్రమాదము"

రంగూనులో వకీలు కుటుంబనాశనము.

రంగూన్, ఏప్రిల్ 17, 1933.

బేసినులో వకీలుగా నున్న కె. కె. నాయుడు, బి. ఏ., బి. యల్. గారు తనభార్యతోను, ఏకైకపుత్రునితోను కాంతజిను సరస్సునొద్దకు షికారుపోగా బాలుడు నీటిచేరువను ఆడుచు నీటిలో పడెను. తండ్రి ఆతనిని తీయుటకు నీట దిగి రాలేక అవస్థపడుచుండగా, భార్య అతని సహాయమునకు బోయి, ఆమెకూడ నీటిలో మునిగిపోయెను. అచ్చటివారు అతిశ్రద్ధగ వెతుకగ, రాత్రి అగుసరికి పెద్దవారిశరీరములు రెండును దొరికినవి. మరునాటికి బాలునిశవముకూడ దొరికినది. వారివెంట వారి మేనల్లుడుకూడ పోయియుండెను.

(10) మఱియొక విచిత్రమరణమునుగూర్చి తెలుపవలసియున్నాము. విజయనగరము మహారాజాగారి కళాశాలా విద్యార్థి యొకడు జూన్ 7వ తేదీన ప్యాసెంజరురైలుక్రింద బుద్ధిపూర్వకముగ దూకి మృతినొందినట్లు ఈ క్రింది 10-6-33 తేదీగల "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" వార్త గమనించదగినది.

"కాలేజీవిద్యార్థి ఆత్మహత్య గావించుకొనుట"
విజయనగర సమీపమున విషాదసంభవము.

విజయనగరం, 8 జూన్ 33.

ఈ పురమునందలి మహారాజాగారి, కళాశాలావిద్యార్థి యగు వెంకటరావు అను నాతడు వాల్తేరునుండి వెడలు 3-వ నెం. ఎగువ మెయిలుబండిలో నిన్నటిదినము ప్రయాణము చేయుచుండెను గోపాలపట్నం జంక్షనులో రైలు నిలువగానే ఆతడు తనరైలు కంపార్టుమెంటులోనుండి దిగి ప్లాట్ ఫారం మీదను కొన్ని నిమిషములు అటునిటు తారట్లాడు చుండెను. రైలు కదలగనే, అతడు యింజనుయెదుట రైలుపట్టాల పై నిలువున దుమికెను. ఆతని శరీరము రెండుముక్కలుగ తెగిపోయెను. ఆతని జేబులో విజయనగరమువరకు తీసికొన్న టిక్కెట్టును, మూడుపావలా నాణెములును, ఒక కాగితపు చీటీయు గలవు. తన మరణమునకు తానే బాధ్యుడని ఆచీటిలో నాతడు స్వదస్తూరితో వ్రాసికొనియుండెను

అన్నింటికంటె మిక్కలి విచిత్రమైన మరణము మొన్న మొన్ననే బొంబాయి పట్టణములో జరిగినట్లు టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక ప్రకటించినది. ఒకన్యాయవాదికి కలలో దైవము కనబడి తనలో ఐక్యము కావలసిన దని చెప్పెనట. ఈ కలనిజమైన దని యీ న్యాయవాది నమ్మినవాడై తత్క్షణామే నల్లమందును తిని, నిండు ప్రాణములను పోగొట్టుకొనెనట. ఈ విషయమై ది 22-6-33 గల ఆంధ్రపత్రికలో నిట్లు తెలుపబడినది.

## "అన్ని తెలిసిన అజ్ఞానము".

### కలను నమ్మి న్యాయవాది ఆత్మహత్య.

ఈశ్వరుని ఆజ్ఞ ననుసరించుట.

బొంబాయిలో క్రిందటి సోమవారం ఉదయమున ఒక హిందూన్యాయవాది ఆత్మహత్య గావించుకొనెను. తన యిష్టదైవమగు బాలయీశ్వరుడు తన్ను మానవదేహమును విడిచి తనలో నైక్యము కావలెనని కోరినటుల యీ న్యాయవాది కలగనెనట. ఈయనపేరు ఎస్. జి సేను. ఈయన రాకోలీనుండి బొంబాయి వచ్చి "సర్దారుగృహ* అను హిందూ హోటలులో ఆదివారము బసచేసిరి. సోమవారము ఉదయమున హోటలు మానేజరు వచ్చి వీరి గదివద్ద పిలువగా లోపలనుండి ప్రత్యుత్తరము రాలేదు. కొంతసేపైన తరువాత అనుమానించి పోలీసువారికి తెలియజేసెను. 10 గంటలకు పోలీసువారు వచ్చి తలుపులను బ్రద్దలుకొట్టి లోన ప్రవేశించునప్పటికి స్నానము చేయు గదిలో నొకమూల సేనుగారు మరణించియుండిరి. సేనుగారు తనమిత్రులకును, బంధువులకును 6 ఉత్తరములను వ్రాసిరి. ఈ బంధుమిత్రులు రాకోలీనుండి తంతివార్తలను గూడ నిచ్చిరి. సేనుగారు తనబంధువులకు వ్రాసిన కడపటి ఉత్తరములో తనకు ఆదివారము రాత్రి కలలో దైవము తన్ను చేరమని కోరినటుల వ్రాసెను. ఈ న్యాయవాది కలను నమ్మి నల్లమందు తిని ఆత్మహత్య గావించుకొనెను. మృతకళేబరము ప్రక్కనే నల్లమందు, తదితర మందులు గల గ్లాసు పోలీసు వారికి కనబడెను*. (టైమ్సు ఆఫ్ ఇండియా)

పైన దెల్పిన విచిత్రసంఘటనలు మరణమునకు మూల కారణము లని అజ్ఞానులు తలంచుటలో వింతలేదు. పైన దెల్పిన రీతి మరణకారణము ఎల్లరకు ఒక్కటియేగాని అనేకము గాదు. మరణముయొక్క నెపమును దైవము తనపైన వేసికొనుట కిష్టములేక ప్రతివాని విషయములోను ఒక్కొక్క విచిత్రకారణమును కల్పించి అయ్యది ఆతని మృత్యువునకు సన్నిహితహేతు వని లోకదృష్టికి గోచరింప జేయుచుండును. దైవమున కొకవేళ నేకారణమును కాన్పించనిచో "హార్టు డిసీజు" అనగ, హృదయచలన మాగిపోవుట అను మిషను కల్పించి మరణమునకు తాను కారణము కానని తన యంమాయకత్వమును కనబరచుచుండును. ఇందులకు నిదర్శనము లనేకములు గలవు. వీనిలో నొకటి యిటీవలనే నీలగిరిజిల్లా ఉదకమండలములో జరిగినది. ఈక్రింది సమాచారమును వినుడు.

(**12**) నీలగిరిజిల్లాబోర్డు ఇంజనీరు ఆకస్మికమరణము.

**యు. సంజీవరావుగారు హృదయచలన మాగిపోవుట వలన మృతినొందుట:—**

ఉదకమండలము - **23** జూన్ **1933.**

"నీలగిరి జిల్లాబోర్డు యింజనీయరు యు. సంజీవరావుగారు నిన్నరాత్రి హఠాత్తుగా హృదయచలన మాగిపోవుటచే మృతినొందిరి. వీరి వయస్సు 47 ఏండ్లు. ఇతడు నిరుడే యిచటికి వచ్చెను. ఇతడు చాలా సమర్థుడును, ప్రజారంజకుడునైన

యుద్యోగి. ఇతడు చాల మండలములలో పనిచేసెను. నేడు మధ్యాహ్నము అంత్యక్రియలు జరిగినవి. చాలమంది పాశ్చాత్యులును, భారతీయులునుగూడ వచ్చిరి.

(ఆం. ప., 23-6-33, స్వ. వి.)

అవసానకాల మాసన్నమైనప్పుడు మృత్యుదేవత ప్రపంచములో ఎందరి నెన్నివిధములుగ పురికొల్పి వారి చేతులతో వారిని విగతజీవులుగ నొనర్చునో పైన తెల్పిన దృష్టాంతములు తెల్పుచున్నవి. ఈవిషయమై యీ క్రింది యితిహాసముకూడ సుబోధము కాగలదు.

ఒకనాటి అర్ధరాత్రమున నొకగ్రామములో నొకయింట దీపము మిణుకు మిణుకు మనుచుండెను. ఆయింటి తరుణవయస్కులైన దంపతులు గాఢనిద్రలో బడియుండిరి. ఇంటి కప్పులోనుండి హఠాత్తుగా నొక రెల్లుపుడక నేలపై బడెను దీనికి ఉలికిపడి భర్త నిద్రనుండి లేచెను. ఈ రెల్లుపుడక యేమైనది? చూచుచుండగనే అయ్యది యొక సర్పమై నిద్రబోవుచుండిన భార్యను కరచెను. వెంటనే ఆమెనోట నురుగులు గ్రక్కి చనిపోయెను. భర్తకు ఆశ్చర్యమును, దుఃఖమును గలిగెను. ఇంతలో ఆ పాము యింటినుండి వెడలిపోవుచుండెను. భార్యయొక్క అంత్యక్రియలను బంధువుల కొప్పగించి బ్రాహ్మణుడు ఆ పామువెంట పరుగిడెను. ఇంతలో నాపాము నక్కగా మారి యొక బాలుని కఱచి చంపెను. ఆనక్క మరియొక గ్రామమునకు దారిపట్టెను. దీని విచిత్ర

చర్యను కనిపెట్టవలెనని ఆ బ్రాహ్మణ యువకుడు నక్కను వెంబడించి పోవుచుండెను. నక్క యింతలో నొక పిచ్చికుక్కయై యిద్దరుబాటసారులను కరచి చంపెను. ఇంతలో తెల్లవారెను. పిచ్చికుక్క దున్నపోతుగ పరిణమించి మరికొందరిని హాత మొనర్చెను. ఇట్లుగ్రామమునకుబైట కొన్నిమైళ్ల దూరము రోడ్డువెంట ఆదున్నపోతు పోవుచుండెను. బ్రాహ్మణుడును దానిని విడువలేదు. మార్గమధ్యమున ఆదున్న 16 సం॥ ఈడుగల నొక సుందరాంగియై ఒక చెట్టునీడను విశ్రమించియుండెను. ఇద్దరు రాజపుత్రవీరులు ఆ బాటను వచ్చుచు, అప్సరసవంటి యీ బాలికను జూచి మోహావశులైరి. వీరిలో పెద్దవాడుఆకన్య యొక్క వృత్తాంతము నడిగెను. ఆమె ప్రత్యుత్తర మిచ్చుటకు పూర్వము తాను దాహపీడితనసియు, త్రాగుటకు నీళ్లుకావలెననియు ఆమె తెల్పెను. ఆరాజపుత్రయువకుని అచ్చట కావలియుంచి జ్యేష్ఠుడు ఒక పాత్రను గైకొని కొంచెము దూరములోనున్న కొలనియొద్దకుపోయి నీళ్లు తెచ్చి ఆ సుందరాంగికి అందీయబోయెను. కాని యా వనిత తనజుట్టును పీకుకొని, ఒడలంతయు రక్కుకొని పెద్ద పెట్టున నేడ్చుచుండెను. జ్యేష్ఠుడైన యీ రాజపుత్రవీరుడు ఆశ్చర్యచకితుడై ఆమె నందులకు కారణ మడిగెను. కావలియున్న రాజపుత్రయువకుడు తనను చెరుపదలంచి తన్ను నానావిధముల బాధించెననియు, ఎంత నిరోధించినను, ఆగలేదనియు, నిప్పుడు పెద్దవాని రాకవలన తన ప్రాణములు దక్కెననియు, దీనాలాపముల బల్కెను. రాజపుత్ర జ్యేష్ఠుడు యువకుడైన తన సోదరునిపై ఆగ్రహ

మూని యొరలోనుండి కత్తిని దూసెను. ఒకడు తనపై యుద్ధసన్నద్ధుడు కాగా, వెనుకకుతగ్గి వాదప్రతివాదములతో కాలము గడపుట రాజపుత్రుల లక్షణము కాదు. కాన యువకుడు కూడ యుద్ధమునకు తారసిల్లెను. హాహాహాహాకారిగా పోరాడి యుభయులును హతులైరి. ఈ యుద్ధక్రియను చూచుచుండిన యా కన్యాలలామ ముసిముసినవ్వు నవ్వుచుండెను.

పిమ్మట ఆమె పయనమై పోయి ఒక అరణ్యమును చేరెను. అచ్చట నీకన్య వృద్ధబ్రాహ్మణరూపమును దాల్చెను. ఈతూరి మన బ్రాహ్మణయువకు డాయనయెదుటబడి యిట్లు ప్రశ్నించెను. "స్వామీ! మీ రెవరో నాకు తెలియలేదు. మీరు కావించుచున్న విచిత్రచర్యల నన్నింటిని ప్రప్రథమమునుండియు గమనించుచున్నాను. మీ రిట్లుచేయుటకు కారణమేమి? మీ వృత్తాంతమంతయు తెలియగోరి ప్రార్థించుచున్నాను. ప్రత్యుత్తరమును దయచేయుడు." అని నుడువగానే "బ్రాహ్మణుడా! నీత్రోవను నీవు వెళ్లుము. అనవసరజోక్యము కల్పించుకొంటివేని నీకు ముప్పువాటిల్లు" నని ఆమాయావృద్ధబ్రాహ్మణుడు చెప్పినను యువకుడు లక్ష్యముచేయక "చావు వచ్చిననుసరే నాకు జవాబుచెప్పినగాని విడువను. నే నిచ్చోట ఆత్మహత్యను చేసికొనెదను. నీకు బ్రహ్మహత్యాపాపము చుట్టుకొనును. కాన నాప్రశ్నకు జవాబు నిచ్చి నాయభీష్టమును నెరవేర్పుడని ప్రార్థించెను. ఇందులకు మాయాబ్రాహ్మణు డిట్లనియె - "ఓ యువకుడా! నేను మృత్యుదేవతను. యమునిదూతను. నా యజమానునియాజ్ఞలను నెరవేర్చుటకే

నే నిన్ని కార్యములను జరిపితిని. ఒకపని సహాజస్థితిలో జరుగుట దుర్లభమని తోచినప్పుడు యమదూతలమైన మే మిట్లు స్వయముగ బయలుదేరి ఆ పనులను నెరవేర్చుచుందుము. కాన నికను నీతోఁ బ్రవను నీవు వెడలిపొమ్ము" అని వృద్ధబ్రాహ్మణుడు ప్రత్యుత్తర మిచ్చెను. కాని యువకుఁ డు తిరిగి ప్రశ్నించెను. 'స్వామీ! మరియొకమాట యున్నది. నేను ఎప్పుడు, ఎట్లు చనిపోయెదనో తమవలన యథార్థమును విన గోరుచున్నాను' అని అడిగెను. నీవు నీ పదునేనవయేట గంగా నదిలోనొక మొసలిచే పట్టుబడి మృతినొందెదవు అని ప్రత్యుత్తరమిచ్చి అంతర్ధానుఁ డాయెను.

బ్రాహ్మణయువకుఁ డీ యశుభవార్తను విని భయవిహ్వలుఁ డాయెను. కాని అట్టి దురవస్థను తప్పించుకొనుట కుద్దేశించి, ఆతడు తన స్వగృహామునకు వెడలకయే గంగానదియను పేరుకూడ తెలియని ఒకానొక దూరదేశమున కేగి అచ్చటనే జీవింప మొదలిడెను. ఆ దేశములో నొక పట్టణమున ఒక ధనికునియింట చేరెను. ఆధనికునకు బిడ్డలు లేరు. ఈ బ్రాహ్మణ యువకుడు అచ్చట జీవించు చుండిన కాలమున ధనికునిభార్య ఒక సుందరుఁ డైన బాలుని గైకొనివచ్చి, వానిని తన భర్త కొప్పగించెను. యువకబ్రాహ్మణుడు వచ్చిన వేళావిశేషము మంచిదిగనుకనే మన కీపిల్లవాడు లభించెనని యాదంపతులు సంతసించి యాబిడ్డను పుత్రునివలె, సాకుచు. యీ బ్రాహ్మణ యువకునివలన వానికి విద్య నేర్పించు చుండిరి. బాలుఁ డింతలో పెద్దవాఁడై గురుభక్తి గలిగి

తల్లిదండ్రులప్రేమకు గురియగుచుండెను. ఇట్లుండ నొకానొక సమయంబును అర్ధోదయమువంటి మహాపర్వ దిన మొకటి తటస్థించెను. ఆదేశజను లందరును గంగానదికి తీర్థయాత్రా పరులై వెళ్లి, నదీస్నానఫలమును సంపాదింప దలపెట్టిరి. ఈ ధనికుని కుటుంబముకూడ ప్రయాణమును సిద్ధపరచుకొనిరి. గురువుగారు కూడ బయలుదేరవలె నని ధనికుడు ప్రార్థించెను. కాని మృత్యుదేవత తనకు తెలిపిన జలమరణదినము బ్రాహ్మణుని స్మృతికి తగిలి యీ విషయమును బ్రాహ్మణుడు ధనికునకు నివేదించి తాను వెళ్లుటకు అసమ్మతిని వెలిబుచ్చెను. గురువువెళ్ల నందునశిష్యుడు వెళ్లుటమానుకొనెను. కుమారుడు పోనందున, తల్లిదండ్రులు ప్రయాణమును విరమించుకొనిరి

కాని యేబది సంవత్సరముల కొకతూరి వచ్చు నిట్టి పర్వదినంబున గంగాస్నానఫలంబును ఈ ధనవంతులు కోల్పోవుట కిష్టపడలేదు. గురువుగారిని ధనికుడు సమీపించి, "అయ్యా, గంగానదినిగూర్చి మీ కెట్టిభయము నుండ నక్కరలేదు. తీరమున నినుపగొలుసులు పాతించి యాత్రికులకు నెట్టి యపాయము సంభవింపకుండ సర్కారువారు సదుపాయములను జరిగించియున్నారు. భవిష్యత్తు ఎప్పుడును నిజమగుచుండునా? పంచాంగఫలము లెన్నిచోట్ల తప్పిపోయినవి? సోదెలో చెప్పినసంగతు లన్నియు సత్యములగుచున్నవా? మీ రిప్పుడు తీర్థమునకు రానిచో, మాపుణ్యమునుగూడ మీరు హరించినవా రగుదురు. మీరు తప్పక బయలుదేరవలెను. అందరిని కాపాడువాడు పరమేశ్వరు డుం

డగ, మీ రేల పిరికిచెందెదరు ?" అని ధనికు డనేకవిధముల ప్రార్థింప ఎంతయో కష్టముతో బ్రాహ్మణుడు తీర్థయాత్రి కొప్పుకొనెను. ఇంటి వారందరును ప్రయాణమైరి. సకాలము నకు బ్రాహ్మణుడుసహా ధనికునికుటుంబము వారు గంగాతీరం బున చేరిరి. ప్రథమమున ధనికుడు స్నానముచేసి తీర్థవిధిని ముగించుకొనెను. కుటుంబములోని వారందరు జలకమాడి జపతపాదులను పూర్తిచేసికొనిరి. ఇకను బ్రాహ్మణుని వంతు వచ్చినది. ఈతడు భయపడుచునే గంగలో కాలు పెట్టెను. గురువు గంగలో ప్రవేశించిన తత్క్షణమే శిష్యుడు గంగలోని కుఱికి మొసలిరూపమును దాల్చి గురువుగారిపాద మును బట్టుకొని జలమధ్యమున కీడ్చుకొనిపోయి ఆతని ప్రాణంబులను సంగ్రహించెను. చిత్తగించితిరా? పాప మీ బ్రాహ్మణుడు తన మృత్యువును తప్పించుకొనుటకై గంగా నదియొక్క పేరుకూడ తెలియని దూరదేశమున కాపురము చేయుచుంటిని గదాయని నిర్భయముతో నుండెను. కాని వాని మృత్యువు బాలునిరూపముతో నింతకాలము తనకు శిష్యుడై సేవించుచు అవసానకాలంబున మృత్యు రూపమును దాల్చి తనను మ్రింగివేయునని యాత డూహించి యుండలేదు. కాన మృత్యువును తప్పించుకొనుట కేరికిని సాధ్యము కాదని యీ యితిహాసము ఋజువుచేయుచున్నది.

## మృత్యు వెవరికి ?

అయితే పుట్టిన ప్రతివానికిని నిట్లు మృత్యువు నిశ్చ యమై యున్నయెడల మృత్యువును జయించిన కొందరు

మృత్యుంజయులు కలరను శాస్త్రవచనము అసత్యమా ? అని శంక కలుగవచ్చును. శాస్త్ర మెన్నటికిని అనృతము కాజాలదు. లోకములో "నేను ఈ దేహము. ఇది నాది." అని యెవరు అహంకార మమకారపాశములచే బద్ధులై యున్నారో వానికి జననమరణములు కలవు. "నేను దేహమును కాను. శుద్ధబోధస్వరూపుడగు ఆత్మనై యున్నాను." అని తెలిసిన వారికి జన్మమృత్యువులు లేవు. వీరికే మృత్యుంజయులు అని పేరు. ఈ విషయమై శ్రీకృష్ణపరమాత్మ అర్జునున కిట్లు బోధించి యున్నాడు.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని.

అనగ, 'ఓ అర్జునుడా ? ఆత్మజ్ఞానవిషయమునందువిశ్వాసము లేనట్టి నాస్తికులైన పురుషులు నన్ను బొందక మృత్యురూపమైన సంసారమార్గమందు తిరిగి తిరిగి పుట్టుచున్నారు.' అని అర్థము. అనగా దేహమే తా నని నమ్మియుండు దేహాభిమానికి మాత్రమే మృత్యువు కలదని తాత్పర్యము. ఈ మృత్యువునుండి తప్పించుకొనుటకు సాధనమును ఆ పరమాత్మయే యిట్లు తెలుపుచున్నాడు.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే,
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్.

అనగ 'నెవరు సమస్త కర్మలను నా యందు సమర్పించి నన్ను ఉత్తమగతిగా తలంచి యేకాంతభక్తితో ఉపాసించుచున్నారో వారలకు మరణాద్యనర్థములను కలుగజేయు అజ్ఞానమూలమగు నీసంసార సముద్రమునుండి శీఘ్రముగ కడతేర్చువాడ నగుచున్నాను.' అని తాత్పర్యము.

## మోక్షమార్గములు.

ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థములలో మోక్ష మొక్కటియే పరమపురుషార్థమని చెప్పబడుచున్నది. అట్టి మోక్షమునకై ప్రయత్నము చేయనివారు మానవులు కాజాలరు. వీరు మానవరూపముతో నున్న పశువులని శ్రీ శంకరభగవత్పాదులు తెల్పియున్నారు. ఎట్లన,

పురుషార్థత్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువం,
మోక్షార్థీ పురుష శ్శ్రేష్ఠః ఇతి వేదాన్తడిండిమః.

అనగ, 'ధర్మార్థకామము లను మూడు పురుషార్థములందాసక్తులైన వారు నిశ్చయముగ పశువులు. మోక్షమునకై ప్రయత్నించువాడే పురుషు డనబడును' అని అర్థము. కాన మోక్షమునకు మార్గము లేవియో తెలిసికొనుట ప్రతివానికిని కర్తవ్య మగుచున్నది. ముముక్షువులకు (1) ఆత్మవిచారము, (2) ఆత్మోపాసనము అను రెండుమార్గములను శాస్త్రము సూచించుచున్నది.

## (1) ఆత్మవిచారము.

దీనినిగూర్చి యిదివరకే తెలుపబడియున్నది. తిరిగి దీనిని గూర్చి సంగ్రహముగా నిచ్చట తెలుపుచున్నాను. ఆదియందును, అంతమందును, సత్యజ్ఞానానందపరిపూర్ణుడైన బ్రహ్మ మొక్కడే కలడు. ఈ బ్రహ్మమునందు త్రిగుణాత్మకమైన బ్రహ్మశక్తి అనాదిగ నుండి యున్నది బ్రహ్మమునకంటె నీశక్తి భిన్నము కాదు కాని యిది భ్రాంతిమూలకమై మిథ్యయై యున్నది. వస్తువుయొక్క యథార్థజ్ఞానము కలిగినతోడనే ఆ వస్తువు నావరించియున్న భ్రమ తొలగిపోవును. అట్లనే బ్రహ్మముయొక్క యథార్థజ్ఞానము కలిగినతోడనే బ్రహ్మము నావరించియున్న అనాదిభ్రాంతి నివర్తించుచున్నది. అయితే యీభ్రమ ఎప్పుడు కలిగినది? ఏలకలిగినది? అని ప్రశ్నించువారికి శుక్తియందు రజతాధ్యారోపము రజ్జువునందు సర్పాధ్యారోపమువలె నిష్ప్రపంచస్వరూపుడైన బ్రహ్మము నందు ప్రపంచమునకు మూలకారణమైన యీఅనాది మాయ ప్రకృతిసిద్ధమై యున్నది. అనగ బ్రహ్మమును, ఆయన శక్తి యగు ప్రకృతియు రెండును శబ్దార్థములవలె సహజముగ నుండుచున్నవి. సహజముగ నుండుదానిని గూర్చి ఎప్పుడు కలిగినది? ఏల కలిగినది? అను ప్రశ్న లుదయింపబాలవు. ఈ క్రింది పైంగలోపనిషత్తువాక్యములు గమనింపుడు.

సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, తం నిత్యముక్త మవిక్రియమ్ సత్యజ్ఞానానందం, పరిపూర్ణమ్ సనాతన మేకమేవా ద్వితీయం బ్రహ్మ, తస్మిన్ మరుశుక్తికాస్థాణు

స్ఫటికాద్వా జలరౌప్యపురుషరేఖాదివ ల్లోహితశుక్ల
కృష్ణగుణమయీ గుణసామ్యా నిర్వాచ్యా మూల
ప్రకృతి రాసీత్.

అనగ 'ఆదియందు పరిపూర్ణుడై సనాతనుడైన అద్వి
తీయ బ్రహ్మము కలడు. మరుభూమియందు జలమువలెను, శుక్తియందు రజతమువలెను, స్థాణువునందు పురుషునివలెను, స్ఫటికమునందు రేఖలవలెను, బ్రహ్మమునందు ఎఱుపు, తెలుపు, నలుపువర్ణములు గల రజస్సత్త్వతమోగుణముల సామ్యావస్థ నొంటియున్న మూలప్రకృతి సహజసిద్ధముగ నారోపింప బడియున్నది' అని అర్థము. ఈ మూలప్రకృతి యందు బ్రహ్మము అనగ శుద్ధచైతన్యము ప్రతిఫలించి సాక్షిచైతన్య మాయెను. ఎట్లన.

"తత్ప్రతిబింబితం, యత్తత్సాక్షిచైతన్య మాసీత్"
అని ప్రమాణముగలదు. పైనదెల్పిన సత్వరజస్తమోగుణములు వ్యత్యస్తములుగాక సామ్యావస్థలో నుండుటచే వానికి ప్రకృతి యని పేరువచ్చినది. కాని,

"ఏకోహం బహుస్యామ్"

అనగ ఒక్కడనైన నేను అనేక మగుదునుగాక అని సాక్షిచైతన్యమునందు సంకల్ప ముదయించుటతోడనే గుణ సామ్యమైన ప్రకృతి వ్యత్యస్తగుణమై వికృతి యాయెను. ప్రథమమున మూలప్రకృతియందు సత్వగుణము విజృంభించెను. ఈ సత్వగుణప్రధానమైన ప్రకృతికి మాయ యనియు, ఆవరణశక్తి యనియు పేర్లు. ఈ మాయావరణము

నందు ప్రతిబింబించిన చైతన్యము ఈశ్వర చైతన్యమాయెను. ఎట్లన,

సా పున ర్వికృతిం ప్రాప్య సత్వోద్రిక్తావ్యక్తాఖ్యావరణ
శక్తిరాసీత్, తత్ప్రతిబింబమ్ యత్తదీశ్వరచైతన్య
మాసీత్ స స్వాధీనమాయ స్సర్వజ్ఞస్సృష్టి
స్థితిలయానా మాదికర్తా జగదంకురరూపో భవతి.

అనగ మాయయందు ప్రతిఫలించిన యీశ్వరుడు మాయను స్వాధీనపరచుకొన్నవాడై సమష్ట్యాత్ముడై సర్వజ్ఞత్వముగలిగి సృష్టిస్థితి లయాత్మకమైన జగత్తునకు నిమిత్తకారణుడై యున్నాడు. వస్త్రమును చుట్టగా చుట్టుటయు, తిరిగి సాఫుగా పరచుటయు ఎట్లు సంభవమగునో అట్లనే ఈశ్వరుని యందు సకలజగత్తు లీనమైయుండి జీవులకర్మవశమున ఆ జగత్తు ఆవిర్భవించుటయు, కర్మక్షయముచే, తిరోధాన మొందుటయు, తటస్థించుచున్నది. ఎట్లన,

తస్మి న్విలీనం సకలం జగ దావిర్భావయతి
ప్రాణికర్మవశా దేష పటో యద్వత్ప్రసారితః
ప్రాణికర్మక్షయా త్పున స్తిరోభావయతి తస్మి న్నే
వాఖిలం విశ్వం సంకోచితపటవ ద్వర్తతే.

అనగ, చుట్ట జుట్టబడియున్న వస్త్రమువలె సకలప్రపంచమును ఈశ్వరుడు తనయందు లీనమొనర్చుకొని యున్నాడు అని అర్థము.

ఈశ్వరుని ఆవరించుకొనియున్న యీ మాయాశక్తి నుండి రజోగుణముద్భవించి విక్షేప అవిద్య ఆయెను. ఇందు ప్రతి

బింబించిన చైతన్యము భిన్నమై అందుండి వ్యక్తిజీవులు కలిగిరి. ఈ జీవులు తమ్మావరించిన యీ అవిద్యకు వశవర్తులై అస్వతంత్రులై సర్వజ్ఞత్వమును కోలుపోయి అల్పజ్ఞత్వమును పొందినవారైరి. పిమ్మట నీ యవిద్యయందు తమోగుణము విజృంభించి తామసి ఆయెను. ఇందు ప్రతిఫలించిన చైతన్యము జగత్సృష్టికి ఉపాదానకారణమగు మహత్తు ఆయెను. ఈ మహత్తునుండి అహంకారమును, అందుండి పంచతన్మాత్రలును, ఈ పంచతన్మాత్రలు పంచీకరణమొంది పంచమహాభూతములుగ పరిణమించెను.

బ్రహ్మణో రవ్యక్తం అవ్యక్తాత్ మహత్, మహతోఽహంకార అహంకారా త్పంచ తన్మాత్రాణి,పంచ తన్మాత్రేభ్యో పంచమహాభూతాని, పంచమహాభూతేభ్యోఽఖిలం జగత్.

పైన దెల్పిన పంచతన్మాత్రలవలన జీవులకు లింగదేహములు, లేక సూక్ష్మశరీరములు పుట్టెను. స్థూలములైన పంచమహాభూతములవలన స్థూలసృష్టి యేర్పడినది. దీనికే జగత్తు అనిపేరు. గుణసామ్యమై యేకమైయున్న మూలప్రకృతియందు సత్వరజస్తమోగుణములు ఒకటితరువాత నొకటి విజృంభించుటవలన ప్రకృతి వికృతియై జీవేశ్వర జగత్తులకు కారణమై యొప్పినది. రజ్జువునందు సర్పమువలె, బ్రహ్మమునందు మూలప్రకృతి భ్రాంతిరూపకముగ నారోపింపబడినదని తెలిపియుంటిని. మూలప్రకృతి జీవేశ్వరజగత్తులకు కారణము. కాన ప్రకృతి కారణము గాను, జీవేశ్వరజగత్తులు

కార్యములు గాను, ఉన్నవి. కారణమైన యీ మూలప్రకృతి బ్రహ్మముయొక్క సన్నిధానమహిమచే కార్యము లగు జగజ్జీవేశ్వరులను సృష్టించుచున్నది. ఎట్లన,

బ్రహ్మణ స్సకాశా న్నానావిచిత్రజగన్ని ర్మాణసామర్థ్యైక
బుద్ధిరూపబ్రహ్మశక్తిరేవ ప్రకృతిః.

అనగ, 'బ్రహ్మముయొక్క సన్నిధియందు అంతఃకరణరూపమున ఆయనశక్తి నానావిచిత్రమైన జగత్తును సృష్టించుచున్నది ఇదియే మూలప్రకృతి' అనిఅర్థము కార్యకారణములకు వస్తుతః భేదము లేదు. కారణాత్మకమైన మూలప్రకృతి మిథ్యయై యుండగ, కార్యములైన జగజ్జీవేశ్వరులు సత్యములనుట యొప్పదు. కాన అధిష్ఠానమైన బ్రహ్మమునందు జగజ్జీవేశ్వరులు మాయచే ఆరోపింపబడినవి. జీవునియందు నిద్రాశక్తి యున్నట్లు బ్రహ్మమునందు మాయాశక్తి గలదు.

నిద్రాశక్తి ర్యథా జీవే దుర్ఘటస్వప్నకారిణీ,
బ్రహ్మ ణ్యేషా స్థితా మాయా సృష్టిస్థిత్యంతకారిణీ.

అనగ, 'జీవునియందు నిద్రాశక్తి దుర్ఘటములైన స్వప్నపదార్థములను కల్పించుచున్నట్లు బ్రహ్మమునందలి మాయాశక్తి సృష్టిస్థితిసంహారాత్మకమై జగత్తును సృష్టించుచున్నది' అని అర్థము. మఱియు,

మృచ్ఛక్తివ ద్బ్రహ్మశక్తి రనేకా ననృతా న్సృజేత్,
యద్వా జీవగతా నిద్రా స్వప్న శ్చాత్ర నిదర్శనమ్.

అనగ 'మృత్తికయందున్న మృచ్ఛక్తి ఘటశరావాద్య నేకానృతవస్తువులను సృజించునట్లును, జీవునియం దున్న నిద్రాశక్తి అనృతములైన స్వప్నములను కలిగించునట్లును, బ్రహ్మమునందలి మాయాశక్తి మిథ్యయైన జగత్తును సృజించు చున్నది.' అనియర్థము. తనయందు కల్పింపబడిన స్వప్నము తనకు బయట నెచ్చటనో యథార్థముగ తోచినట్లు ఆత్మ యందు కల్పింపబడిన యీ జగత్తు ఆత్మకు బయట నెచ్చటనో సత్యముగా నున్నట్లు మాయవలన తోపింపబడుచున్నది. ఎట్లన,

విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం,
పశ్య న్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా

అసత్యమైన జీవుని స్వప్నము, ప్రబోధము (మెలకువ) వలన నశించి జీవుడు మాత్రమే నిలిచియున్నట్లు అనృతజడ దుఃఖాత్మకమైన యీ జగత్తు ప్రబోధము (జ్ఞానము) చేత అదృశ్యమై ఆత్మమాత్రమే నిలిచి యుండును. ఎట్లన,

'యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాఽద్వయం.'

అయితే కల్పితమైన యీ జగత్తును నశింప జేయు ప్రబోధ మెట్టిది?

> "యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్, వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం."

అనగ 'మృత్తికచే చేయబడిన ఘటశరావాదులు మృత్తికకంటె భిన్నములు కావు. ఇవి కేవలము నామరూప

ములు దాల్చినమృత్తికావికారములు. మృత్తికయొక్కటియే సత్యము. నామరూపము లసత్యములు.' మరియు,

యథా తరంగకల్లోలై ర్జల మేవ స్ఫుర త్యలం,
పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాండౌఘై స్తథాత్మనా,
ఘట నామ్నా యథాపృథ్వీ పటనామ్నా హి తంతవః
జగన్నామ్నా చి దాభాతి సర్వం బ్రహ్మైవ కేవలం.

అనగ, 'తరంగములు జలముకంటె భిన్నములు కావు. రాగిపాత్రలు రాగికంటె అన్యములు కావు. ఘటము పృథివి కంటె వేరుకాదు. వస్త్రము నూలుకంటె నితరము కాదు. అట్లనే జగత్తు చిత్తుకంటె భేదము కాదు' అని తాత్పర్యము. మఱియు,

మరుభూమౌ జలం సర్వం మరుభూమాత్ర మేవ తత్,
జగత్త్రయ మిదం సర్వం చిన్మాత్రం స్వవిచారతః.

అనగ, 'చవిటిభూమియందలి యెండమావులలోని జలము చవిటిభూమికంటె అన్యము కాదు. తద్వత్తుగ చక్కగ విచారించినయెడల ఈ జగత్తంతయు బ్రహ్మమేగాని యితరముకాదు' అని అర్థము. ఘటాకాశమునకును, మఠాకాశమునకును ఉపాధిభేదమే గాని వస్తుభేద మేమియు లేదు. అటులనే జీవేశ్వరజగత్తులకు గల భేదము మాయాసంబంధములైన ఉపాధులవలననే కలుగుచున్నది. కాని వాస్తవముగ జీవేశ్వరజగత్తులు ఒకేచైతన్యమై యున్నవి ఉపాధులు నశించినచో భేదములు సమసిపోవును. ఎట్లన,

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్వయం,
తథైవోపాధివిలయే బ్రహ్మైవ బ్రహ్మవి త్స్వయం.

అనగ, 'ఘటము నశింపగనే ఘటాకాశము మహాకాశమైన చందమున ఉపాధియైన మూలావిద్య నశించగనే బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే యగుచున్నాడు. బ్రహ్మమునందు కల్పింపబడిన జీవేశ్వరజగత్తుల అధ్యారోపము అపవాదముచే తొలగింపబడుచున్నది.' ఎట్లన,

అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే.

అనగ, 'అధ్యారోపాపవాదములవలన నిష్ప్రపంచస్వరూపుడైన బ్రహ్మము తెలియబడుచున్నాడు.' అని అర్థము. అపవాద మనగ కారణవ్యతిరిక్తముగ కార్యము లేదని యెఱుంగుటయే. మట్టితో జేయబడినకుండ మట్టికంటె నన్యము కాదు. స్వర్ణమువలన బుట్టిన కటకమకుటాదికార్యములు కారణమైన స్వర్ణముకంటె వ్యతిరిక్తములు కావు. చక్కెరతో చేయబడినచిలుక చక్కెరకంటె భిన్నముకాదు. అట్లనే బ్రహ్మశక్తియగు మాయవలన బుట్టిన యీ జగత్తు బ్రహ్మముకన్న భిన్నము కాదు. ఈ జగత్తునందు ఇంద్రుడు, చంద్రుడు, మనుష్యుడు, జంతువు, వృక్షము, రాయి, పంచభూతములు, అని అనేకనామరూపములతో కాన్పించుచున్న ఆ వస్తు వేది? అదియే బ్రహ్మము భేదదృష్టిగల అజ్ఞానికి ఈ జగత్తునందుఇంద్రాదినామరూపములే కాన్పించును. అభేదదృష్టి గల జ్ఞానికి బ్రహ్మ మొక్కటియే అగపడును. మిథ్యలైన నామరూపములను చూచుచున్న అజ్ఞానికి సంసారము

కలుగుచున్నది. మిథ్యలైన యీ నామరూపములను చూడక సత్యమైన బ్రహ్మమును చూచుచున్నజ్ఞానికి సంసారము నశించి మోక్షము కలుగుచున్నది. ఇట్లు విచారించి సత్యమును కనుగొనుట ఆత్మవిచార మనబడును. మోక్షమార్గములు రెండింటిలో నిది యొకటి.

## (2) ఆత్మోపాసనము.

ఇకను ఆత్మోపాసనమును గూర్చి తెలియవలసియున్నది. ఆత్మవిచార మార్గము, పరిపక్వమైన మనస్సు గలవారికిని ఆత్మోపాసనామార్గము రాగద్వేషాదులు నశించని వారికిని నుద్దేశింపబడినది.

పరిపక్వమనో యేషాం కేవలోఽయంచ సిద్ధిదః,
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్.

అనగ, 'శమదమాదులచే చిత్తశాంతి గలవారికి ఆత్మవిచారమార్గము త్వరలో సిద్ధించును. మఱియు దైవభక్తియు గురుభక్తియు గలవారికీ మార్గము సులభసూత్రముగ నుండును.' అని అర్థము. మఱియు,

బహువ్యాకులచిత్తానాం విచారా త్తత్వధీ ర్నహి,
యోగో ముఖ్య స్తత స్తేషాం ధీదర్ప స్తేన నశ్యతి.

అనగ, 'రాగద్వేషాదివృత్తులచే కలతనొందు చిత్తము గలవారికి ఆత్మవిచారమార్గము అనుకూలింపదు. కాన అట్టి వారికి ఉపాసనాపూర్వకమైన యోగము అవసరము. దీని

వలన వారి బుద్ధిచాంచల్యమును, మనోగర్వమును అణగును' అని అర్థము. ఉపాసనామార్గములలో మోక్షము నీయగలది నిష్కామనిర్గుణోపాసన యొక్కటియే అయియున్నది. నిష్కామమునకు శరీరాభిమాన ముండదు. ఇంద్రియ వ్యాపార మడుగంటును. చిత్తవృత్తులు నశించును. అందువలన ఆతడు అశరీరుడును, నిరింద్రియుడును నగుచున్నాడు. ఇట్టి వానికి ముక్తి సిద్ధించునని తాపనీయోపనిషత్తు తెలుపుచున్నది. ఎట్లన,

సోఽకామో నిష్కామఇతి హ్యశరీరో నిరింద్రియః,
అభయం హీతి ముక్తత్వం తాపనీయే ఫలం శ్రుతం.

అనగ, 'నిర్గుణోపాసకుడు మోక్షకామి యగుచు నితర కామములు లేనివాడు గనుక శరీరరహితుడును, నింద్రియములు లేనివాడును, సంసారభయరహితుడును నగుచున్నాడు. ఈతనికి మోక్షరూపఫలము కలుగునని తాపనీయోపనిషత్తు నందు కల'దని అర్థము. కాని చిత్తముయొక్క గర్వము నడంచుటకు యోగ మవసర మని తెలుపబడినది. యోగమునకు యమనియమాద్యష్టాంగము లున్నను, వీనిలో ధ్యాన మను నది ముఖ్యాంగము. ధ్యానముచేత మనోలయము, వాసనాక్షయము కలుగును. గాన దీనివలన పరవస్తువు లభ్యమగు నని తెలుపబడుచున్నది. ధ్యాన మనుదానికి ధ్యానయోగ మని కూడ పేరు కలదు.

వ్యక్తావ్యక్తపరం ప్రపంచరహితం ధ్యానైకగమ్యం విభుం
తం సంసారవినాశహేతు మజరం వందే హరిం ముక్తిదం.

అనగ, 'వ్యక్తావ్యక్తములకు పరమైనవాడును, నిష్ప్రపంచస్వరూపుడును, ధ్యానముచేతనే పొందదగినవాడును, సంసారతరణోపాయుడును, ముక్తి నిచ్చువాడు నగు హరిని నమస్కరించుచున్నాను. అని దీని కర్థము. ఈ శ్లోకములో "ధ్యానైకగమ్యం" అను వాక్యమునకు ధ్యాన మొక్కదాని చేతనే పొందదగినవాడు అని అర్థము. మరియు ధ్యానయోగముచేత సర్వపాపములు నశించి మోక్షము కలుగునని తెలుపబడుచున్నది. ఎట్లన,

యది శైలసమం పాపం విస్తీర్ణం బహుయోజనం,
భిద్యతే ధ్యానయోగేన నాన్యో భేదః కదాచన.

అనగ, అనేక యోజనముల విస్తీర్ణము కలిగి పర్వతమువలె నున్న పాపసమూహ మంతయు ధ్యానయోగముచేత గాక యితరసాధనములచేత నశింపజాలదు. మఱియు,

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్.

అనగ, 'ఓ అర్జునుడా! ఎడతెగని ధ్యానము అను అభ్యాసముతో గూడుకొనినదియు, నితరవిషయముల యందు ప్రవర్తింపనిదియు నగు మనస్సుచేత స్వయంప్రకాశుడైన పరబ్రహ్మమును ధ్యానించువాడు ఆ పరబ్రహ్మమునే పొందుచున్నాడు. అని అర్థము. ఈ ప్రమాణవాక్యములను బట్టి మోక్షము నిచ్చు ఉపాసనామార్గమునకు ధ్యానము ముఖ్య మని తేలుచున్నది. సంసారభయమునుండి తరింప

జేయు మహామంత్రమును అర్థజ్ఞానపురస్సరముగ మననము చేసి తద్ద్వారా మంత్రాధిష్ఠానదేవతయందు మనస్సును లీనమొనర్చుట ధ్యాన మనబడును. ఇక తారక మనగా

"తారకత్వాత్ తారకో భవతి. గర్భజన్మజరామరణ సంసారభయాత్ సంతారయతీతి తస్మా దుచ్యతే తారక మితి"

అనగ సంసారభయమునుండి తరింపజేయునది గనుక తారక మనబడును. తారకమంత్రము అను వాక్యములోని తారకపదమునకు అర్థము తెలుపబడినది. ఇకను మంత్ర మనగా నేమో విచారింపబడవలసియున్నది.

మకారం మననం ప్రైవ త్రకారం త్రాణ ఉచ్యతే,
మననత్రాణ మిత్యాహు ర్మంత్ర మిత్యభిధీయతే.

అనగ 'మకారమునకు మనన మనియు, త్రకారమునకు త్రాణము, అనగ రక్షించుటనియు, మననముచేత రక్షించునది గనుక మంత్రము' అనియు తాత్పర్యము. ఇట్టి తారకమంత్రముమును అర్థసహితముగ ఏకధారగా అనుసంధానము చేయవలెను. "తజ్జప స్తదర్థభావనా" అనగ మంత్రముయొక్క అర్థమును భావనచేయుటయే జప మనబడును. ఇట్లు మంత్రమునందలి చైతన్యమును భావనచేయక నోటితో శబ్దము నుచ్చరించినంతమాత్రమున ప్రయోజన ముండ నేరదు. ఎట్లన,

మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః,
శతలక్షప్రజప్తోపి తస్య మంత్రో న సిద్ధ్యతి.

అనగ, 'మంత్రముయొక్క అర్థమును మంత్రాధిష్ఠాన చైతన్యముతో నైక్యపరచి యేసాధకుడు తెలిసికొనడో అట్టి వాడు కోటిపర్యాయములు మంత్రములు జపించినను, వానికి మంత్రసిద్ధి కలుగనేరదు.' అని అర్థము.

## మంత్రశాస్త్రము.

మంత్రము, మంత్రసిద్ధి నెట్లు కలుగజేయునో తెలిసి కొనుటకు గాను మంత్రశాస్త్రమును గూర్చి యొకింత తెలియుట అవసరమైయున్నది. బ్రహ్మమునకు మంత్రశాస్త్రము నందు బిందువు అని పేరు గలదు. బిందువుయొక్క శక్తికి బీజము అని పేరు. ఈ బిందుబీజముల సమ్మేళనమువలన నాదము లేక శబ్దబ్రహ్మము కలుగుచున్నది. ఈ విషయమై యోగమునకును, మంత్రమునకును గల తారతమ్యము ఈ క్రింద కనుబర్చబడుచున్నది.

రాజయోగము :—(ఆత్మవిచారము) బ్రహ్మము + ప్రకృతి = కుండలినీ శక్తి.

మంత్రయోగము :—(ఆత్మోపాసనము) బిందువు + బీజము = నాదము లేక శబ్దబ్రహ్మము.

సృష్టి త్రివిధము. :— (1) బిందువునుండి సదాశివ, ఈశ్వర, రుద్ర, విష్ణు బ్రహ్మలు కలిగిరి. (2) బీజమునుండి మహత్తు, అహంకారము, తన్మాత్రలు, లింగశరీరము కలిగినవి. (3) తన్మాత్రలనుండి పంచభూతములు, స్థూలశరీరములు, చతుర్దశభువనములు కలిగినవి.

నాదము లేక శబ్దము :— ఇది మూలాధారమునందలి కుండలినీశక్తియందు ప్రారంభ మగుచున్నది.

ఈశబ్దము (1) పర (2) పశ్యన్తి, (3) మధ్యమ, (4) వైఖరి యను నాలుగు స్థాయిలుగా వచ్చుచున్నది. సంస్కృత భాషయందలి ఏబది అక్షరములును కుండలినినుండి యుత్పత్తి యగుచున్నవి. ఈ యుత్పత్తికి 'పర' అనబడును. మన మే శబ్దమైనను ఉచ్చరించుటకు ప్రారంభించగనే ఓమ్ అను ప్రణవశబ్దము ఆదియందు కలుగును. కాన అన్నిశబ్దములకును, లేక అన్నిమంత్రములకును ప్రణవమే మూల మగుచున్నది. శబ్దము కుండలినినుండి నాడులద్వారానున్ను, కంఠముద్వారానున్ను వచ్చుచున్నది. ఈ నాడులమధ్యను సూక్ష్మరంధ్రము లుండుటచే నివి గొట్టములను బోలియుండును. ఈ నాడులు నాభికి కొంచెము క్రిందుగవచ్చి చేరును. ఈ నాభిస్థానము నాడుల యొక్క కూడలి ప్రదేశమైయున్నది. ఈ నాడులగుండా దశవిధప్రాణవాయువులు సంచరించును. ఈ నాడులలో ఇడ, పింగళ, సుషుమ్న యనునవి ముఖ్యమైనవి. సంస్కృతభాష యందలి ఏబది అక్షరములలో

1. ఇడనాడిగుండ అకారాదిస్వరములున్ను,
2. పింగళనాడినుండి కకారాదివ్యంజనములున్ను,
3. సుషుమ్ననాడినుండి యకారాది అంతస్థములు, ఊష్మములున్ను

కలుగును. ఈ ఇడ, పింగళ, సుషుమ్నానాడులకు వరుసగ చంద్ర, సూర్య, అగ్నులు, అధిష్ఠానదేవతలై యున్నారు.

1. ఇడనాడినుండిబయల్వెడలుశబ్దములుసౌమ్య(సోమ)
2. పింగళనాడినుండి బయల్వెడలు శబ్దములు, ఊష్మ,
3. సుషుమ్నానాడినుండి బయల్వెడలు శబ్దములు)
వ్యాపకము లనబడును.

పైన దెల్పిన సౌమ్య ఊష్మముల సంయోగమువలన కలిగిన యకారము మొదలు, క్షకారమువరకు కల వ్యాపకాక్షరములు మంత్రనిర్మాణమునకు ముఖ్యము లై యున్నవి. ఏలనన, ఉపాసకుడు అర్థించుఫల మంతయు మంత్రమునందుపయోగింపబడు నీ వ్యాపకాక్షరములను బట్టియుండును. అక్షరములయొక్క ధ్వని యెచ్చట ప్రారంభమై, యే యే స్థాయిలుగా వచ్చి యెచ్చట అంతమొందుచున్నవో ఆ స్థాయిల నామములు ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

1. కుండలినినుండి నాడులవరకు వచ్చు శబ్దము = పరా.
2. నాడులమధ్యమునందు గలుగు శబ్దము = పశ్యన్తి
3. నాడుల చివరనుండి కంఠమువరకు గలుగుశబ్దము = మధ్యమ.
4. కంఠమునందు గలుగు శబ్దము = వైఖరి.

కోరిన ఫలమును కలిగించుటకుగాను ఏర్పడిన శబ్దసమ్మేళనమునకు 'మంత్రము' అని పేరు. ఈ మంత్రములలో 1 మొదలు 1000 (Syllabls) అక్షరములుగాని అక్షరసముదాయములుగాని యుండును. ఈ అక్షరములు ఆయాఫలముల ననుసరించి మంత్రశాస్త్రవిధిచొప్పున మంత్రములుగా కూర్ప

బడి యున్నవి. కాన నివి మిక్కిలి శక్తివంతములై యుం డును. నాలుగు అక్షరములతోగాని అంతకంటె తక్కువ సంఖ్య గల అక్షరములతోగాని కూర్పబడిన మంత్రములను విభజిం చుటకు వలనుపడదు. ఈ మంత్రములయందు మంత్రాధి దేవతల యొక్క పేర్లను చేర్చుటకు అవకాశము లేదు. మం త్రములయం దుపయోగింపబడిన బీజాక్షరములను జాగ్రత్తగ పరీక్షించి ఈ మంత్రములయొక్క అధిదేవతలను తెలిసికొన వచ్చును. అయిదుఅక్షరములుగాని అంతకంటె నధికమగు నక్షరములు గాని కలిగిన మంత్రములయందు మూడు అంగ ము లుండును.

1. ప్రణవము.
2. కోరబడిన ఫలమును సూచించు బీజములు.
3. మంత్రాధిదేవత పేరు.

I ప్రణవము: ఇది మంత్రముల కన్నిటికిని మాతృక యై యున్నది ఇయ్యది మంత్రముయొక్క శక్తికి వేగమును కలిగించును. ఈ కారణముచేతనే సర్వమంత్రములకును ఆది యందు ఓమ్ అను ప్రణవమును చేర్చి చెప్పుచున్నారు. ఎట్లన,

తస్మా దో మిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్.

అనగ, 'బ్రహ్మవాదులయొక్క యజ్ఞదానతపఃక్రియా దులు శాస్త్రవిధిచొప్పున ఓమ్ అని ఉపక్రమించి ప్రవర్తించు చున్నవి.' అని అర్థము. కాన మంత్రములకేగాక కర్మలన్నిం

టికిని ఆదియందు ప్రణవము ఉండుట అవసరమగుచున్నది. అని తేలినది.

II కోరబడిన ఫలములు:— మంత్ర ఫలములు 8 విధములు. (1) వశ్య, (2) ఆకర్షణ, (3) మోహన, (4) స్తంభన, (5) విద్వేషణ, (6) మారణ, (7) ఉచ్చాటన, (8) ఆప్యాయన. ఉపాసకుడు కోరు నీ ఫలమును సూచించు బీజాక్షర సముదాయములు నాలుగు కలవు.

| | మంత్రఫలములు | వీనిని సూచించు బీజాక్షరములు |
|---|---|---|
| (1) | వశ్య, ఉచ్చాటన, ఆకర్షణ, | హూమ్. |
| (2) | మారణ, | ఫట్. |
| (3) | స్తంభన, విద్వేషణ, మోహన | నమః. |
| (4) | ఆప్యాయన, | వౌషట్. |

ఈ నియమము ప్రారంభకులకు మాత్రమే యుద్దేశింప బడినది. కాని మంత్రసిద్ధి నొందినవారు తమ ధారణాశక్తిని యథేచ్ఛముగా నుపయోగించగలరు. అట్టివారు తమ కార్యసిద్ధికై యేబీజముల నైన నుపయోగించి కోరిన ఫలమును సంపాదించగలరు. కాన మంత్రోపాసనకు రెండువిషయములు ముఖ్యావసరములు.

(1) ధారణాశక్తి

(2) మంత్రబీజముల పటుత్వము.

ఈ రెంటినిబట్టి ఉపాసకునకు ఫలము లభించు చుండును. మొత్తముమీద 7 కోట్ల మంత్రములు కలవు. మంత్ర

బీజములను 26 విధములుగ మార్చికూర్చవచ్చును. వీనికి ఛందస్సు లని పేరు కాన మంత్రము లన్నియు 26 ఛందస్సు లలో కూర్చబడినవి.

మంత్రములు పనిచేయు విధము: (Working).

మంత్రములయందు గల మూలసిద్ధాంత మేమనగా కొన్ని బీజాక్షరములను పలుకగనే ఉపాసకుని శరీరమునందును అంతఃకరణమునందును చుట్టునుగల ఆకాశమునందును కొన్ని స్పందములు (Vibrations) పుట్టును. వీని ఆవేగస్వభావములను బట్టి ఆ స్పందనశక్తి సూక్ష్మలోకమునకును, సూక్ష్మాకాశంబునకును కొంపోబడి ఒకవిధమైన ఫలమును కలిగించును.

III మంత్రాధిదేవత:— కొన్ని సూక్ష్మశక్తుల సమ్మేళనమునకు దేవత, లేక దైవము అనిపేరు ఈ దేవతలు సూక్ష్మలోకవాసులై యున్నారు వీరికిని మంత్రబీజములకును అనిర్వాచ్యమైన ఒకానొక సంబంధము గలదు.

విషయజ్ఞానము.

మనస్సునకు ఇంద్రియములద్వారా బాహ్యప్రపంచమునందలి విషయములు తగులగనే మనస్సు వృత్తులుగ పరిణామమొందును. ఈ వృత్తులు మేఘములవలె ఆవరణముగ నేర్పడి స్వరూపజ్ఞానమును కలిగించు సత్త్వగుణమును మరుగుపరచును.

"సత్త్వాత్సంజాయతే జ్ఞానం"

అనగ, 'సత్త్వగుణమువలననే జ్ఞానము కలుగును' అని అర్థము. మనోవృత్తులవలన సత్త్వగుణమిట్లు మరుగుపడుటచే

జీవులకు రజస్తమస్సులు విజృంభించి వీరిని అజ్ఞానము, దుఃఖము, కిడు - ఇటువంటి సంసారకష్టములకు లోనుజేసి బాధపరచు చుండుట తటస్థించుచున్నది. కాని యీ వృత్తులు సత్త్వాంశ ముతో కూడినప్పుడు వృత్తినిరోధంబు కలుగును. అప్పుడు జ్ఞాతకు స్వరూపస్థితి కలుగును. అప్పుడు వ్యష్ట్యాత్మయగు జీవునియందలి శ్వాస, సమష్ట్యాత్మయగు నీశ్వరునియొక్క శ్వాసతో సమ్మేళన మగును. అనగ, పిండాండమందలి శ్రుతి లేక రాగము బ్రహ్మాండమునందలి శ్రుతి లేక రాగముతో మేళనము (athenement) నొందును. అప్పుడు వ్యష్టి సమష్టు లకు అనగ జీవేశ్వరులకు స్వారైక్యము కలుగును. అనగ జీవునకు స్వరూపజ్ఞానము కలిగి ఆత్మోపలబ్ధి కలుగును.

మంత్రోపాసనవలన కలుగు ఫల మిదియే. ఉపాస కుడు తాను అనుసంధానము చేయు మంత్రాధిదేవతయొక్క చైతన్యమునందు తన చైతన్యమును లీన మొనర్చగలుగును. అనగ తన నావరించుకొనియున్న ప్రకృతిసంబంధమగు ఉపాధి క్రమముగ హరించిపోవుటవలన తాను నిరుపాధికు డగును. అప్పుడు ఏకత్వము ప్రాప్తించును. దీనికే మంత్రసిద్ధి యనిపేరు. ఇట్టి మంత్రోపాసనమువలన కలుగు వృత్తినిరోధమువలన శ్వాస (వాయువు) దాని యంతట నదియే లయ మగును. దీనికి కుంభక మనిపేరు. ఇది రాజయోగపద్ధతి. హఠయోగు లిట్లుగాక శ్వాసనిరోధము మూలముననే ముక్తిని సాధించ వచ్చు నని చెప్పెదరు. వృత్తినిరోధము మూలమున శ్వాస నరికట్టి ముక్తిని సాధించుట సౌమ్యపద్ధతి.

కేవలము శ్వాస నరికట్టుపద్ధతి మూఢపద్ధతి యగును. దీనివలన అణిమాదిసిద్ధులు కలుగవచ్చును. గాని సంసారబంధ విముక్తి నిచ్చు జ్ఞానము కలుగుట దుర్లభము. కాన ఉపాసకుడు మంత్రమును అనుసంధానము చేయుటద్వారా చిత్తము నందలి రజస్తమోగుణములను నాశ మొనర్చి తద్ద్వారముగ కలిగిన సత్త్వగుణమువలన వృత్తినిరోధమును, పిమ్మట స్వరూపజ్ఞానమును, అందుండి మోక్షమును పొందుటకు సదుపాయము కలుగును. (1) సత్త్వాపత్తి, (2) వృత్తినిరోధము, వీని ద్వారా ఉపాసకుడు మంత్రసిద్ధి నొందగలడు.

అయితే మంత్రము లనేకము లున్నవిగదా, వీనిలో నే మంత్రమును ధ్యానించిన ముక్తి సిద్ధించునో తెలియ వలసి యున్నది

ప్రణవోపాసన.

సర్వేషాం చైవ మంత్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే

అనియు,

ఓంకార స్సర్వమంత్రాణా ముత్తమః పరికీర్తితః,

అను ప్రమాణవాక్యములను బట్టి ఓం అను ప్రణవ మంత్రమే సప్తకోటిమహామంత్రములకు మకుటమై ప్రాణ తుల్యమై, ఉత్తమమై, యొప్పుచున్నదని అర్థము. ఈ కారణముచేతనే-

ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యతి.

అనగ, సముద్రమును దాటుటకు ఓడ యెట్టిదియో, సంసారసముద్రమునుండి తరింపజేయుటలో ఓంకార మను నావ అట్టిది అని అర్థము. మఱియు,

ప్రణవా దపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి.

అనగ, 'ప్రణవమునకంటె నితరమైన మంత్రమును జపించువాని కెప్పుడు ముక్తి సిద్ధించును?' అని అర్థము. కాన ప్రణవమంత్రధ్యానమే ముక్తిప్రద మని తెలియుచున్నది. ఇకను ప్రణవముయొక్క స్వరూపమును ముందుగ తెలిసికొనుట అవసర మగుచున్నది.

ఓంకారప్రభవా దేవాః ఓంకారప్రభవా స్స్వరాః,
ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరం.

అనగా 'దేవాదిదేవత లందరును ఓంకారము నుండియే పుట్టుచున్నారు. స్వరము లన్నియు ఓంకారమునుండియే ఉద్భవము లగుచున్నవి.' సకలచరాచరప్రపంచమును ఓంకారము నుండియే కలుగుచున్నవి. అని అర్థము. పురుషోత్తముడైన పరమాత్మ తనశక్తియైన మూలప్రకృతిని వశపరచుకొని ఆ శక్తియొక్క సత్వరజస్తమోగుణముల సమ్మేళనముచేత జగజ్జీవేశ్వరులుగ పరిణమించి యీ జగద్వ్యాపారమును జరుపుచున్నాడు. కాన పరమాత్మ కేవలము నిర్గుణుండే గాక సగుణుడు కూడ అయి యున్నాడు.

సగుణ నిర్గుణ స్వరూపం బ్రహ్మ, ఆదిమధ్యాంతశూన్యం
బ్రహ్మ, సర్వం ఖల్విదంబ్రహ్మ.

అని తెలుపబడినది. మఱియు.

అచింత్యావ్యక్తరూపాయ, నిర్గుణాయ గుణాత్మనే,

అనగ, 'మనస్సున కందనివాడును, అవ్యక్తరూపుడును, సగుణనిర్గుణుడును, అగు పరమాత్మ' అని యర్థము. ఈ జగ

జీవేశ్వరసంసారమును కల్పించు సగుణస్థానమును పరమాత్మ యందు ఏకదేశమై యున్నదిగాని సర్వత్రి లేదు.

న కృత్స్నబ్రహ్మవృత్తి స్సా శక్తిః కిం త్వేకదేశభాక్,
ఘటశక్తి ర్యథా భూమౌ స్నిగ్ధమృ ద్యేవ వర్తతే.

అనగ సంసారవృత్తిని కలిగించు మాయాశక్తి బ్రహ్మము నందు ఒక ప్రదేశమున మాత్రమే గలదు. కాని అంతటను లేదు. కుండలను చేయు శక్తి భూమియం దంతటను లేక ఏక దేశమైన మెత్తని మట్టియందుమాత్రమే కల దనుట యిందు లకు నిదర్శనము. ఈ కారణముచేతనే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయం దిట్లు తెలిపియున్నాడు.

విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

అనగ 'సమస్త జగత్తును నేను ఒక యంశముచేతనే వ్యాపించి యున్నాను' అని యర్థము. సగుణస్వరూపమైన యీ విశ్వ మంతయు ఒక పాదమనియు, దాని ఊర్ధ్వమందు ముక్తి ప్రదమైన తక్కిన మూడుపాదములును ఉన్నట్లు కూడ తెలుపబడినది. ఎట్లన,

పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాద స్యామృతం దివి.

ఇట్లు, 'ఏకపాదమైన యీ సగుణబ్రహ్మము రజస్సత్వ తమోగుణముల భేదమువలన మూడు స్థాయిలుగా ప్రవర్తించు చున్నాడు. వానిపైన నిర్గుణనిరాకారచైతన్యము నాల్గవ స్థాయియై నిలిచియున్నాడు. బ్రహ్మమునకు నాలుగు స్థాయి లున్నట్లు ప్రపంచమునకుకూడ నాలుగు స్థాయిలు

చెప్పబడియున్నవి. బ్రహ్మముయొక్క నాలుగు స్థాయిలు లేక నాలుగుపాదములకు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మ అను పేర్లున్నట్లు ప్రణవముయొక్క నాలుగుస్థాయిలకు అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు అను నామములు కలవు. మొదటిది జాగ్రత్ స్థానమైన స్థూలశరీరము. రెండవది స్వప్నస్థానమైన సూక్ష్మశరీరము. మూడవది సుషుప్తిస్థానమైన కారణశరీరము. నాల్గవది తురీయస్థానము. మొదటిది రజోగుణమువలనను, రెండవది సత్వగుణమువలనను, మూడవది తమోగుణమువలనను కలుగుచున్నది. నాల్గవది నిర్గుణము కనుక గుణాతీతమని పిలువబడుచున్నది. ఈ విషయమును మాండూక్యోపనిషత్తు సువ్యక్తపరచుచున్నది.

జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమ మాత్రా,
స్వప్నస్థాన స్తైజస ఉకారో ద్వితీయమాత్రా,
సుషుప్తిస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయమాత్రా.

అర్ధమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమ శ్శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశ త్యాత్మనాత్మానం య ఏవం వేద.

ఈ శ్రుతి బ్రహ్మముయొక్క నాల్గుపాదములును ప్రణవముయొక్క నాల్గుమాత్రలతో పోల్చి వర్ణించియున్నది. మొదటి మూడును అనగ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు సర్వజీవులకు అనుభవైకవేద్యములే. నాల్గవదియగు తురీయము జ్ఞానులకుమాత్రమే గోచరము. ఈ నాల్గవస్థాయి యొక్క స్వరూప మీదిగువ విశేషముగ వర్ణింపబడియున్నది.

అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచిం
త్య మవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్యయ సారం ప్రపం
చోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యన్తే,
స ఆత్మా స విజ్ఞేయః.

అనగ, 'మనస్సునకు అందనిదియు, వ్యవహారశూన్యమైనదియు, ఎట్టి లక్షణములు లేనిదియు, చింతింప శక్యము కానిదియు, నిర్దేశింప శక్యముగానిదియు, ఏకమైనదియు, వృత్తులుపశమించినదియు, శాంతశివస్వరూపమైనదియు, అద్వితీయమైనదియునగు నేతురీయుని మననము చేయుచున్నారో అదియే ఆత్మయని యెఱుంగవలెను.'

కృత్స్న మోంకారగతించ సర్వధ్యానయోగజ్ఞానానాం,
యత్ఫలం ఓంకారో వేద పర ఈశో వా.

అనగ, ఓంకారస్వరూపము నంతయును మఱియు సర్వధ్యానయోగజ్ఞానములయొక్క ప్రయోజనమును, ప్రణవోపాసకుడే యెఱుగును. లేదా పరమేశ్వరునికే తెలియుక. అనగా, ప్రణవోపాసకుడు సాక్షాత్తుగ పరమేశ్వరుడే యగుచున్నాడని తాత్పర్యము. కాన పైన చెల్పిన ప్రకారము, ప్రణవము బ్రహ్మస్వరూప మని యెఱిగి, ప్రణవ మంత్రము నుపాసించు నిష్కామునకు మోక్షము కలుగును.

అయితే ప్రణవోపాసకుడు ప్రణవానుసంధానము చేయునప్పుడు దృష్టినెచ్చట నిలుపవలెను? ప్రణవస్వరూపము

నెట్లు భావన చేయవలెను? ఈ ప్రశ్నలకు సమాధానము తెలియవలసియున్నది.

హృత్పద్మకర్ణికామధ్యే స్థిరదీపనిభాకృతిం,
అంగుష్ఠమాత్ర మచలం ధ్యాయే దోంకార మీశ్వరమ్.

అనగ 'గాలిలేని స్థలములో వెలుగు దీపమువలె ప్రకాశించునదిగాను అంగుష్ఠమాత్రపరిమాణము గలదిగాను, హృదయపద్మకర్ణికామధ్యమునందు ఆత్మను నీశ్వరునిగ భావించి ఓంకారము నుచ్చరించుచు ధ్యానించవలెను' అని అర్థము. హృదయము, భ్రూమధ్యము, సహస్రారము, నాసికాగ్రము - ఈ స్థానములు అభ్యాసకునకు లక్ష్యములుగ చూపింపబడినవి. కాని కొంత అభ్యాసము కుదురువరకు మాత్రమే దృష్టిని పైన చెల్పిన స్థూలభాగములయందు నిలుపుట యవసరము కాని పిమ్మట త్రిపుటి నశించినట్టియు మనోలయము నొందినట్టియు నిరాలంబమునే లక్ష్యముగ నెంచవలసియుండును. ఎట్లన,

అభ్యాసకానా మిద మాదికాలే
భ్రూమధ్యసంస్థం ప్రతిభాతి సూక్ష్మం,
పశ్చా దవాఙ్మానసగోచరం ప్రభో
లభేయ మేతాదృశవస్తు నిత్యం.

అనగ 'ధ్యానము నభ్యసించువారలకు ఆరంభదశలో భ్రూమధ్యమందు లక్ష్యమును పరిశీలించవలెను గాని కొంత అభ్యాసము కుదిరిన పిమ్మట మన స్సెచ్చట లయించునో అచ్చటనే ఆత్మవస్తువును పొందవలసియున్నారు.' అని తాత్ప

ర్యము. ఇట్టి దృష్టికి జ్ఞానదృష్టియనియు, అభేదదృష్టియనియు, సమదృష్టియనియు, సాత్త్విక దృష్టియనియు పేర్లు. ఈ దృష్టితో చూచిన వారికి జగత్తు బ్రహ్మముగ కాన్పించును. ఎట్లన,

దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యే ద్బ్రహ్మమయం జగత్,
సా దృష్టిః పరమోదారా న నాసాగ్రావలోకినీ.

అనగ, 'దృష్టిని లేక అంతఃకరణవృత్తిని అఖండాకార వృత్తినిగా జేసి జగత్తును బ్రహ్మముగా చూడవలెను. ఇదియే పరమోదారమైన దృష్టి కాని కేవలనాసికాగ్రమును చూచుట దృష్టి కానేరదు.' అని అర్థము. అయితే ప్రపంచమును బ్రహ్మ స్వరూపముగ జూచుట కెట్లు సాధ్యపడు ననగా,

ద్రష్టృదర్శనదృశ్యానాం విరామో యత్ర వా భవేత్,
దృష్టిస్తత్రైవ కర్తవ్యా న నాసాగ్రావలోకినీ.

అనగా, 'చూచువాడు, చూచుట, చూడబడువస్తువు అను త్రిపుటి యెక్కడ లయమొందునో అచ్చట అంతఃకరణ వృత్తి నిలుపవలెను. కాని నాసికాగ్రమున కాదు' అనిఅర్థము. ఇట్లు హృదయకమలము నందుమాత్రమే ఆత్మ కలదని చెప్పుటలో తక్కిన శరీరభాగములయందు లేడని తలంచరాదు. నువ్వులలో నూనె యున్నదనియు, పుష్పమునందు సుగంధ మున్నదనియు తెలిసినప్పుడు మన కేమి యర్థ మగుచున్నదో ఆ యర్థమునే మన మిచ్చట గ్రహించవలసియున్నాము.

పుష్పమధ్యే యథా గంధః పయోమధ్యే యథా ఘృతం,
తిలమధ్యే యథా తైలం పాషాణేష్వివ కాంచనం ।

ఏవం సర్వాణి భూతాని మణౌ సూత్ర ఇవాత్మని,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః

అనగ 'పుష్పమునందు సువాసనయు, క్షీరమునందు ఘృతమును, నువ్వులలో నూనెయు, రాతిలో సువర్ణమును ఎట్లు సర్వత్ర వ్యాపించియున్నవో, మఱియు ఒక్క దారములో అనేకమణు లెట్లుకూర్చబడియున్నవో, అటులనే చరాచరంబు లన్నియు పరమాత్మయందు కూర్చబడియున్నవి. అజ్ఞానము నశించి స్థిరచిత్తమునొందిన జ్ఞాని పరమాత్మస్వరూపుడే యగుచున్నాడు అని' అర్థము. మఱియు,

తిలానాంతు యథా తైలం పుష్పే గంధ ఇవాశ్రితః,
పురుషస్య శరీరేతు స బాహ్యాభ్యంతరే స్థితః.

అనగ 'నువ్వులయొక్క సర్వాంగములయందు నూనెయు, పుష్పముయొక్క సర్వావయవములందు సుగంధమును, ఏలాగున వ్యాపించియున్నవో, ఆలాగున జీవుల శరీరములయందు లోపలను బయటను సర్వత్ర ఆత్మ వ్యాపించియున్నాడు' అని అర్థము. దేహమునం దిట్లు బాహ్యాభ్యంతరములులేక సర్వత్ర వ్యాపించియున్న ఆత్మను, ఆదేహమునుండి విడదీసి ఎట్లు గ్రహించనగును? అను విషయము ఇకను నిర్ధారణ కావలసి యున్నది. కష్ఠములో దాగియున్న అగ్ని, తరచుటవలన బయటకు వచ్చుచున్నది. నువ్వులను గానుగలో వేసి పిండినచో నూనె వచ్చుచున్నది. పుష్పమునునలిపినచో వాసన బహిర్గత మగుచున్నది. పాలలో నుండు నెయ్యి చిలికినయెడల కా

న్పించుచున్నది. అట్లనే ధ్యానమను క్రియవలన అంతఃకరణ మందలి చైతన్యము ప్రకాశ మగుచున్నది. ఎట్లన,

యథాఽగ్ని ర్దారుమధ్యస్థో నోత్తిష్ఠే న్మథనం వినా,
వినా చా భ్యాసయోగేన జ్ఞానదీప స్తథా నహి.

అనగ 'కట్టెలోని యగ్ని మథించుటవలనగాక మఱి యొకవిధముగ నెట్లు బహిర్గతము కాజాలదో అటులనే జీవుని యందలిజ్ఞానజ్యోతి ఆత్మానాత్మానుసంధానపరమగు ధ్యానయోగమువలనగాక అన్యథా ప్రకాశింపనేరదు' అనిఅర్థము. కట్టెను మథించి, అగ్నిని తీయు ఆచార మిప్పుడు నశించినను, పూర్వకాలమున ఆ పద్ధతియేఅమలులోనుండెను. ఇప్పటికిని యజ్ఞయాగాదిపవిత్రకర్మలను చేయువారు అరణిని మథించి యాగాగ్నిని తీయుచున్నారు. అరణి అనగా యాగాగ్నికొఱకు తయారుచేయబడిన కొయ్య అని అర్థము. యాగమునందట్టి కొయ్య నొకదానిని క్రిందుగాను మఱియొకకొయ్యను దానికి పైగా నుంచి మథించెదరు. ఈ రాపిడివలన అగ్ని యుద్భవించును. అటులనే ప్రణవధ్యానము చేయునప్పుడు. మనస్సును పూర్వారణిగను, ప్రణవమును ఉత్తరారణిగను భావించి యీ రెంటి యొక్క సంబంధమునుండి బ్రహ్మాగ్నిని గ్రహించవలె నని తెలుపబడి యున్నది. ఎట్లన,

ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం,
ధ్యాననిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యే న్నిగూఢవత్.

అనగ జీవాత్మను లేక మనస్సును పూర్వారణిగను, ప్రణవమును ఉత్తరారణిగను గావించి ధ్యాన మనెడి నిర్మథనాభ్యాసమువలన దేహమునందు నిగూఢముగానుండు బ్రహ్మమును పొందనగును. పైన దెల్పినధ్యాననిర్మథనకాలమందు మనస్సు ఏకాగ్రతను తప్పరాదు. ధనుర్బాణములతో పిట్టను కొట్టువాడు తన శరీరమునుగాని, మనస్సునుగాని ఏమాత్రము చలింపజేసినను, గుఱి తప్పిపోవునట్లు, ఆత్మధ్యానము చేయు కాలమందు ధ్యాత, తన దృష్టిని చలింపజేసినచో లక్ష్యము చెడిపోవును. ఎట్లన,

ప్రణవో ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మత ల్లక్ష్యముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్.

అనగ 'ధ్యానయోగి ప్రణవమును ధనుస్సుగాను, మనస్సును బాణముగాను అనుసంధించి బ్రహ్మమును లక్ష్యముగా నుంచుకొనవలెను. మఱియు నిశ్చేష్టుడై, సంకల్పరహితుడై ధ్యానము చేసినచో బాణమును ధనుస్సునందుంచి యేకాగ్రమనస్సుతో సంధించిన బోయవాడు గురినితప్పక భేదించునట్లు ధ్యానయోగియు తన లక్ష్యమును భేదించగలడు' అని అర్థము. ప్రణవము నుపాసించునప్పుడు ప్రణవమూలమైన అకారమాత్రనుండి క్రమముగ మనస్సును ప్రాణవాయువుతోను శబ్దముతోను చేర్చి లేవనెత్తి ఉకారమాత్ర గుండా పోనిచ్చి పిమ్మట మకారమాత్రయందు ప్రవేశపెట్టి తుదకు ప్రణవాగ్రమగు తురీయమునందు లయముచేయవలసియుండును. దీర్ఘఘంటానాదమునందువలె ప్రథమమున ప్రణవ

ధ్వని స్థూలముగను, క్రమశః అయ్యది సూక్ష్మాతిసూక్ష్మమై తుదకు నిశ్శబ్దమగును.

తైలధారా మివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్,
అవాచ్యం ప్రణవస్యాగ్రం య స్తం వేద స వేదవిత్.

అనగ అవిచ్ఛిన్న తైల ధారవలె ఘంట వాయించినప్పుడు కలుగు దీర్ఘధ్వనివంటిదియు, ఇంద్రియంబుల కగోచరమైన దియు ప్రణవముయొక్క తురీయపాదము నెవడు తెలుసు కొనుచున్నాడో వాడే బ్రహ్మజ్ఞాని యనబడును' అని అర్థము. ప్రణవాగ్రమునందు శబ్దము క్షీణించి నిశ్శబ్ద మగును. ఆ నిశ్శబ్దస్థానమే బ్రహ్మము. శబ్దముతో గూడ వెడలిన మనః ప్రాణములు శబ్దము వెంట క్రమముగ లేచి సూక్ష్మాతిసూక్ష్మములై తుదకు నిశ్శబ్దమునందు లయమగును.

శబ్ద శ్చాక్షరే క్షీణో నిశ్శబ్దం పరమం పరం.

అనగ 'శబ్దము క్రమముగ అక్షరుడైన పరబ్రహ్మము నందు చేరి నిశ్శబ్దమై అచ్చట లయమగుచున్నది.' అని అర్థము. ఇట్లు దృశ్యములైన దేహేంద్రియమనంబులు దృక్కగు బ్రహ్మమునందు ప్రవేశించి బ్రహ్మాకార మెట్లగునో తెలియ వలసియున్నది. అగ్నిలో నినుమును వేసి కాచినయెడల ఆ యినుము అగ్నిమయమై పోవును. ఎట్లన,

అగ్నిసంగా ద్యథా లోహ మగ్నిత్వ మధిగచ్ఛతి,
ఆత్మసంగా త్తథా గచ్ఛ త్యాత్మతా మింద్రియాదికం.

అనగ, 'అగ్నిలోఁబెట్టిన లోహ మేలాగున అగ్నిమయమై మారునో ఆలాగున ఆత్మధ్యానమునందు నిమగ్నమైన యిందిృయాదికము ఆత్మాకారాకారిత మగును' అని అర్థము. మఱియు, అగ్నిలో పుటము వేయబడిన మలినమైన బంగారము మాలిన్యము నశించి శుద్ధ మగుచందమున ధ్యానాగ్నివలన మనస్సు సత్వరజస్తమోగుణమాలిన్యమును కోల్పోయి పరిశుద్ధమగును. ఎట్లన,

యథా సువర్ణం పుటపాకశోధితం,
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృధ్యతి,
తథా మన స్సత్వరజస్తమోఽమలం,
ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్.

అనగా, అగ్నిలో పుటము వేయబడిన మలినబంగారము మాలిన్యమును పోగొట్టుకొని తన నిజప్రకాశముతో నెట్లు ప్రకాశించునో అట్లనే, ధ్యానాగ్నియందు ప్రవేశించిన మనస్సు ప్రకృతిసంబంధమైన మలమును విడిచి శుద్ధచైతన్యముగ ప్రకాశించును, అని అర్థము. అయితే, వృధాగా మన మనస్సును ఏల యిట్లు నాశన మొనర్చుకొనవలెనని కొందరు శంకించుచున్నారు. ఇందులకు సమాధాన మేమన మట్టియందు కుండను కల్పించు శక్తి యున్నట్లు, నీటియందు తరంగములను పుట్టించు శక్తియున్నట్లు, జీవునియందు స్వప్నములు కలిగించు నిద్రాశక్తియున్నట్లు, జగత్తును కల్పించు మాయాశక్తి బ్రహ్మమునందు కలదు. ఈ మాయయే మనస్సుగా మారి సంసారరహితు డగు ఆత్మకు జన్మమృత్యుజరావ్యాధిసంసార

భయములను కలిగించి జీవత్వమును పొందించుచున్నది. కాన సమస్తసుఖదుఃఖములకు నీమనస్సే కారణ మగుచున్నది. ఈ మనస్సువలన గలిగిన జగత్తు, మనస్సు నశించినగాని నమసి పోదు. ఎట్లన,

చిత్తం కారణ మర్థానాం తస్మి న్సతి జగత్త్రియమ్,
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం త చ్చికిత్స్యం ప్రయత్నతః.

అనగ, 'సమస్త ఇంద్రియార్థములకును మనస్సే కారణము. అది నిలిచియుండునంతవరకు సుఖదుఃఖములను కలిగించు నీ జగత్తు నిలిచియుండును. అది నశించిన యెడల జగత్తు నశించును. కాన మనోనాశమునకు మందు వేయవలసి యున్నాము' అని అర్థము.

"యోగ శ్చి త్త వృ త్తి ని రో ధః"

అన్నట్లు మనస్సుకు ముందు ఉపాసనమే కాని అన్యము కాదు. ఆత్మకు అవిద్యామలము అనాదిగను, స్వతస్సిద్ధముగ నున్నను పురుషప్రయత్నమను బ్రహ్మనిష్ఠచే అయ్యది నశించ గలదు. ఆత్మ అనాదియు, అనంతమునై యున్నది. కాని అవిద్య ఆత్మవలె అనాదియైయున్నను, సాంతమైయున్నది. అనగ, ఆత్మజ్ఞానముచే నయ్యది నివృత్తియగును. బియ్యమునకు పొట్టు సహజముగ నున్నను, దంపుటవలన అయ్యది ఊడి పోవును. అట్లనే జీవుని అజ్ఞానముకూడ జ్ఞానయోగముచే నశించగలదు.

తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా,
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలం,
జీవస్య తండులస్యేవ మలం సహజమ ప్యలం,
నశ్యత్యేష న సందేహ స్తస్మా త్త్వం యత్నవా న్భవ.

అనగ 'సహజముగనుండు బియ్యముమీదిపొట్టు దంచుట చేతను, రాగియొక్కచిలుము స్ఫుటముచేతను, ఏలాగున నశించునో, ఆలాగున జీవుని సహజమైన మాలిన్యము బ్రహ్మధ్యానముచే నశించును. ఇందు విషయమై సందేహ మేమియులేదు. కాన ప్రయత్నమునకు పూనవలెను.' అని అర్థము. ఒకే వస్తువు పొట్టుతోకూడినచో వడ్లుఅనియు, పొట్టు ఊడినచో బియ్యమనియు ఎట్లు చెప్పబడుచున్నదో అట్లనే ఒకే చైతన్యమును అవిద్యాకార్యమైన కర్మముచే బద్ధుడైనప్పుడు జీవుడనియు, ఆకర్మ నశించినపుడు శివుడనియు పిలువబడుచున్నాడు. ఎట్లన,

తుషేణ బద్ధో వ్రీహిః స్యా త్తుషాభావే తు తండులం,
ఏవంబద్ధ స్తథా జీవః కర్మనాశే సదాశివః.

ఈ ప్రమాణము పై అర్థమును స్పష్టపరచుచున్నది. కాన ప్రణవస్వరూపుడైన బ్రహ్మమును సర్వదా భావనచేయుటవలన జీవుడు శివు డగుట సత్యము. ఏలయన తదేకధ్యానముతో నేవస్తువును ధ్యానించెదమో తదాకారాకారితమగుట ప్రకృతిధర్మమై యున్నది. కీటకము భ్రమరమును

చింతించి భ్రమరాకారము దాల్చినట్లు జీవుడు శివునిధ్యా నించి శివుడగు ననట సత్యము. ఎట్లన,

భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా,
పుమాం స్తద్ధి భవే చ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్.

అనగ 'ఒకడు నిశ్చయబుద్ధితో నేవస్తువును భావించిన ఆత డావస్తువు కాగలడు. భ్రమరకీటన్యాయముగ జ్ఞాత జ్ఞేయ మును ధ్యానించి జ్ఞేయాకార మగుచున్నాడు' అని అర్థము కాన బ్రహ్మమును పొందదలచినవారు.

"అహం బ్రహ్మాఽస్మి."

అనగ నేను, బ్రహ్మమునై తిని అని నిశ్చయాత్మకబుద్ధి తోను, తీవ్రవేగముతోను. నిరంతరము ధ్యానించవలసియు న్నారు. అట్లు జరిపినయెడల మహాతేజముతో కూడిన యొక నది మహాతేజముతో నిండియున్న సముద్రమును ప్రవేశింపగ ఆ తేజ స్తరంగములు ఆ తేజస్సముద్రరాశియందు అణగి పోయినట్లు ఆత్మోపాసకుడు అహంబ్రహ్మాస్మి యని నిరంతర ధ్యానము చేయుటవలన సర్వపరిపూర్ణాద్వైతపరమానంద లక్షణపరబ్రహ్మమైన నారాయణుడగు నాయందు ఆతడు అజుడై, పరిపూర్ణుడై ప్రవేశించును. అప్పు డా యుపాసకుడు పరబ్రహ్మమే యగుచున్నాడు' అని మహానారాయణోప నిషత్తునందు భగవానుడు యిట్లు తెలిపియున్నాడు.

"అహం బ్రహ్మేతి భావనయా యథా పరమ తేజో
నదీప్రవాహాః పరమ తేజఃపారావారే ప్రవిశతి; యథా

పరమతేజఃపారావారతరంగాః పరమతేజఃపారా
వారే ప్రవిశన్తి, తథైవ సచ్చిదానందాత్మో
పాసకః సర్వపరిపూర్ణాద్వైతపరమానందలక్షణ పర
బ్రహ్మణి నారాయణేమయి, సచ్చిదానందాత్మకోఽహ
మజోఽహం పరిపూర్ణోఽహ మస్మీతి ప్రవివేశ మదుపాసక
స్తస్మా న్నిరతిశయాద్వైతపరమానందలక్షణ పర
బ్రహ్మ భవతి.

ఇట్టి ప్రణవోపాసకు డెక్కడ నేవిధముగ మరణించి నను ఆతఁ డచ్చటచ్చట సర్వపరిపూర్ణాత్మస్వరూపము నందు లయ మగును.

యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన వా కేన మృత్యునా,
యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః.

అనగ, 'సర్వమునుపొందియున్న ఆకాశమువలె బ్రహ్మజ్ఞాని యెచ్చ టెచ్చ టేప్రకారముగ మరణము నొందినను, అచ్చ టచ్చట ఆ ప్రకారముగనే బ్రహ్మమునందు లయ మొందును' అని అర్థము. ఇట్టి నిష్కామ, నిర్గుణోపాసకుని ప్రాణములు తక్కినవారి ప్రాణములవలె మరణకాలమునందు ఉత్క్రమణము నొందవు. అనగ పైకి లేచిపోక అచ్చటనే లయమగును. ఎట్లన -

సోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో న
తస్య ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే.

అనగా, నిష్కాముడై, మోక్షకామి యగు నిర్గుణోపాసకుడాప్తకాముడగుచు ఆత్మకాముడగుచున్నాడు. ఆతని ప్రాణములు పైకి ఎగసిపోక అచ్చటనే లయమగుచున్నవి. ఆతడు బ్రహ్మమే యగుచు మోక్షము నొందుచున్నాడు' అని తాపిన్యుపనిషత్తు ప్రమాణమును తెలుపుచున్నది.

మోక్షమును కలిగించు రెండుమార్గములలో రెండవది యగు ఆత్మోపాసనామార్గమునుగూర్చి విమర్శనము ఇంతటితో సమాప్తమైనది.

## ఉపసంహారము.

ప్రహ్లాదుని సందేశమునకు వ్యాఖ్యాన మింతటితో ముగిసినది. సందేశములోని ముఖ్యవిషయములు విస్తరించి తెలుపబడినవి. వ్యాఖ్య నుపసంహరించుచు ప్రహ్లాదుని సందేశమునందలి సారమును తిరిగి స్మృతికి తెచ్చుచున్నాను.

"నేను ఓంకారస్వరూపుడను. ప్రణవమే నా శరీరము. జీవుల హృదయకమలకర్ణికామధ్యమున నే నిప్పుడు స్వయంజ్యోతినై వెలుగుచున్నాను. కాని మాయ యను తెరచాటున దాగియున్నాను. నామీద మీకు ప్రేమ నభివృద్ధిచేయుటకే నే నిట్లు మరుగుపడియున్నాను. నువ్వులలో నూనె దాగియున్నట్లు దేహములో దేహినై నేను దాగియున్నాను. నువ్వులను పిండి, నూనెను తీసినట్లు, ఆత్మోపాసనమువలనను, ఆత్మ విచారణవలనను దేహమునందలి దేహిని గ్రి

హించవలసియున్నారు. జీవునియందుగల నిద్రాశక్తి మిథ్యయైన స్వప్నమును కల్పించుచున్నట్లు బ్రహ్మము నందలి మాయాశక్తి మిథ్యయైన యీజగత్తును కల్పించుచున్నది. మెలకువ అను జాగ్రత్తవలన, స్వప్నము నశించునట్లు, ప్రబోధము అను మహాజాగ్రత్తవలన జగత్తు నశించును. సంస్కారబంధ విముక్తి ప్రబోధముతోపాటు వైరాగ్యమును, ఉపరతియు అవసరము. భయమువలన మరణము కలుగుచున్నదిగాని, మరణమువలన భయ మెన్నటికిని లేదు దేహాభిమానమే మరణము. లోకమునందు దుఃఖములవలన కృశించుచున్నవారికి నా 'అచింత్యా సందేశము' నందజేయుట కర్తవ్యము."

జీవన్ముక్తుడైన యీ ప్రహ్లాదగాంధి యిప్పుడు తన వ్యక్తిదేహమును చాలించి విదేహముక్తుడై సర్వదేహముల యందును సమష్టిరూపమున ప్రవేశించి యేమి చేయుచున్నాడు? సర్వదేహములలో నుండియు తా నాదేహముల నంటక ఆకాశమువలె నిర్లేపుడై యున్నాడు.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.

అనగ, 'ఆకాశము సూక్ష్మమగుటవలన అయ్యది అన్ని వస్తువులలో వ్యాపించియున్నను, ఏలాగున నది ఆ వస్తువికారములచే నంటబడుట లేదో, అట్లనే ఆత్మ సమస్త శరీరముల

యందున్నను, ఆతడు ఆ శరీరధర్మములచే నంటబడుటలేదు' అని అర్థము. మఱియు-

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత.

అనగ, 'ఒక్కడైన సూర్యుడు సమస్తలోకముల నెట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లనే హృదయక్షేత్రమం దున్న యీతడు సమస్తక్షేత్రములను వెలిగింప జేయుచున్నాడు. ఇదివరకు మానవాకారముతో మనకండ్ల యెదుట ప్రత్యక్షముగ కాన్పించియుండిన ప్రహ్లాదగాంధి యిప్పుడు సమస్త హృదయక్షేత్రములలో ప్రవేశించి పరోక్షముగ నుండుటకు కారణ మేమి? భగవంతునకు షోడశోపచారపూజ నొనర్చు భక్తునకుమాత్రమే యీ కారణము గోచరించునుగాని తక్కిన వారికంతగా సువ్యక్తముకాదు. భగవదారాధనము చేయనెంచిన భక్తుడు ప్రథమమున పూజాసంకల్పము చేయును. పిమ్మట నొకపీటపైన ఒక విగ్రహము నుంచును. లోపల తన హృదయకమలమునందు నివసించియున్న తన హృదయేశ్వరునిబయట కాహ్వానము చేసి పీటపై నున్న ప్రతిమపై నిలిపి ప్రాణప్రతిష్ఠ నొనర్చును. అనగ తనదేహములోని ఆత్మను బయట నీ విగ్రహమునందు ప్రవేశపెట్టి పూజ సంపూర్తియగువరకు నీ విగ్రహము నందుండుమని ఆ హృదయేశ్వరుని ప్రార్థించును. ఇందుకు సంబంధించిన ఆహ్వానమంత్రమును వినుడు.

ఓం శ్రీపరమేశ్వరప్రాణః మమప్రాణః, శ్రీపర
మేశ్వరజీవః మమ జీవః, వాఙ్మనశ్చక్షు శ్శ్రోత్ర జిహ్వా
ఘ్రాణైః, ఉచ్ఛ్వాసరూపేణ బహిరాగత్య అస్యాం
ప్రతిమాయాం సుఖేన చరన్ తిష్ఠంతు స్వాహా.
స్వామిన్ సర్వజగన్నాథ! యావత్పూజావసానగా,
తావ త్త్వం ప్రీతిభావేన బింబేఽస్మిన్ సన్నిధిం కురు.

భక్తుడు ఈ మంత్రముచే భగవంతుని ఆహ్వానము చేయును. దీని అర్థ మేమనగా, 'ఓ స్వామీ! నీప్రాణమే నా ప్రాణము. నీజీవమే నాజీవము. నా లోపలనుండి నీ విప్పుడు నావాక్కు, చక్షువు, శ్రోత్రాది యింద్రియముల ద్వారా ఉచ్ఛ్వాసరూపంబున బయటకువచ్చి, యీ విగ్రహమునందు ప్రవేశించి స్థిరముగ నుండుము మఱియు నేను చేయబోవుపూజ సమాప్తి యగుపర్యంతము నిచ్చట నేయుండుము.' అని పై మంత్రముయొక్క అర్థమైయున్నది. భక్తుడు తన లోని భగవంతుని తనచేతులార పూజించి కృతార్థతనొందుటకై ఆయనను తనలోపలనుండి బయటకు రప్పించును. పిమ్మట భక్తిశ్రద్ధలకొలదియు ఆయనకు తాను అర్ఘ్యపాద్యస్నాన వస్త్ర గంధ పుష్ప ధూప దీప నైవేద్యాది షోడశోపచార పూజలు చేసి ఆయనను తృప్తిపరచి ఆ తృప్తివలన తానును తృప్తి జెందును. పూజానంతరము భక్తుడిట్లు నివేదించును.

అనయా ధ్యానావాహానాది షోడశోపచారపూజ
యా భగవాన్సర్వాత్మకః శ్రీ పరమేశ్వర స్సుప్రీతో
సుప్రసన్నో వరదో భవతు.

అనగ, 'ఓభగవానుడా! నేనిప్పుడొనర్చిన యీషోడశోపచారపూజవలన నీవు సంప్రీతిని జెంది నన్ననుగ్రహింతువుగాక' అని దీని అర్థము. ఇట్టి నివేదన పూర్తి కాగానే,

యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమాన్యాసన్, తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః.

శ్రీ పరమేశ్వరం యథాస్థాన ముద్వాసయామి - అను నీ మంత్రమును చెప్పి విగ్రహమునం దిదివరలో తానారోపించి యుండిన తనలోని భగవానుని తిరిగి తనలోనికి బంపి తన యాత్మలో నైక్యము చేసికొనుచున్నాడు. ఉపచారములు చేయునిమిత్తమేగదా మనలోని భగవంతుని నిట్లు బయట కొంతకాలము నిలిపి ఉపచారపూజ అయినపిమ్మట ఆ భగవంతుని తిరిగి మనలోనికే ఉద్వాసన మొనర్చుచున్నాము.

భగవంతునకును, భక్తునకును మధ్యగల యీ సంబంధమును అర్థముచేసికొనగలవారుమాత్రమే యిప్పుడు ప్రహ్లాదగాంధియొక్క నిర్యాణరహస్యమును గ్రహించగలరు. ఓంకార నిలయవాసులు భగవంతునకు సాక్షాత్తుగ తమ చేతులతో ఉపచారములు చేసి తద్ద్వారా తాము కృతార్థులు కావలెనని సంకల్పించగా ఆ పరమేశ్వరుడు 'ప్రహ్లాదిని' అను బిరుదము నొందిన జ్ఞానప్రసూనాంబయొక్క పవిత్రగర్భమున ప్రథమమున ప్రవేశించి అచ్చటనుండిన నవమాసములు భగవద్గీతార్థమును శ్రవణముచేసి పిమ్మట బాహ్యప్రపంచమునకు వచ్చి

ప్రహ్లాదగాంధి యనునామముతో పదునెనిమిదిమాసములు తనభక్తులవలన ప్రేమపూర్వకముగ సమస్తదేవోపచారంబులను చేయించుకొని తృప్తినొంది అనంతరము బాహ్యశరీరము నుండిలేచి పిమ్మటతన్నారాధించిన భక్తుల హృదయములలోనికి తిరిగి ప్రవేశించి యున్నాడు. ఈ విషయమై ఓంకారనిలయవాసులు చరితార్థులు, కృతార్థులు, ధన్యాత్ములునై యున్నారు. పదునెనిమిదిమాసములు భక్తులొనర్చిన పూజవలన భగవంతుడు సంతృప్తిజెంది అదృశ్యుడై యుండవచ్చునేమో గాని భక్తులకు మాత్రము ఇంకను అట్టితృప్తి కలుగలేదు. దైవస్వరూపుడైన ఆ ప్రహ్లాదగాంధి మఱికొంతకాలము తమవలన ఉపచారములను చేయించుకొనియుండి పిమ్మట ఆయన పూర్ణకళను ద్యోతక మొనర్చియుండిన-చో తమకు కొరత లేకయుండెడిది అని ఓంకారనిలయవాసులు తలంచుచున్నారు.

పరిశుద్ధాత్మ స్వరూపులారా! మనచిన్ని ప్రహ్లాదుడు కృష్ణానదీ సైకతభూమియందు గల తన సమాధిలోనుండి ఆనాడు (21—11—32 తేదీ సోమవారము ఉదయం 9 గంటలకు) లేచి తన మాతామహునకు దర్శన మిచ్చి లోకసంగ్రహార్థము తత్త్వబోధను గావింపు డని తా నిచ్చిన సమాధిసందేశమున కిట్లు వ్యాఖ్యానము నెరవేర్ప బడినదాయెను. కాని ప్రహ్లాదుని అచింత్య సందేశములోని భావ మంతయు నెంతవరకు సువ్యక్తపరుపబడినదో మేము చెప్పజాలముకాని ఆతనికోరికను సఫలపరచుటకు మాత్రము మానుషప్రయత్నము జరుపబడె ననుటకు సందియములేదు.

ప్రహ్లాదునివంటి పసిబిడ్డలను పోగొట్టుకొనిన యెందరో తల్లి దండ్రులయొక్క హృదయవేదనను చల్లార్చుట కీతత్త్వ బోధ యుద్దేశింపబడవలె నని ప్రహ్లాదుడు కోరియుండెను. ఈ కారణముచేతనే ఆతడు తనతల్లికి స్వప్నమం దనేకసార్లు కాన్పించి తన సందేశమును త్వరలో ప్రకటించ వలసినదని పదేపదే హెచ్చరించియుండెను.

కాన ముద్దుబిడ్డలను మురిపెముతో సాకి పెంచి, పెద్ద వారినిచేసి తుదకు పరమప్రేమాస్పదులైన యాకూనలను మృత్యుదేవత కర్పించిన యోతల్లులారా! మీబిడ్డలకై మీ కోమలహృదయము లెంతపరితపించుచున్నవో గ్రహించు టకు ప్రహ్లాదునితల్లివంటి తల్లులకే సాధ్యము. మఱియు, పసి కందులను తనుచేతులార పెంచి చేతులార మట్టిపాలు చేసు కొన్న యో తండ్రులారా! వజ్రతుల్యములైన మీపురుష హృదయములను నయితము మంచువలె కరిగించి గుండెలు నీరగునట్లొనర్చిన మీపుత్రవియోగదుఃఖమును భరించుటకు ప్రహ్లాదుని తండ్రివంటి తండ్రులకే విదితము. దుఃఖసాగర మున మునిగియున్న యోజననీజనకులారా! ఎంతకాలము మీరిట్లు పుత్రపుత్రికాశోకమున కృశించెదరు? సంసార భారముక్రింద నలిగిపోవుచున్న యోనరపుంగవులారా! దారి ద్ర్యబాధచే పరితపించుచున్న ఓదరిద్ర దామోదరులారా! వ్యాధిగ్రస్తకళేబరములతో వ్యాకులత జెందుచున్న ఓదు ర్బల శరీరులారా! జీర్ణావయవములతో జీవయాత్ర గడుపు చున్న ఓవయోవృద్ధులారా! వారసత్వపు వ్యాజ్యములలో

మునిగి ముప్పతిప్పలు పడుచున్న ఓజ్ఞాతి సోదరులారా! భోగ భాగ్యములుస్థిరము లని నమ్మి భగవంతుని మరచిన ఓమాయా మోహితురాలా! ధర్మమును పడనాడి దుష్కర్మపాశవశులై పారబ్ధము ననుభవించుచున్న యోదీనులారా! యేల మీరు వ్యర్థముగ వెతలపా లగుచున్నారు? ఇదెంతయు యోగమాయా కార్యమని మీరేల గ్రహింపక యుండిరో గ్రాహ్య మగుట లేదు. అజ్ఞానవ్యామోహమునుండి యికనైన లెండు. అల్లదిగో, పూర్వదిగ్భాగమున భానూదయమైనది. జ్ఞానభాస్కర ప్రభాపుంజముల యెదుట అజ్ఞానతిమిరరాశి నిలువజాలునా! ప్రహ్లాదుని సమాధిసందేశము నాలకింపుడు. ప్రహ్లాదుని లీలలను, తత్త్వబోధను శ్రవణ మొనర్చితిరేని మీవిచారమంతయు సమసిపోయి యింపు మూలమున మీమనస్సులను పరమార్థ విచారమునందు ప్రవేశపెట్టుటకు ప్రేరణము కల్గు నని మేము దృఢవిశ్వాసులమైయున్నాము. శ్రవణము చేసినపిమ్మట నీ గ్రంథములోని యంశములను మీరు మననిదిధ్యాసల నొనర్చితిరేని పరమేశ్వరుని యవ్యాజకృపవలన మీకు త్వరలో సంసారవిముక్తికూడ ప్రాప్తించగలదని యాశించుచున్నాము. విజయవాడలో నింద్రకీలాద్రిపై శ్రీకనకదుర్గాక్షేత్రమున ఓంకారనిలయమునందు శ్రీమతి జ్ఞానప్రసూనాంబయొక్క పవిత్రగర్భమున నవతరించి పదునెనిమిది మాసములు తన విచిత్రలీలలను ప్రదర్శించి తుదకు కృష్ణవేణీమహానదీ సైకతభూమియందు సమాధిజెంది, లోకసంగ్రహార్థము

"ఓం అచింత్యా"

అను ఆత్మసందేశమునుచాటి అందులో నిగూఢముగ దాగియున్న తత్త్వబోధను తన మాతామహునిద్వారా యీ విధముగ, లోకమునకు ప్రకాశింపజేసి అవతారసమాప్తి గావించిన

"ప్రహ్లాద గాంధి"

యొక్క ముద్దుపేరు భూలోకమునశాశ్వతముగ నిలుచుగాక! ఆతడు వెదజల్లిన జ్ఞానబీజములు భక్తిపరిపూరితములైన మీ హృదయక్షేత్రములయందు ప్రవేశించి ప్రథమమున లేతమొక్కలై, పిమ్మట దేశకాలాదులచే ప్రవర్ధమానములై, అనంతరము మహావృక్షములై సర్వప్రదేశములందు శాఖోపశాఖలుగ విస్తరించి యందు భక్తిపుష్పములు పూచి తుదకు విజ్ఞానఫలములు కాచి అందలి అమృతరసము జ్ఞానపిపాసులచేతను, ముముక్షువులచేతను తనివిదీర గ్రోలబడుగాక! లోకము ఆనందముచే నిండియుండుగాక, దుఃఖము దూరమగుగాక, సర్వులకు శుభము కలుగుగాక మానవలోకమున మర్త్యులకు మేలగుగాక, అంతరిక్షమున పక్షులు మనోహరముగ పాడుగాక, చెరువులోని చేపలకు చెరుపుకాకుండుగాక, జీవకోట్లకు జయము చేకూరుగాక సర్వులకు శాంతి కలుగుగాక !!

"పృథివ్యాపస్తేజోవాయురాకాశా మే శుధ్యంతామ్,
శబ్దస్పర్శరూపరసగంధా మే శుధ్యంతామ్,
మనోవాక్కాయకర్మాణి మే శుధ్యంతామ్,
ఆత్మా మే శుధ్యతామ్, అంతరాత్మా మే శుధ్యతామ్,
పరమాత్మా మే శుధ్యతామ్.

ఓమ్.

సర్వే జనా స్సుఖినో భవన్తు.

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

తత్సత్.

ఇట్లు విన్నవించు,

ప్రహ్లాదుని మాతామహుడు.



# తప్పొప్పుల పట్టిక.

## పీఠిక.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 14 | ఫలలబ్ధి | ఉపలబ్ధి |
| 5 | 6 | మును | మున |
| 11 | 2 | విషయములను | విషయములును |

## మూలగ్రంథము.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 19 | 21 | పోత్రని | పోత్రిరి |
| 32 | 20 | ఒప్పుడు | ఒకప్పుడు |
| 46 | 9 | నటు | నటుల |
| 64 | 19 | క్కదర్శన | యొక్కదర్శన |
| 72 | 13 | నాయనమ్మ | అమ్మమ్మ |
| 99 | 16 | అనిర్వాచ్యంబు | అనివార్యంబు |
| 154 | 2 | దేశీ | దేశ |
| 163 | 15 | తక్కిన | కక్కిన |
| 164 | 9 | మనః | మనసః |
| 166 | 10 | మహత్తైన | మహత్తరమైన |
| 185 | 7 | స్రాణము | ప్రాణులను |
| ,, | 17 | మాయమయా | మాయయా |
| ,, | ,, | ఉనరతో | ఉనరవ్యో |
| 188 | 6 | అన్యోన్యవా | అన్యోన్యవాజనో |
| 231 | 4 | నిష్కామమునకు | నిష్కామునకు |
| 240 | 9 | athenement | attunement |
| 243 | 1 | స్నానమును | స్నానము |
| 253 | 13 | మూందు | ముందు |
| 262 | 20 | సందేశములోన | సందేశములోని |